# ఇంటిపేర్లు

ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు

# ఇంటి పేర్లు

రచన

ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు
యం.ఏ., పిహెచ్.డి.,

నిర్మలా పబ్లికేషన్సు
సీతారామాంజనేయపేట,
మంగళగిరి - 522 503

# ఇంటిపేర్లు

ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు
ఎం.ఏ., పిహెచ్.డి.,

ప్రథమ ముద్రణ : జూన్ 2001.



ప్రతులు : 1000






ప్రతులకు :
శ్రీమతి యార్లగడ్డ నిర్మల
సీతారామాంజనేయ పేట
మంగళగిరి - 522 503
ఫోన్: 08645 -32521

# ముందుమాట

ఇంటిపేరంటే కుటుంబనామం అంతేకాని ఒక ఇంటికున్న పేరుకాదు వీటి ప్రధాన ఉపయోగం వ్యక్తులను, కుటుంబాలను గుర్తుపట్టడమే అయినా, వారి వారి ఇంటిపేర్లంటే వారికెంతో మక్కువ దాని చుట్టూ అలముకున్న కీర్తి ప్రతిష్ఠలంటే ఎంతో ప్రాధాన్యమిస్తారు అయితే వాటి అర్థాలేమిటో చాలమందికి తెలియదు ఇందులో చాల రకాలున్నాయి మన ఇంటి పేర్లలో చాల ఎక్కువ భాగం ఊళ్ల పేర్లు అవి, ఆకుటుంబాలు మొదట ఏ గ్రామంవారో తెలియజేస్తాయి వాటి వలన ఉపయోగం అంతే అయితే అలా వారి ఇంటి పేర్లుగా వున్న గ్రామాలు ఎక్కడ వున్నాయో తెలియడం దీనివలన కలిగే ఉపయోగాల్లో మరొకటి ఇవిగాక వ్యక్తులపేర్లు బిరుదునామాలు, వృత్తుల పేర్లు కూడా ఇంటి పేర్లుగా వున్నాయి వాటిని బోధపరచుకోవడం వలన, ఒకనాటి మన సమాజపు తీరు తెన్నులు అవగతమవుతాయి అందువల్ల వాటి వివరణ అవసరమవుతుంది

ఇంటిపేర్లు సంఖ్యాపరంగా చాల అధికం అన్నింటినీ వివరించడం ఒక వ్యక్తివల్ల అయ్యేదికాదు కారణం కాల, ధన వ్యయాల భారం ఇందువల్ల ఎక్కడో ఒకచోట పరిమితి విధించుకోక తప్పదు ఇందులో నేను కొన్నింటిని వివరించాను. లభ్యమైనచోట్ల శాసనస్థ ఆధారాలను చూపించాను ఇప్పటికి ఇంతమాత్రము.

ఇంటిపేర్లలో కొన్ని సామాన్యంగా వుండేపదాలుంటాయి వాటి వివరణ ఆ ఇంటిపేర్ల దగ్గర సంక్షిప్తంగా వివరించాను అలాంటి వాటి వివరణ ఇక్కడ ఇస్తున్నాను అవి వున్నచోట్ల ఈ వివరణను అనువర్తింప చేసుకుంటే బాగా అవగతమవుతుంది.

**(1) - నేని - నీడి - నీని. - న.**

సంస్కృత నాయక పదం తెలుగులో నాయకుడు ఇది నాయడుగా సంక్షిప్తతను సంతరించుకుంది దీనిని నాయుడుగా వ్యవహరించడం, వ్రాయడం జరుగుతోంది కాని నాయడు అనేదే సరియైనది ఈ నాయడు నేండు, నీండు, నేని, నీని, గా మార్పుచెందింది ఈ అన్ని రూపాలు ఇంటిపేర్లలో చోటుచేసికున్నాయి చివరకు 'స' మాత్రమే మిగిలినవి కూడా వున్నాయి ఈ ఉదాహరణ గమనించండి

ముద్దనాయకుడు - ముద్దనాయడు - ముద్దనేండు - ముద్దనీండు - ముద్దనేని - ముద్దనీని - ముద్దన

ఇందులో నీడు కమ్మవారికి పరిమితమైనది నాయుడు పదం ప్రస్తుతం ఒక కులానికి లేక వర్గానికి సంకేతమైంది. అయితే ఈ నాయక శబ్దం ప్రముఖ వ్యక్తులకు వారి కులంతో నిమిత్తం లేక అందరికీ, బ్రాహ్మణులతో సహా వర్తించిన వైనం శాసనాల్లో కన్పిస్తోంది

**- ఓజా, - వఝు, - వఝుల, - వజ్ఝా..**

ఉపాధ్యాయ శబ్దం ప్రాకృతంలో ఓఝూగా పరిణమించింది. మిగిలినవన్నీ దాని రూపాలు మూలం ఉపాధ్యాయ శబ్దమే అయినా, దాని పరిణామ రూపాల అనువర్తనంలో కొంత భేదం వచ్చింది ఓజ శబ్దం పంచాణం వారికి పరిమితంకాగా, వఝుల శబ్దం బ్రాహ్మణులకు పరిమితమైంది కమ్మరి, కంసాలి, వడ్రంగి, కంచరి, కాసె అనే అయిదు వృత్తుల వారిని పంచాణం వారు అంటారు

**- పెద్ది :**

ఇది వ్యస్తంగా కూడా గృహనామంగా వుంది

పెద్దశబ్దం నుండి మాన్యుడు, పెద్ద అనే అర్థాల్లో వ్యవహారంలోకి వచ్చింది. ఇది ఒక విధంగా ప్రభువు చేత గుర్తింపబడిన గ్రామపెద్దలకు, కుల పెద్దలకు సంతతనామంగా నిలిచింది అన్ని వర్గాలవారిలోను వుంది. చిత్తూరు జిల్లాలో ఈ వ్యవస్థ పిన్నపెద్ద అనే వ్యవహారంలో వుంది.

**- బత్తిన, - బత్తుల :**

దీనికి మూలరూపం భక్తుడు భక్తుని బత్తినగా, బహువచనరూపంగా బత్తులగా కుదురుకుంది ఇది ఎవరికైనా వర్తిస్తుంది అయితే సాధారణ వ్యవహారంలో బత్తుల శబ్దం పంచాణం వారికి స్థిరపడింది దీనికి కారణం భక్త శబ్దానికి assigned, engaged in, serving అనే అర్థాలు వుండడం

**- భట్టు, - భట్ల - భట్టర్ :**

స్వామి, యజమాని, ప్రభువు అనే అర్థాలు దీనికున్నాయి ప్రభువులను సంబోధించే పదంగా కూడా దీనికి ఉపయోగముంది ప్రభువులను కీర్తించేవాడు లేక అర్థి దానిని రచించిన వానిని కూడా భట్టు శబ్దంతో సంభావిస్తారు కాగా పండితులైన బ్రాహ్మణులకు పట్టపుపేరుగా కూడా వర్తిస్తుంది కొన్ని సందర్భాల్లో బ్రాహ్మణులుకాని పండితులను కూడా ఈ పదంతో గౌరవించడం కద్దు వంది కులం వారిని భట్రాజులని వ్యవహరించడముంది భట్టార, భట్టారక, అనేవి పర్యాయపదాలు ఆంధ్రమహాభారత కర్త నన్నయ తనను తన మిత్రుడు నారాయణుని భట్ట శబ్దంతో చెప్పికున్నాడు అగ్ని, శ్రీకృష్ణుడు, వ్యాసమహర్షి - వీరు భట్టారక శబ్దంతో సంభావింపబడ్డారు.

**- రాజా :**

ఇది రాజ శబ్ద సంబంధి. ప్రభువులకు, నియోగ బ్రాహ్మణుల, ముఖ్యంగా గ్రామాధికారులైన వారు, వందికులం వారు ఈ శబ్దంతో ప్రముఖంగా సంభావింపబడ్డారు ఇతరుల్లో కూడా వ్యక్తినామంలో చోటు చేసికుంది

-బోయిన, - బోల :

దీనికి మూలం బోయ బోయ ఒక కులం కూడా భోజ శబ్దం నుండి ఉత్పన్నమైనది ఇది ఒక పదవి దేవాలయానికి దానం చేయబడిన పశువులను గ్రహించి, సాక్షి, దానకర్తల నిర్దేశించిన మేరకు దేవాలయ అఖండ దీపానికి నేయి నిరంతరాయంగా అందించడం ఇతని విధి. ఆ పశువుల సంతతి అతనికే చెందుతుంది బోల గౌరవార్థంలో వచ్చిన బహువచన రూపం

- రెడ్డి :

ఒక వర్గపు పేరు ఇది రాష్ట్రకూట శబ్ద సంబంధిగా భావించడం జరుగుతోంది కాని ఇది రారోడ్ శబ్దం నుండి వచ్చింది రారోడ్, రట్టొడు, రట్టోడి రడ్డి, రెడ్డి అనేవి దీని రూపాలు వీటి అన్నింటికి శాసనాల్లో ప్రయోగాలు వున్నాయి రడ్డి శబ్దాన్ని తెనాలి రామకృష్ణుడు ప్రయోగించాడు రారోడ్ అనేది రాజస్థానీ పదం రారోడ్ అనే వర్గపు జనం అక్కడ వున్నారు ఇది రాష్ట్ర శబ్ద సంబంధి ప్రభుతకు అధికారానికి సంకేతం అనంతర కాలంలో గౌరవసూచిగా పరిణమించింది అందువలన గ్రామాధికారులు, ఇతర ముఖ్యులు కూడా రెడ్డి శబ్దంతో సంభావింపబడ్డారు

-శెట్టి :

ఇది శ్రేష్ఠ పదం నుండి ఉత్పన్నమైనది ముఖ్యుడు, ఏదైనా వృత్తిలో నిపుణుడు, వ్యాపార వర్గ సమూహంలోని ముఖ్యుడు, అలాంటి సంఘానికి అధ్యక్షుడు అయిన వానిని శ్రేష్ఠశబ్దంతో సంభావించారు అనంతరం వ్యాపారం చేసేవారికి, పరిమితమయింది అయితే చేనేత వారిని (సాలె) కూడ శెట్టి శబ్దంతో సంభావించడముంది

మిగిలిన పదాలు ఆయాచోట్ల వివరింపబడ్డాయి ఇంటిపేర్ల వివరణపై ఇదొక ప్రయత్నం ఇందుగల దోషాలను సూచిస్తే కృతజ్ఞతతో గ్రహిస్తాను

దీనిని అంకితమిస్తానని శ్రీ సోమూరి వెంకట్రామయ్యగారికి చెప్పిరెండేళ్లయింది ఇప్పటికి చేయగలిగాను ఆలస్యాన్ని మన్నించారు వారికి నమస్సులు

దీనిని తయారు చేసే సమయంలో, నాకుటుంబ సభ్యులంతా నన్ను ఓరిమితో భరించారు ముఖ్యంగా నా సోదరుని కుమారుడు చి ప్రవీణ్, M Sc. ఎంతో సహకరించాడు వీరందరికి ఆశీస్సులు చివరి నిముషంలోనే అయినా, విలువైన సహకారం అందించాడు మా డా॥వేదాంతం రాజగోపాలచక్రవర్తి అతనికి అభినందనలు

స్వల్పకాలంలో దీనిని ఇంత అందంగా ప్రచురించిన ప్రింట్‌ప్లాజా అధినేత శ్రీ పాములపాటి సాంబిరెడ్డి గారికి, వీరి కార్యాలయ ఉద్యోగులు శ్రీమతి గాలిశెట్టి వనజ గారికి, దేవరపల్లి రామకృష్ణారెడ్డి గారికి కృతజ్ఞతలు

మంగళగిరి
20-6-01

బ్రాహ్మణదాసుడు
యార్లగడ్డ బాలగంగాధరరావు.

# అంకితం



కృతిభర్త

**శ్రీయుత సోమూరి వెంకట్రామయ్యగారు**

స్వాతంత్ర్య సమర యోధులు, సాహిత్యాభిమానులు,

వితరణ శీలురు, విజయవాడ గాంధి.

# ఇంటి పేర్లు

**అక్కన ప్రగడ:** వ్యక్తినామం అక్కన పై ప్రగడ చేరింది అక్క జ్యేష్ఠసోదరిని సంకేతిస్తుంది అయితే అక్కయ్య వంటి పురుషనామాలు కూడావున్నాయి సంస్కృతంలోని అక్కా శబ్దం తల్లిని సంబోధించేపదంగా వ్యవహారముంది. అయితే ఇది సంస్కృత భాషకు నిసర్గంకాదు. లాటిన్ లో 'అచ్చ' పదం పై ఉపయోగంలోవుంది సంస్కృతంలో అ అంటే తాత కూడ. దగ్గరి బంధుత్వాన్ని సూచించే పదాలు అన్నీ (అక్క,అమ్మ, అయ్య,అబ్బ, అన్న.) అకారంతో వుండడం విశేషం. ప్రగడ అంటే రాజోద్యోగి. మంత్రి కన్నడంలోని హెగ్గడ. హెగ్గేకూడ ఇలాంటివే అయితే మరో ప్రగడ గ్రామనామల్లో కన్పిస్తుంది అట్లప్రగడ, వెంట్రపగడ.

**అక్కపెద్ది - అక్కిపెద్ది :** వ్యక్తినామం అక్కశబ్దంపై పెద్ది పెద్ది పెద్దశబ్దం నుండి వ్యుత్పన్నమైనది అయితే కొన్ని సందర్భాల్లో గ్రామపెద్దను, మరికొన్ని సందర్భాల్లో రాజోద్యాగాన్ని సూచిస్తుంది రాయలసీమలో ముఖ్యంగా చిత్తూరు జిల్లాలో, గ్రామ ముఖ్య వ్యవహర్తను పిన్నపెద్దగా వ్యవహరిస్తారు.

**అక్కబత్తుల :** వ్యక్తినామం అక్క శబ్దంపై బత్తుల. బత్తుల బత్తి శబ్దానికి బహువచనం. బత్తి భక్త శబ్ద భవం.

**అక్కాపంతుల :** వ్యక్తినామం. నామాంతంలో దీర్ఘం. పంతులు ఔపవిభక్తిక రూపం పంతుల ఉత్తరాదివ్యవహారంలో పంత్ పో చూ. మోరోపంత్. తెలుగునాట ఉపాధ్యాయులకు, బ్రాహ్మణులకు ఇది సంకేతంగా నిలిచింది. వ్యక్తినామాల్లోని పంతుల బ్రాహ్మణులకు పరిమితం.

**అక్కినేని - అక్కిన :** వ్యక్తినామం. అక్క అక్కిగా పరిణమించి, దానిపై నాయకశబ్దభవమైన నేని చేరింది అక్కిన దానిసంక్షిప్తరూపం. అక్కినేని నాగేశ్వరరావు ప్రముఖ సినీ నటులు.

**అక్కిరెడ్డి :** వ్యక్తినామం. అక్కిరెడ్డిగూడెం ఏలూరు తాలూకాలో వుంది.

**అక్షతల - అక్షింతల :** అక్షతలు వ్యవహారంలో అక్షింతలుగా స్థిరపడింది. క్షతము కానిది అక్షత అంటే, చిరగనిది, విరగనది, చెడనిది అనే అర్థాల్లో ఇది వర్తిస్తుంది. ఫలితార్థము శాశ్వతముగా వర్తిల్లునది శుభమైనది అని. చేతులతో పొట్టు తీయగా వచ్చిన బియ్యానికి పసుపు కలపడం వలన అక్షతలు సిద్ధిస్తాయి ప్రతి శుభకార్యానికి ఆశీస్సులందించేటపుడు

వీనిని వినియోగిస్తాము. కర్కాటక శృంగి అనే మొక్కకు కూడ ఇదిపేరు సురభి సంతతివారిని కూడ అక్షత శబ్దంతో సంభావించడముంది. సురభి ఒక గోవు దక్షపుత్రికగా, కశ్యప ప్రజాపతి భార్యగా, గో సంతతికి రుద్రగణాలకు తల్లిగా సంభావింపబడింది బ్రాహ్మణుల్లో ఇంటిపేరుగా కన్పిస్తుంది శా శ 1511నాటి విజయవాడ శాసనాల్లో ఒక అక్షతల తిరుమలభట్టు పేర్కొనబడ్డాడు. మల్లికార్జున స్వామి గుడికి మెట్లు కట్టించింది ఇతడే.

**అగస్త్యరాజు :** అగస్త్య, రాజు శబ్దాల కలయిక వలన ఇది ఏర్పడింది అగస్త్యుడనే మహర్షి ఋగ్వేదంలో మిత్రావరుణులకు ఊర్వశి వలన జన్మించిన వానిగా చెప్పబడింది. అగ అంటే పర్వతం. అస్తి అంటే త్రాగువాడు అని అర్థం. పరమేశ్వరునికి గల పేర్లలో కూడ అగస్త్య ఒకటి. అగస్త్య మహర్షి దక్షిణాదికి తరలివచ్చేవేళ, హిమాలయ పర్వతం పై స్పర్ధకారణంగా వింధ్యపర్వతం పెరిగిపోయినపుడు, తనకు దారి ఇవ్వమని, తాను వచ్చేవరకు, అలాగే వుండమని కోరాడని, తరువాత ఆయన ఉత్తరాదికి వెళ్లలేదని, తత్కారణంగా వింధ్య అలాగే ఉండి పోయిందని పురాణగాధ. దక్షిణ భారతాన్ని నాగరక ప్రాంతంగా తీర్చి దిద్దింది అగస్త్యుడేనని చెప్తారు అలాగే ఆయన సముద్రాలను ఔపాసన పట్టాడని చెప్తారు

ఇక ఇంటిపేరు, ఆ పేరుగల వ్యక్తిపేరు మీదుగా ఏర్పడింది రాజు అనే ద్వితీయావయవం నియోగి బ్రాహ్మణకుటుంబాలలోను, వందికులం వారిలోను క్షత్రియుల్లోను సాధారణంగా కనుపించే పదం.

**అగ్నిహోత్రం:** అవహనీయము, దక్షిణాగ్ని, గార్హపత్యము అనే మూడింటిని త్రేతాగ్నులుగా సంభావిస్తారు. అగ్నిహోత్రమంటే విధి విహితంగా అగ్నిని వ్రేల్చుట. పాలు, నూనె, పులుసులతో అగ్నిని వ్రేల్చడం జరుగుతుంది. అలా నియమంగా అగ్నిని పూజించే వారు అగ్నిహోత్రులు. వీరిలో నిత్యాగ్నిహోత్రులు, కామ్యాగ్నిహోత్రులు అని రెండు విధాలు. సతతము అగ్నిని వ్రేల్చేవారు నిత్యాగ్నిహోత్రులు వీలును బట్టి, అవసరాన్ని బట్టి అగ్నిని సంపూజించేవారు కామ్యాగ్నిహోత్రులు. ఈ ఇంటిపేరు బ్రాహ్మణుల్లో ముఖ్యంగా వైఖానస కుటుంబాల్లో కన్పిస్తుంది.

**అగ్రహారం :** వెనుకటికాలంలో, ప్రభువులు, పండితులకు, కవులకు, గాయకులకు, గ్రామాలను దానంగా ఇచ్చేవారు బ్రాహ్మణులకు ఇచ్చినవాటిని ప్రధానంగా అగ్రహారాలనే వారు అయితే ఇతరులకు ఇచ్చినవాటిని కూడ అగ్రహారాలన్నారు ఈ శబ్దం అగ్ర, హార శబ్దాల వలన ఏర్పడింది అగ్ర అంటే మొదట, చివర- దేనినైనా, సంభావింపవచ్చును. హార అంటే భూమి, భూఖండము. అంటే ఏదైనా ఒక గ్రామంలో, ఒక చివర దానంగా ఇవ్వబడిన భూభాగమని అర్థం అనంతరకాలంలో గ్రామాన్ని మొత్తంగా కూడ ఇవ్వడం జరిగింది.

అగ్రహారం అనే పేరుతో అనంతపురం జిల్లా అనంతపురం తాలూకాలో ఒక గ్రామముంది. ఇతర జిల్లాల్లో కూడ వుండవచ్చు అది నివాసం కావడం కారణంగా, కొన్ని కుటుంబాలకు అది గృహనామమైంది

**అంకిరెడ్డి :** వ్యక్తినామం. అంకి, అంక శబ్దం నుండి వ్యుత్పన్నము అంకశబ్దానికి, గుర్తు ముద్ర, మూర్తి వంటి అర్థాలున్నాయి అంకమ్మ ఒక దేవత మానవుడు ప్రకృతికి మారుగా స్త్రీ మూర్తిని దైవంగా కల్పించుకున్నాడు. (గుర్తు). గుర్తుకు, మూర్తికి సంకేత శబ్దమైన అంక శబ్దం పేరుగా స్థిరపడింది ఇట్లు అంకినీడు, అంకం, అంకంరాజు

**అంగడి :** పచారి సరుకులు మొదలైన వాటిని అమ్మే చోటును అంగడి అనడం తెలిసిందే. అయితే అంగళ్లు అనే గ్రామం చిత్తూరుజిల్లా కాళహస్తి తాలూకాలో వుంది. ఇంటిపేరుకు బహుశా ఇది కారణమై వుండవచ్చు. పెదకాకాని దేవాలయంలోని వీరభద్రుని అంగడి వీరభద్రునిగా చెప్పబడింది

**అంగడి నాయుని :** వ్యక్తినామం శా శ 1332 సింహాచల శాసనంలో ఒక అంగడి నాయుని నాగిశెట్టి ప్రస్తావన వుంది.

**అంగర :** తూర్పుగోదావరి జిల్లా రామచంద్రాపురం తాలూకా గ్రామం

**అంగిరేక :** శా శ 1071 నాటి బాపట్ల శాసనంలో ఒక అంగరిక జక్కనబోయని ప్రస్తావన వుంది. ఇది అంగరక్షకు మారు రూపం. అంగిరేకుల వారు కూడా వున్నారు

**అజ్జి :** శా శ 1178 నాటి శ్రీకూర్మ శాసనంలో సింహళదేశస్థురాలైన అజ్జకేశవ దేవుని కుమార్తెగాయక భాగలదేవి ప్రస్తావన వుంది గ్రామనామపూర్వపదంగా అజ్జాడ లోగలదు.

**అడపా : అడపం :** తమలపాకులతో సహా తాంబూలానికి కావలసిన వివిధ ద్రవ్యాలను ఉంచే పెట్టెకు అడపం అనిపేరు. దానిని తమ దగ్గర వుంచుకొని, రాజుకు, తాంబూలాన్ని అందించే వారు అడపం వారు సంస్కృతంలో వీరినే కరండ వాహకులు అంటారు. అయితే ఇది సామాన్యమైన ఉద్యోగంకాదు ప్రభు కుటుంబానికి అత్యంత విశ్వాసపాత్రులైన వారిని, తరతరాలుగా వారిని సేవిస్తున్న కుటుంబాల వారినే ఇందులో నియమించేవారు. కారణం ఏమంటే ప్రభువు యొక్క క్షేమం, భద్రత అనేవి ఇందులో ఇమిడివున్నాయి.

చరిత్రలోకి వెళితే, బ్రహ్మనాయుడు, కోడి పందేలకు వెళ్తున్న సందర్భంలో తనతో రావలసిన ముఖ్యులలో ఒకరిగా అడప కేశవ దాసిని ఎంపిక చేశాడు. అతడు కృత్యవేదిగా శ్లాఘింపబడ్డాడు అయితే అడపామూడి అనేగ్రామం నూలూరుపేట తాలూకాలో వుంది

**అడవి - అడివి :** ఈరెండు రూపాల్లోను గ్రామనామం వర్తిస్తోంది. అరణ్యమనే అర్థంలో ఇది తెలిసిందే. పాఠశాలల్లో అడవి ప్రకృతిగాను (సంస్కృతం) అటవి వికృతిగాను చెపుతారు. కాని సంస్కృతీయుల వ్యవహారం అటవి మాత్రమే. ఇంతకూ గృహనామంగా రావడానికి

కారణం ఆ పేరుగల గ్రామనామమే ఇది గుంటూరుజిల్లా బాపట్ల తాలూకాలో వుంది ఈ ఇంటిపేరుతో ప్రసిద్ధులు బాపిరాజుగారు

**అడవికొలను:** గ్రామనామం శా శ 1141నాటి తెనాలితాలూకా కొమ్మూరు శాసనంలో ఒక అడవికొలను అయ్యమనాయకుని ప్రస్తావనవుంది .

**అడారు (రి):** పాలకొండ తాలూకాగ్రామం.

**అడిగొప్పుల: అడిగోపుల :** గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలోవుంది కొందరు అడిగోపులగా వ్రాస్తారు

**అడిదం:** అడిదం అంటే ఖడ్గము అడిదం సూరకవి ప్రసిద్ధుడు త్రిపురాంతక శాసనంలో (శా శ 1216) ఒక అడిదం మల్ల ప్రస్తావనవుంది. పౌరుషనామంగా వచ్చింది

**అడుసుమల్లి (మిల్లి):** ఈ పేరుగలగ్రామం గుంటూరుజిల్లా బాపట్ల తాలూకాలో వుంది

**అంట్లోవ - అంటిలోవ :** గొలుగొండ ఏజెన్సీగ్రామం

**అత్తలూరి :** అత్తలూరు అనేగ్రామం సత్తెనపల్లి తాలూకాలో వుంది.

**అత్తిలి :** ఈ గ్రామం పశ్చిమగోదావరి జిల్లా తణుకు తాలూకాలో వుంది

**అత్తోట :** గుంటూరుజిల్లా తెనాలి తాలూకాగ్రామం

**అద్దంకి :** ప్రకాశంజిల్లాలో గుండ్లకమ్మ నదీ తీరాన గల గ్రామం. రెడ్డిరాజుల మొదటిరాజధాని.

**అద్దేపల్లి :** గ్రామనామం. రేపల్లె, గూడూరు తాలూకాల్లో వుంది.

**అధికారి :** అధిపతి, ప్రభువు, శాఖాధిపతి, ప్రభుత్వోద్యోగి రాజప్రతినిధి అనే అర్థాల్లో ప్రవర్తితము శా శ 1177 నాటి త్రిపురాంతక శాసనాల్లో ఒక పోచనప్రగడ సర్వాధికారిగా చెప్పబడ్డాడు. అధికారిపల్లె చిత్తూరు తాలూకాగ్రామం

**అధ్వాన్నం :** అధ్వాన్నం నారాయణ కట్టుబడి అనేగ్రామం రాపూరు తాలూకాలో వుంది ఈ పదానికి మార్గము, చోటు అనే అర్థాలతోపాటు వేద సమీక్ష అని కూడా అర్థం వుంది

**అనంతనేని :** వ్యక్తినామం అనంతుడు ఆదిశేషుడు నేని నాయక శబ్ద సంబంధి

**అనంతభట్ల :** వ్యక్తినామం. అనంతభట్లఖండ్రిక కందుకూరు తాలూకాగ్రామం

**అనంతవఝుల :** వ్యక్తినామం. వఝుల ఉపాధ్యాయ శబ్దభవం.

**అనిపెద్ది :** శా.శ 1319నాటి సింహాచలం శాసనంలో ఒక అన్యపెద్ది అనే వక్తి ప్రస్తావన వుంది. ఇక్కడ ఇది గృహనామం కాదు. అన్ని పెద్ది అనే గృహనామం వర్తించడానికి ఇలాంటి పేరుగల వ్యక్తినామం మూలమని చెప్పడానికి ఈ ఉదాహరణ గ్రహింపబడింది

అన్న శబ్దాన్ని శాసనాలలో అన్యగా వ్రాయడం జరిగింది దీనికి మూలం అన్నియ ఇట్లే అనిసెట్టి

**అనుమంచి :** ఇది ఒక రకంగడ్డి ఎలమంచి, కారుమంచి, తలమంచి అనేవి కూడా ఇలాంటివే అవి ఊళ్లపేర్లుగా వున్న సంగతి తెలిసిందే. కామంచి అనేమొక్క బాగా పరిచయమైనదే అయితే అనుమంచి వ్యస్తంగా గ్రామనామంగా ఉన్నట్లు దాఖలాలేదు అనువుంచివల్లె అనే గ్రామంవుంది ఇలా,వల్లె, పాడు, అనుబంధాలు లేకుండా,గ్రామనామంలోని పూర్వభాగం మాత్రమే గృహనామాలు అయిన తీరులేకపోలేదు ఆకిరి (పల్లె) ఎడ్ల (పాడు, పల్లి), చెరుకు(పల్లి) మొదలైనవి ఇలాంటి వాటికి కొన్ని ఉదాహరణలుగా చూపవచ్చు

**అనుమోలు :** ఇది గ్రామనామం నిడుమోలు,చనుమోలు ఇలాంటివే ప్రోలు అనే శబ్దం, బ్రోలు, బోలు, మోలుగా పరిణమించింది ప్రోలు అంటే కోశాగారముండే గ్రామం

**అన్నంగి :** ప్రకాశంజిల్లా గ్రామం

**అన్నదానం :** అర్థం స్పష్టము శా శ 1332 నాటి అహోబిలం శాసనాల్లో అన్నదానం అవుభళయం గారి ప్రస్తావన వుంది

**అన్నపనేని :** అన్నపనాయక శబ్దంనుండి ఉత్పన్నమైనది. అన్నపనీండు, అన్నపనేండుగా కూడా వ్యవహారంలో వుంది శా శ 1191 నాటి అమరావతి శాసనాల్లో ఒక వలంగలేటి అన్నపనేండు పేర్కొనబడ్డాడు

**అన్నప(పు)రెడ్డి :** ఈ గృహనామ రెడ్లలోను, ఇతర వర్గాలవారిలోను కన్పిస్తుంది. ఇది వ్యక్తినామం. అన్నప్ప అనేది అసలునామం శా శ 1175 నాటి విజయవాడ శాసనంలో పినమల్లూరి ముత్తిరెడ్డి కుమారునిగా ఒక అన్నపురెడ్డిని పేర్కొనడం జరిగింది

**అన్నమరాజు :** గుత్తితాలూకా గజరాంపల్లి శాసనంలో (శా శ 1466) మండలేశ్వరుడైన అన్నెమరాజు వీరయబోయని ప్రస్తావన వుంది అన్న అమ్మల కలయిక అన్నమ

**అన్నంభట్ల - అన్నం భొట్ల :** వ్యక్తినామం వ్యవహారంలో భట్ల శబ్దం భొట్లగా పరిణమించింది

**అన్నవరపు - అన్నవరం - అన్నారం :** అన్నవరంపై ఔప విభక్తికరూపం అన్నవరపు. ఈపేరుతో చాలా గ్రామాలున్నాయి. సత్యనారాయణ స్వామి ఆలయం గల అన్నవరం తూర్పుగోదావరి జిల్లాలోనిది. ఇంకా గుంటూరు జిల్లాలో రెండు, కృష్ణాజిల్లాలో మూడు గ్రామాలున్నాయి. ఇంకా వుండవచ్చును

**అన్ని :** ఇది అన్నశబ్దసంబంధి శా శ 1340 నాటి సింహాచలం శాసనంలో ఒక అన్ని పడ్మిరాయని ప్రసక్తిగలదు.

**అన్నె:** శా శ. 1363 నాటి సింహాచలం శాసనంలో ఒక అన్నె సాహసమల్లుని ప్రస్తావన వుంది. అన్న, అన్య, అన్నియ, అన్నే అనే విధంగా పరిణమించింది

**అన్నెబోయిన :** వ్యక్తినామం. అన్నెబోయినపల్లి కందుకూరు తాలూకాలో వుంది. అన్నబోయిన కృష్ణంపల్లె కనిగిరి తాలూకాలో వుంది. బోయిన బోయడు శబ్దంనుండి వ్యుత్పన్నమైనది చూడు. పీరిక.

**అందలూరి :** అందలూరుకు ఔపవిభక్తిక రూపం. శా శ 1458 నాటి మార్కాపురం శాసనంలో ఒక అందలూరి తిప్పాజ్యోస్యుల ప్రసక్తిగలదు.

**అందె :** శా శ 1170 కొణిదెన శాసనంలో ఒక అందె కొమ్మ ప్రస్తావన వుంది చూడు అందెల

**అందెల :** కాలికి వేసుకునే అందెలు తెలిసినవే ఇది వాటితో వ్యాపారం చేసేవారికో, లేక పౌరుషసూచకంగా ధరించే వారికో గృహనామంగా వచ్చి వుండవచ్చునని చెపుతారు నిజానికి అందలూరు అనేగ్రామనామపు ప్రథమాయవం, గృహనామమైంది శా శ 1484 నాటి వినుకొండ శాసనంలో ఒక అందెల వీరయ్య ప్రస్తావన వుంది

**అప్పరాజు :** వ్యక్తినామం అప్ప అనేపదానికి తండ్రి అనే అర్థంలోను వ్యక్తినామాంత్య పదంగాను, (రామప్ప, గంగప్ప) కేవలం సంబోధనలో కూడా వ్యవహారముంది దానిపై రాజు చేరింది ఇది క్షత్రియుల్లో, నియోగి బ్రాహ్మణుల్లో, వందికులం వారిలో వ్యక్తినామాంత్యపదంగా సాధారణంగా కనిపిస్తోంది. అతడు ప్రసిద్ధుడు కావడం వలన, తరువాత ఆ కుటుంబాలవారికి గృహనామమైంది

**అప్పాజోస్యుల :** వ్యక్తినామం. అప్పశబ్దం దీర్ఘమై, ఆపైన జోస్యుల చేరింది. అప్ప అనే వ్యక్తి వృత్తిరీత్యా జోస్యం చెప్పే వారు కావడం వలన, అతడు ప్రసిద్ధుడు కావడం వలన, తరువాత అతని కుటుంబీకులకు గృహనామమైంది రాజాస్థానాల్లో జోస్యులు ఒక పదవి

**అప్పికట్ల :** ఈ పేరుతో కృష్ణా గుంటూరుజిల్లాల్లో గ్రామాలున్నాయి

**అప్పినేని - అప్పానేని :** అప్ప శబ్దసంబంధి శా శ. 1302 నాటి సింహాచలం శాసనంలో ఒక అప్పయనాయక వల్లభన్న ప్రస్తావింపబడ్డాడు.

**అబ్బినేని - అభినేని -వ్యక్తినామం :** అబ్బి శబ్దం అబ్బ పదంనుండి వ్యుత్పన్నమైంది. అబ్బిగాడు అనడం తెలిసిందే. అబ్బాయికూడ అబ్బ, అయ్యల కలయిక వలన వచ్చింది అబ్బ అనే పదం తండ్రిని సంకేతిస్తుంది. ప్రాంతీయంగా అప్పకూడా ఇదే అర్థాన్నిస్తుంది అయితే కోస్తాజిల్లాల్లో అప్ప, జ్యేష్ఠసోదరి అని సంకేతిస్తుంది నేని నాయక శబ్దంనుండి వ్యుత్పన్నమైంది అభినేని దాని రూపాంతరం శౌచక్రియలు పాటించడం లోని ఇబ్బందుల వలన, ఒకే గృహనామం గల కుటుంబాలు,కొన్ని మార్పులతో తమ గృహనామాలను కొంత మార్పుచేసి వ్యవహరిస్తున్నారు.

**అబ్బూరు:** గ్రామనామం. అబ్బూరి రామకృష్ణారావు ప్రముఖులు.

**అమరదేవర** : సూర్యదేవర గృహనామం తెలిసిందే అమరులు అంటే దేవతలు బహుశా ఇక్కడ ఇంద్రునికి సంకేతం గావచ్చు ఇదేదీగాక అమరదేవర వ్యక్తినామంగావచ్చు. అమరదేవర గుడ్డ అనేగ్రామం హుల్లిగి తాలూకాలో వుంది.

**అమరా - అమర** : శా శ 1271 నాటి సింహాచల శాసనంలో వైశ్యుడైన ఒక అమర పడిరాయని ప్రస్తావన వుంది చూడు అమరాం

**అమరాం** : పాలకొండ తాలూకాలో అమరాం అనేగ్రామం వుంది

**అమరినేని** : వ్యక్తినామం అమరుడు దేవత నాయంకరాల్లో అమరనాయంకర మొకటి . శా శ 1158 నాటి విజయవాడ శాసనాల్లో దుర్జయ వంశస్థుడు వెలంకోట మత్తాన్వయుడైన విప్పర్ల అమరినాయకుడు పేర్కొనబడ్డాడు శా.శ 1484 నాటి రాయచోటి శాసనంలో ఒక అమరినాయని వెంగళనాయని ప్రస్తావన వుంది ఇతడు మండలేశ్వరుడైన జిల్లెళ్ల రంగపతి జయ్య దేవ మహారాజుల అయ్యవారి కార్యకర్తగా చెప్పబడ్డాడు అమరశబ్దంపై నేని

**అమరేశం** : బహుశా అమరేశ్వర మీదుగా వచ్చియుండ వచ్చును లేక వ్యక్తినామం గావచ్చును.

**అమళ్లదిన్నె** : అనంతపురంజిల్లా తాడిపత్రి తాలూకా గ్రామం. అమళ్ల అనేది ఒక చిరుధాన్యజాతికి చెందిన మొక్క దిన్నె అంటే పరిసరాల్లో ఎత్తైన భూభాగం నెమళ్లదిన్నె, జమ్ములదిన్నె పేర్లతో గూడా గ్రామాలున్నాయి.

**అమృతవల్లి** : గ్రామనామం. శా శ 1043 నాటి ముఖలింగం శాసనంలో ఒక అమృతవల్లి చామినాయకుని ప్రస్తావన వుంది అమృతాలు అనేగ్రామం వుంది

**అమృతసూరి** : వ్యక్తినామం. సూరి పండితుల పట్టపుపేరు. శా.శ. 1091 నాటి ద్రాక్షారామ శాసనంలో, చోడయరాజుల ప్రధానిగా ఒక అమృతసూరి ప్రస్తావన వుంది.

**అమ్మనూరి** : గ్రామనామం. అమ్మనూరు అనే గ్రామం అర్కోణం తాలూకాలో వుంది.

**అమ్మిన** : కొనుగోలు, అమ్మకాలతో సంబంధమున్నది కాదు ఇది వ్యక్తినామసూచి దీని పూర్వరూపం అమ్మినాయని వ్యవహారంలో అమ్మిన అయింది నాయకశబ్దం నాయనిగా పరిణమించి నేనిగా రూపుదాల్చింది అయితే అలా కూడా నిలబడకుండా కేవలం 'న' మాత్రమే నిలిచింది బొప్పన కూడా ఇలాంటిదే బొప్పనేని దీనికి పూర్వరూపం. ఇలా ఏర్పడడానికి రెండు కారణాలున్నాయి. ఒకటి వ్యవహర్తల అలసత్వం. రెండవది కాలక్రమంలో కుటుంబాలు పెరగడం, శౌచ కర్మాదికాలవలన శుభకార్యాలకు అటంకాలు ఏర్పడడం కారణంగా, కుటుంబాలు కొన్ని కుదుళ్లుగా విడిపోయాయి. ఆ కారణంగా ఇంటిపేరు రూపాన్ని కొంత మార్చుకోవడం జరిగింది. త్రిపురనేని, తిపిర్నేనిగా మారడం ఇలాంటిదే. కనుక అమ్మినేని అమ్మినగా మారడంలో ఈ రెండు కారణాలలో ఏదో ఒకటి జరిగి యుంటుంది. ఈ కుటుంబాలకు మూలపురుషుడైన అమ్మినాయకుని పేరు మీదుగా

ఈ ఇంటిపేరు ఏర్పడింది ఇలాంటి సందర్భాల్లో ఇదే ఇంటిపేరు రెండుమూడు కులాల్లో కన్పిస్తే వేరు వేరు వ్యక్తులు అమ్మినాయక పేరుగలవారు ఆ కుటుంబాలకు మూలపురుషులైనారని భావించాలి.

అమ్మ, తల్లి అనే అర్థంతో సాధారణంగా స్త్రీత్వాన్నే బోధిస్తున్నా పురుష నామాల్లో కూడా చోటు చేసుకుంది. అమ్మయ్య మొదలైన విధంగా పేర్లు గల వ్యక్తులున్నారు అమ్మ పదంపై అయ్య చేరి అమ్మయ్య కాగా, మరో రూపంలో అమ్మాయి అయింది కూర్మయ్య, కూర్మాయి, లక్ష్మయ్య, లక్ష్మాయిగా మారడం, పిలుపులోని దగ్గరితనాన్ని, గౌరవాన్ని సూచిస్తుంది వ్యస్తంగా ఆడపిల్లలకు సంబోధన వాచకం. విశాఖజిల్లా వారి ఉచ్చారణలోని 'అయ్'కు మూలం అయ్య

**అంపోలు :** శ్రీకాకుళం తాలూకాగ్రామం. అంపోలు సీతారాంపురం అనేగ్రామం కూడ ఈ తాలూకాలో వుంది

**అంబడిపూడి అంబటిపూడి - అంబటి :** గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాగ్రామం అంబటి కూడ గృహనామం అంబడి అనేది ఒక మొక్క నేతి బీరకాయలను అంబడి బీరకాయలని కూడా అంటారు.

**అంబాల :** గ్రామనామం శా శ 1386 నాటి శాయింపేట శాసనంలో భరద్వాజగోత్ర అంబాల మల్లా యొఝుల ప్రస్తావన వుంది.

**అయాచితుల:** వ్యవహారంలో ఆయాచితులగా వినబడుతుంది యాచకుడు అంటే అడుగువాడు, భిక్ష కోరువాడు అనే, అర్థంలో రూఢం కాగా యాచితుడు అడుగబడువాడు అయాచితుడు అడుగబడని వాడు, కోరబడనివాడు అని అర్థం యజ్ఞయాగాదికాలు జరిపేటప్పుడు చాలామందిని ఆహ్వానిస్తారు. కొన్ని సందర్భాల్లో కొందరిని పిలవడం కుదరకపోవచ్చు. అలా పిలవకపోయినా వచ్చేవారికిది వర్తిస్తుంది మరికొన్ని సందర్భాల్లో తెలియనివారు కూడా జరుగుతున్న కార్యక్రమాన్ని గూర్చి విని తమంత తాము వస్తారు. ఇది వారి ఔదార్యానికి నిదర్శనం. అలాంటి వారికి కూడా ఇది వర్తిస్తుంది. ఫలితార్థం ఎదురుచూడని, అనుకోని అతిథి. యాచించి (భిక్షాటన) జీవనాన్ని సాగించడం ఒక పద్ధతి. యాచించకుండా లభ్యపడితే మాత్రమే గ్రహించి జీవనం సాగించడం ఒక వ్రతంగా పాటించబడింది. వారిని అయాచిత వ్రతులంటారు ఈ ఇంటిపేరు రావడానికిది కారణం గావచ్చు. ఉపవర్షుడనే ఋషికి అయాచితుడనే పేరుంది.

**అయితం - ఐతం :** గ్రామనామ పూర్వపదములు : అయితంపూడి అనేగ్రామం పశ్చిమగోదావరి జిల్లాలో వుంది కాగా అయితం వ్యక్తినామంకూడా బ్రహ్మనాయని భార్య అయితమ్మ. సౌభాగ్యవతి అని అర్థం.

**అయినంపూడి - ఐనంపూడి :** కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాలో ఈ పేరుతో రెండు గ్రామాలున్నాయి.

**అయ్య:** అయ్య అంటే తండ్రి. కొన్ని కులాలకు ముఖ్యంగా యాదవులకు బిరుదనామం. చరిత్రలో అయ్య వంశస్థులున్నారు. అయ్యవారి నాయుడు ఖండ్రిక పుత్తూరు తాలూకాలో వుంది. నృత్త రత్నావళి కర్త జాయపసేనాని అయ్య వంశస్థుడు.

**అయ్యగారి:** ఈ ఇంటిపేరుకు ఎవరో గారెలు వండుకుంటూ వుండగా కుక్క నోట కరచుకుపోవడం చూసి ఆ ఇంటివారు 'అయ్యోగారి' 'అయ్యోగారి' అని అరవడం వలన అయ్యగారి ఇంటిపేరు స్థిరపడిందని ఒక పత్రికలో వ్రాశారు. కాని అది సరికాదు. తమిళనాడులోని తెలుగు బ్రాహ్మణులకు అయ్యంగార్లని వ్యవహారం. అయ్యశబ్దం పూజ్యార్థ సూచకం. దానిపై గౌరవ వాచకం గారు చేరి ఔప విభక్తిక రూపంలో అయ్యగారి అయింది. తమిళనాడు నుండి వచ్చిన బ్రాహ్మణుల్లో ఈ ఇంటిపేరు కనిపిస్తుంది. అయ్యగారు శబ్దం ఉపాధ్యాయుడు అనే అర్థంలో కూడా వ్యవహరింప బడుతుంది. అయ్యంగారు అని తమిళనాట వ్యవహారం. మరిన్ని వివరాలకు చూడు అయ్యదేవర.

**అయ్యంకి:** కృష్ణాజిల్లా దివి తాలూకా గ్రామం. గ్రంథాలయోద్యమ పితామహులు అయ్యంకి వెంకటరమణయ్యగారు.

**అయ్యదేవర:** ఈ గృహనామంతో ప్రసిద్ధులైన వారు, గతంలో మన అసెంబ్లీకి స్పీకరు పదవి నిర్వహించిన వారు కీ.శే అయ్యదేవర కాళేశ్వరరావుగారు. ఇందులో అయ్య, దేవర అనే రెండుపదాలున్నాయి. ఆర్య శబ్దభావం అయ్య. ఈ ఆర్య శబ్దం ఋగ్వేదంలో ప్రసక్తమైంది. ఆర్యముడు అనే వ్యక్తి కూడా అందు ప్రస్తావింపబడి యున్నాడు. సంస్కృతనాటకాలలో, ప్రభువులను, గౌరవార్హులను ఆర్యశబ్దంతోను, కులీన స్త్రీలు తమ భర్తలను ఆర్యపుత్ర అని సంభావించడముంది. ఈ భావనలో ఆర్య శబ్దానికి గౌరవార్హుడు, పూజనీయుడు అనే అర్థాలను సంతరించడం జరిగింది.

అయితే భారతదేశంలో గల రెండు ప్రధాన తెగలకు ఆర్యులు ద్రావిడులని పేరు. ఇందులో ఆర్యులు మధ్యప్రాచ్యంనుండి భారతదేశానికి వలస వచ్చిన వారని, ద్రావిడులు స్వదేశీయులని చెప్పడం జరిగింది. ఇరాన్ అనేపదం ఆర్యశబ్దానికి సంబంధించినదని చెప్పడం కద్దు. హిట్లరు తాను, తన జాతి ఆర్యుల మని భావించాడు.

ప్రధానంగా ఆర్యులు ఉత్తర భారతజాతి. ద్రావిడులు దక్షిణాదిజాతి. అయితే సింధు నాగరకత ద్రావిడ నాగరకత అని చరిత్రకారులు భావిస్తున్నారు. ఆర్యులు ద్రావిడులపై దండయాత్రలు గావించారని, తత్ఫలితంగా ద్రావిడులు దక్షిణాదికి తరలి వచ్చారని చెప్పడం జరిగింది.

ద్రావిడ లేక ద్రవిణ శబ్దం ఋగ్వేదంలో ధనము, సంపద అనే అర్థంలో ప్రసక్తమైనది. శంకరభగవత్పాదులు కూడ, ఆ అర్థంలో ఆ పదాన్ని సంయోజించారు. ఆర్యులు ప్రధానంగా గోగణాలపై ఆధారపడి (Pastoral life) జీవించారని, ద్రావిడులది పట్టణ నాగరకత అని చెప్పడం జరిగింది. దేవర అంటే దైవం అని తెలిసిందే. అయితే ప్రభువులను కూడా ఇలా పిలవడం గలదు. ఇక ప్రకృతంలోనికి వస్తే, అయ్యదేవర శబ్ద,

అయ్య అనే దేవుని పూజించేవారని చెప్పాలి కాని అయ్యశబ్దంతో ప్రత్యేకంగా ఏదైవాన్నీ గుర్తింపలేము. ఇలాంటిదే సూర్యదేవర అనే ఇంటిపేరుకూడ వుంది దీనిని బట్టి చరిత్రకాలాల్లో ఆ పేరు గల ప్రభువుల వద్ద ఈ కుటుంబంవారు ప్రధానమైన కార్యనిర్వహణోద్యోగం చేసి వుండాలి ఇలాంటిదే జటావల్లభుల కూడా!

**అయ్యపరాజు :** వ్యక్తినామం. అయ్యపరాజుపాలెం గూడూరు తాలూకాగ్రామం. ఇట్లు అయ్యలరాజు. అయ్యలరాజు రామభద్రుడు కవి.

**అయ్యభట్లు :** వ్యక్తినామం. శా శ 1272 నాటి సింహాచల శాసనంలో ఒక అయ్యభట్లు బేడి నరసింహనాయకుని ప్రస్తావన ఉంది.

**అరవపల్లి - అర్వపల్లి :** గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాగ్రామం రెండు విధాలుగాను వ్రాస్తారు.

**అరసవెల్లి :** శ్రీకాకుళం జిల్లాగ్రామనామం. శా శ 1055 నాటి మహేంద్రగిరి శాసనంలో ఒక అర్సవెల్లి మేడపోతు ప్రస్తావన వుంది.

**అరిగెల :** అరిగలు ధాన్యవిశేషం. అయితే ఇది జాతిపరంగా కూడ కన్పిస్తోంది. శా.శ. 1482 నాటి మార్కాపురం శాసనంలో 'అరిగెల చేరి చేయుమేళం సహాగాను మేళాలవారు జనాలు' అని చెప్పబడింది. అరిగెలవారిపల్లె వాయల్పాడు తాలూకాలో వుంది.

**అరిపినేని :** ప్రాయికంగా ఇది వ్యక్తినామం. అరిపినాయక శబ్దం అరిపినేనిగా పరిణమించింది. అయితే అరిపి వ్యక్తినామ సూచికాదు. గ్రామనామంలోని మొదటిపదం. అరిపిరాల అనేగ్రామం వుంది. గ్రామనామాలను వ్యక్తినామాలుగా పెట్టుకోవడం ప్రాచీనకాలం నుండి వ్యవహారంలో వుంది కుమారగిరి, సింహాచలం,శ్రీశైలం, తిరుపతి, వేదగిరి (యాదగిరి) మొదలైనవి పరిచయమైనవే. ఈ గృహనామానికి ఆకరమైన వ్యక్తి యొక్క పేరు ఆవిధంగా వచ్చియుండవచ్చును లేక, అతని పేరు వేరువిధంగా వున్నా, ఆ గ్రామం నుండి వచ్చిన నాయకునిగా కూడా అతనికి ఆపేరు స్థిరపడియుండవచ్చును

**అరిపిరాల :** కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాగ్రామం.

**అర్చకం:** దేవాలయాల్లో అర్చకత్వ బాధ్యత వహించేవారు అర్చకులు. అయితే కొన్ని కుటుంబాలకు, ముఖ్యంగా వైఖానసుల్లో ఇది ఇంటిపేరయింది సాధారణార్థమిదే అయినా, అర్చక శబ్దానికి ఋక్కులనే అర్థముంది సామవేదానికి కూడా అర్చకమని పేరు. ఏమయినా ఇంటిపేరు పూజించు అనే అర్థంలోనే వచ్చింది

**అర్ఘపరెడ్డి :** వ్యక్తినామం అర్ఘశబ్దంపై అప్ప. ఆపై రెడ్డి చేరింది. శా శ. 1296 నాటి సింహాచల శాసనంలో ఒక అర్ఘపరెడ్డి పినసింగాసాని ప్రస్తావన వుంది.

**అర్జా :** అర్జ రేవులలోని పూర్వపదం. నిజాంపట్నం రేవుకు మొదట ఈ పేరుండేది.

**అర్లము:** శా.శ. 1386 నాటి శాయింపేట శాసనంలో శఘమర్షణ గోత్ర, యజుశ్శాఖ అర్లము సింగరయ్య ప్రస్తావన వుంది అర్లి అనేగ్రామం పర్లాకిమిడితాలూకాలోవుంది

**అల్లసాని :** అళసాని అని శాసనాల్లో చెప్పబడింది ఆంధ్రకవితా పితామహుడు అల్లసానిపెద్దన. ఆయనే వేయించిన శాసనం. శా శ 1440 కమలాపురం తాలూకా కోకటం శాసనం. అందు ఆయన తండ్రి అళసాని చొక్కరాజుగా చెప్పబడింది చూడు. అల్లంరాజు.

**అల్లాడ :** శ్రీకాకుళంజిల్లాగ్రామం

**అల్లాడ :** ఇది శ్రీకాకుళం తాలూకాగ్రామం రాజమండ్రి నేలిన రెడ్డిరాజు వీరభద్రారెడ్డి తండ్రిపేరు అల్లాడరెడ్డి ఇతడు కాటయవేమారెడ్డి (కుమారగిరిరెడ్డి బావమరది) కి మిత్రుడు వీద్యకుడు ఇతని కుమార్తె అనితల్లిని వీరభద్రారెడ్డి వివాహమాడాడు శా శ 1181 నాటి త్రిపురాంతక శాసనాల్లో ఒక అల్లాడపెమ్మయ మహారాజు ప్రస్తావనవుంది

**అల్లు :** విజయవాడ శాసనాల్లో ఒక అల్లు దేవరాజు పేర్కొనబడ్డాడు అల్లురామలింగయ్య ప్రసిద్ధ సినీనటులు

**అల్లూరు - అల్లూరి :** ఇది అల్లు + ఊరుల కలయిక ఇది ఒక రకం గడ్డి అల అంటే ప్రాకే గడ్డి అది అల్లుగా పరిణమించింది కర్నూలుజిల్లా కోయిల కుంట్ల, నందికొట్కూరు, నెల్లూరు జిల్లాల్లో అల్లూరు పేరుతో గ్రామాలున్నాయి అల్లూరి సీతారామరాజు మన్యం వీరునిగా తెలసిన వాడే

**అల్లంరాజు :** వ్యక్తినామం అల్లశబ్దానికి ప్రేమ, కోరదగిన, సామర్థ్యము అనే అర్థాలు కన్నడంలో వున్నాయి. ఆ భాషలో కూడ ఇదివ్యక్తినామంగా వర్తిస్తోంది దానిపై రాజు చేరింది శా శ 1565 నాటి కోయిలకుంట్ల శాసనంలో అల్లంరాజు కునుకుంట్లయ ప్రస్తావనవుంది.

**అవచి :** దీని ఉనికి నేడు తెలుగు నాట కనుపింపక పోవచ్చు అయితే ఈ ఇంటిపేరును ప్రస్తావించదానికి ఒక కారణముంది. 15వ శతాబ్దంలో రెడ్డి రాజుల పాలనాకాలంలో, ఈ ఇంటిపేరుగల వారు ప్రముఖ వాణిజ్య వేత్తలు. సముద్ర వ్యాపారం నిర్వహించిన వారు ఆ కుటుంబంలోని అవచి తిప్పయ శెట్టికి, శ్రీనాథకృత హరవిలాసం అంకితమివ్వబడింది వీరి నిజనివాసం కంచి. వీరివంశంలోని పూర్వులు శ్రీశైలానికి మెట్లు నిర్మించడంలో ప్రోలయవేమారెడ్డికి తోడ్పాటునిచ్చారు తిప్పయ స్వయంగా, కొండవీటి నేలిన కుమారగిరిరెడ్డి, నిర్వహించే వసంతోత్సవాలను పర్యవేక్షించేవాడు. సుగంధ ద్రవ్యాలు సరఫరా చేసేవాడు. అవచి, కంచికి సమీపంలోని గ్రామం అదే వీరి ఇంటిపేరు అయింది. సినిమారంగంలో ప్రసిద్ధులైన A V M సంస్థ అధినేతలు ఈ కుటుంబంలోని వారే

**అవలెంగి :** అవలంగి పాలకొండ తాలూకా గ్రామం. శా శ 1048 నాటి ముఖలింగం శాసనాలలో ఒక అవలెంగ్గి పోలిసెట్టి ప్రస్తావన వుంది

**అవధాని - అవధానుల :** బిరుదనామం అవధానం అంటే శ్రద్ధ. కవిత్వ ప్రకర్షకు నిదర్శనంగా నిలిచింది

**అవసరాల :** అవసర శబ్దంమీద బహువచనమిది అత్యావశ్యకమైన దానిని అవసరం అంటాముగదా! ఇంటి పేరుగా దీని అర్థం అత్యావశ్యక వస్తువు అని కాక అత్యావశ్యకమైన వ్యక్తులను నిర్దేశిస్తుంది ప్రభువు కొలువులో ఉద్యోగులు అనేకులు ఉంటారు. అందులో అవసరం వారొకరు ప్రతి ఉద్యోగికి నియమితమైన బాధ్యతలుం ాయి అవసరం వారికి అలా నియతమైన బాధ్యత అంటూ ప్రత్యేకంగా ఉండదు ప్రభువు కోరిన క్షణంలో ఏ బాధ్యత నిర్వహించడానికయినా సంసిద్ధులుగా, సమ్ముఖంలో వుండే ఉద్యోగులు అవసరాల వారు అత్యంత విశ్వాసపాత్రులైన వారినే ఈ బాధ్యతల్లో నియోగించడం జరిగింది

శ్రీకృష్ణ దేవరాయల దైనందిన కార్యకలాపాలను వివరించే రాయవాచకంలో అవసరం వెంకటయ్య ప్రస్తావన వుంది అతడు నిర్వహించే ఉద్యోగ బాధ్యతను బట్టి, అతనికి అవసరం అనే పదం గుర్తింపు నిచ్చింది. పిదప అలాంటి ఉద్యోగాలు నిర్వహించిన వారి కుటుంబాలకు అది కుటుంబనామంగా స్థిరపడింది శా శ 1517 నాటి శ్రీముష్ణం శాసనాల్లో ఒక అవసరం కోనప్ప ప్రస్తావన వుంది

**అవుకు :** కర్నూలుజిల్లా కోయిలకుంట్ల తాలూకాగ్రామం

**ఆకారపు :** ఆకవరమనే గ్రామనామపు వికృతి దాని ఔపవిభక్తకరూపం.

**ఆకిరిపల్లి :** కృష్ణాజిల్లా గ్రామం వ్యస్తంగా ఆకిరి కూడ గృహనామంగా వుంది

**ఆకుమళ్ల :** ఆకుమడిపై బహువచనం. ఆకుమళ్ల రామయ్య ఖండ్రిక పుంగనూరు తాలూకాలో వుంది అకుమళ్ల కోయిలకుంట్ల తాలూకాగ్రామం.

**ఆకుల :** సంస్కృత పత్ర శబ్దార్థ భావనలో ఆకు తెలిసిందే. దానిపై బహువచనం చేరి ఆకులు అయి, సంబంధార్థంలో 'అ' చేరి ఆకుల అయింది ఇక్కడ ఆకు ఏదైనా ఆకు గాక కేవలం తమలపాకుకే సంకేతం ఇది పూర్వపదంగా కలిగిన రెండు గ్రామాలు ఆకులమన్నాడు (కృష్ణాజిల్లా) ఆకుల అల్లూరు (నెల్లూరుజిల్లా) లున్నాయి ఈ వివక్షకు కారణం వల్లమన్నాడు, పంటలల్లూరు పేరుతో గ్రామాలుండటం. ఈ ఇంటి పేరుగల వారు, తమలపాకులు సేద్యం చేయడంలో గాని, వ్యాపారం నిర్వహించడంగాని, లేదా ప్రభువులకు వాటిని సరఫరా చేయడం గాని చేసివుండడం వల్ల, వారికా పేరు స్థిరపడి యుండవచ్చును ఇలాంటిదే మరొక ఇంటి పేరు తెల్లాకుల తెల్లాకులు అంటే కూడా (ఈ మేరకు క్రీడాభిరామంలో ప్రయోగముంది) తమలపాకులే అయితే వాటిలో ఒక భేదం కావచ్చును మక్తల (తెలంగాణ) శాసనాల్లో శ్వేత తాంబూల పర్ణములుగా ప్రస్తావింప బడ్డాయి

**ఆంధ్ర :** ఇది విశాఖజిల్లాగ్రామం. అంధ్ర అనేది ఒక గడ్డిమొక్క అంధ్రంగి అనే గ్రామం కాకినాడ తాలూకాలో వుంది.

**అదరం :** కాళహస్తి తాలూకాగ్రామం. అదరం వెంకటాపురం అనే గ్రామం కూడ ఇదే తాలూకాలో వుంది.

**అది :** గ్రామనామ పూర్వపదం. అదిపూడి బాపట్ల తాలూకాగ్రామం. అయితే వద్దాది, మల్లాది, మండాది వంటి గ్రామాలు కూడా వున్నాయి.

**అదుర్రు - అదుర్తి :** అదుర్రుకు ఔపవిభక్తికరూపం ఈ గ్రామం తూర్పుగోదావరి జిల్లా రాజోలు తాలూకాలో వుంది. ప్రసిద్ధ సినిమాదర్శకులు అదుర్తి సుబ్బారావుగారు

**అదోని - అదనాని :** కర్నూలు జిల్లాలో ఆపేరుగల తాలూకాకు కేంద్ర గ్రామం.

**అనవాల :** శా శ. 1310 నాటి సింహాచలం శాసనంలో అనవాల అన్నమ ప్రసక్తి వుంది. దేవాలయ పడితరాల్లో ఇది ఒకటి పాయస నైవేద్యము. అనవాలపాయసమని కావ్యాల్లో ప్రయోగము

**అనెపూడి :** సూళూరు పేట తాలూకాగ్రామం.

**అయలూరు(రి):** అయ్యలూరుకు వ్యవహారరూపం అయలూరి వారిపల్లె కనిగిరి తాలూకాలో వుంది.

**అరవీటి :** అరవీడుకు ఔపవిభక్తిక రూపం శా శ 1541 నాటి చిన్న అహోబిలం శాసనంలో అరవీటి చెన్నమ శెట్టి ప్రస్తావనవుంది.

**అరవీడు :** పెద్ద, చిన్న వివక్షతో మార్కాపురం తాలూకాలో రెండు గ్రామాలున్నాయి నెల్లూరు జిల్లా ఆత్మకూరు తాలూకాలో మరో గ్రామముంది.

**అరాధ్యులు:** అరాధ్య శబ్దానికర్థం పూజింపదగినది. అరాధన శబ్దం నుండి వ్యుత్పన్నం. సామాన్యార్థమిదే అయినా, శైవులకే ఇది పరిమితమయింది ఇదీకాక పండితారాధ్యులవారు కూడా వున్నారు శైవ సాహిత్యంతో పరిచయమున్న వారికి పండితారాధ్యులు, పండితారాధ్య చరిత్ర తెలిసినవే మంగళగిరి శాసనాల్లో చిర్రావూరి ఆరాధ్యుల ప్రస్తావనవుంది

**అరుగొలను :** కృష్ణాజిల్లా గన్నవరం తాలూకాగ్రామం

**అరుట్ల :** రంగారెడ్డి జిల్లా గ్రామం అరుట్ల రామచంద్రారెడ్డి రాజకీయ నాయకులు

**అరుమడకల :** అరు సంఖ్యావాచకంగా తెలిసిందే. నాగలిని మడక అంటారు కనుక అరుమడకల అంటే అరునాగళ్ల వ్యవసాయం గల వారు అని చెప్పడం సులభం కాని అరమడక అనేది ఒక గ్రామం చిత్తూరు జిల్లా వాయల్పాడు తాలూకాలో వుంది మడక, పూడిమడక, అనేగ్రామాలు కూడా వున్నాయి గృహనామం రావడానికి కారణం, గ్రామనామమే

**అరుమళ్ల - అరెమండ; అళ్ల :** అరెమండ అనే గ్రామం బాపట్ల తాలూకాలో వుంది దానిపై బహువచనం చేరి అరుమళ్ల అయింది ఇందలి అరు సంఖ్యావాచకం కాదు అరె అనేది ఒక సస్యం దీనిపై బహువచనం అళ్ల ఇది కూడ గృహనామంగావుంది. అర్ల అనేగ్రామం విశాఖజిల్లాలో వుంది

**అరుంబాక:** గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా గ్రామం. సూలూరుపేట తాలూకాలో మరో గ్రామం వుంది

**అరెకూటి, జొన్నకూటి, వరికూటి:** ప్రధానంగా ఆయా ఆహార ధాన్యాలను పయోగించిన వారు. అరెగలు ఒక సస్యం

**అరెగ పూడి :** గ్రామనామం.

**అరేటి :** అరేడు అనే గ్రామం పశ్చిమగోదావరి జిల్లా భీమవరం తాలూకాలోవుంది ఆర ఏడు అనే రెండు పదాలవలన ఏర్పడింది అరవిల్లి, అరవీడు, అరకల్లు, అరేపల్లె మొదలైన గ్రామాల్లో గల అరె లేక అరి కూడా ఇదే అరేగడ్డి పేరువిని వుంటారు ఏడు, సంవత్సరార్థ సంబంధికాదు ఇది ప్రవాహసంబంధి ఏరు కవులు, ముఖ్యంగా శ్రీనాధుడు దీనిని అరేటి, అరియేటగా, ఛందోనుగుణంగా ప్రయోగించాడు. అయనవ్రాసిన భీమఖండ కృతిపతి అన్నమంత్రి, ఇంటిపేరు బెండపూడి గావడానికి పూర్వపు ఇంటిపేరు అరేటి

**అలమనేని - అల్లమనేని :** వ్యక్తినామం అలం అనేపదము కలహం అనే అర్థాన్నిస్తుంది అలము చేయుట అంటే కలహించుట యుద్ధము అనే అర్థాలనిస్తుంది అయితే అలంపూరు, అలంపురం అనేగ్రామంలోని అలముకూడ కావచ్చును అలమ అనే గ్రామం శ్రీకాకుళం జిల్లా లోనిది అగ్రామ నాయకుడు అనే అర్థంలో కూడ వచ్చియుండవచ్చును అలము అల్లము అవుతుంది. నేని నాయకశబ్ద భవం

**అలపాటి :** అలపాడు అనే గ్రామం గుంటూరుజిల్లా తెనాలి తాలూకాలో వుంది దాని ఔపవిభక్తిక రూపం అలపాటి. అళ్లు ఒక రకం చిరుధాన్యం

**అలమందల :** గ్రామనామం శా శ 1445నాటి నరసరావుపేట తాలూకా కుందుర్రు శాసనంలో మండలేశ్వరుడైన అలమందల ఎఱయ్యదేవచోడ మహారాజుల ప్రస్తావన వుంది

**అలంపూరి :** తెలంగాణా గ్రామనామం ఔపవిభక్తికరూపం శా శ 1221 నాటి అలంపురం శాసనాల్లో అలంపూరి ముమ్మడి బ్రమ్మిశెట్టి ప్రస్తావన వుంది.

**అలవట్టం :** శా శ.1238 నాటి కారంపూడి శాసనాల్లో ఒక అలవట్టం పెద్దయలెంక ప్రస్తావన వుంది. అలవట్టమంటే ఒకవిధమైన విసనకర్ర, దేవునికి పట్టే గొడుగు కూడా కావచ్చును

**అలా :** అలశబ్దంపై దీర్ఘం. అలపాడు మున్నగు గ్రామనామాల్లోని పూర్వపదం గృహనామంగా వర్తించి యుండవచ్చును

**అలూరు - అలూరి :** ఈ రెండు విధాలగాను తమ ఇంటిపేరును వ్యవహరించే వారున్నారు. అలూరుకు చెందిన వారు అని చెప్పే సందర్భంలో దాని ఔపవిభక్తిక రూపం అలూరి అవుతుంది. ఇది ఊరిపేరు అనే సంగతి వేరుగా చెప్పవలసింది లేదు అలూరు పేరుతో, అనంతపురం బళ్లారి, ప్రకాశం, శ్రీకాకుళం జిల్లాల్లో గ్రామాలున్నాయి

అలు+ఊరుల కలయిక అలూరు. అలము అంటే ప్రాకే జాతి మొక్క ఏదైనా కావచ్చు అకూ అలము అనే వ్యవహారం తెలిసిందే శ్రీకాకుళం శాసనాల్లో అలూరిపురవరాధీశ్వరునిగా ఒక అలూరి పోతినాయుడు పేర్కొన బడ్డాడు అయితే ఈ అలూరు, నేటి రేపల్లె తాలూకాలోనిది కావచ్చును.

**అలోకం :** అలోకమనే సంస్కృత పదానికి అర్థం చూచుట కాగా కొలువు, శుశ్రూష, సేవ కాంతి, విలాసము అనే అర్థాలు కూడా వున్నాయి. ప్రస్తుతి, పొగడ్త అనే అర్థాలు కూడా వున్నాయి.

**అళ్ల :** చిరుధాన్య విశేషము అళ్లు గ్రామనామ ప్రథమావయవంగా కన్పిస్తుంది.

**అవంచ :** తెలంగాణా గ్రామం అంవత్స అని కూడా వ్రాస్తారు

**అవు :** జంతుసూంచి : అవువారిపల్లె వాయల్పాడు తాలూకాలో వుంది

**అవుల :** అవుల రంగయ్యపల్లె చిత్తూరు తాలూకాలో వుంది. అవుల సాంబశివరావు న్యాయమూర్తి

**అవులమంద :** ప్రకాశంజిల్లా దరిశి ఉదయగిరి తాలూకాల్లో ఈ పేరుతో గ్రామాలున్నాయి.

**అసూరి :** ఇది అసూరుకు ఔపవిభక్తిక రూపం. ఈ గ్రామం తమిలనాడులోని దక్షిణ అర్కాడుజిల్లా కల్లకురుచ్చితాలూకాలో వుంది చెంగల్పట్టు తాలూకాలో కూడా వుంది

**ఇక్కుర్తి :** ఇక్కురుఅనేగ్రామం నరసరావుపేట తాలూకాలో ఉంది దాని ఔపవిభక్తికరూపం ఇక్కుర్తి.

**ఇంజేటి :** ఇంజేడు కు ఔపవిభక్తిక రూపం. ఈ గ్రామం కర్నూలుజిల్లా కోయిలకుంట్ల తాలూకాలో వుంది.

**ఇటిక్యాల :** కర్నూలుజిల్లా కోయిలకుంట్ల తాలూకాగ్రామం.

**ఇరుపులపాడు (టి):** గుంటూరుజిల్లా బాపట్ల తాలూకాగ్రామం

**ఇంటూరి :** ఇంటూరు అనేగ్రామం తెనాలి తాలూకాలో వుంది.

**ఇండ్ల:** నివాస గృహమనే అర్థంలో ఇల్లు శబ్దంపై బహువచకంగా భావించి అర్థం చెప్పడం సులభమే. కాని ఈ ఇంటిపేరు అలా వచ్చింది కాదు. తమిళంలో, కన్నడంలో, మలయాళంలో ఇది ఒక మొక్కగా చెప్పబడింది. ఇందులో కూడా చాలా రకాలున్నాయి. అందులో ఒక రకం మల్లె కూడా ఇండ్ల నేరుగా గ్రామ నామంగా కన్పించడం లేదుగాని ఇండ్లచెరువు అనే గ్రామం దరిశి తాలూకాలో వుంది.

**ఇండ్లమొదలు :** గ్రామనామం. అచూకి తెలియదు కొండమొదలు అనే గ్రామం, తూర్పుగోదావరిజిల్లా చోడవరం డివిజన్‌లో వుంది. దీని పోలిక వలన ఇది గ్రామనామంగా భావింపబడింది.

**ఇనగంటి :** ఇనగల్లుకు ఔపవిభక్తిక రూపం. బాపట్ల తాలూకగ్రామం.

**ఇన్నవ :** బాపట్లతాలూకాగ్రామం.

**ఇనుగలి :** గ్రామనామం ఇనుగలి సగంవంతు జగన్నాథపురం అనేగ్రామం కామవరపు కోట తాలూకాలో వుంది ఇనగల్లు బాపట్ల తాలూకాగ్రామం

**ఇనుమల :** ఇనుమల వాండ్లపల్లె చంద్రగిరి తాలూకాలో వుంది

**ఇందుపల్లి :** కృష్ణా, తూర్పుగోదావరిజిల్లాల్లో ఈపేరుతో గ్రామాలున్నాయి

**ఇందులూరి :** ఇందులూరు అనే గ్రామపు ఔపవిభక్తిక రూపం ఈ ఇంటిపేరుతో చరిత్రలో అన్నమంత్రి ప్రసిద్ధుడు. ఇతని ప్రస్తావన శా శ 1205 నాటి ద్రాక్షారామ శాసనాల్లో వుంది ఇతడు గన్నయమంత్రి కుమారుడు.

**ఇంద్రగంటి :** గ్రామనామం ఇంద్రగల్లుకు ఔపవిభక్తికరూపం.

**ఇప్పిలి :** శ్రీకాకుళ తాలూకాగ్రామం.

**ఇమ్మడి - ఇమ్మణ్ణి:** ఇది రెండవ అనే అర్థాన్నిస్తుంది ముమ్మడి అంటే మూడవ అని అర్థం ఇబ్బడి ముబ్బడి అనడం తెలిసిందే. ఒక కుటుంబంలో ఒకే పేరుగల ఇద్దరు ముగ్గురు వ్యక్తులు వున్నప్పుడు రెండవ వ్యక్తిని ఇమ్మడి అని, మూడవ వ్యక్తిని ముమ్మడి అనిచేర్చి వ్యవహరిస్తారు ఉదా · ఇమ్మడి రంగరాయలు అంతేగాక ఇమ్మడి అనేది రెట్టింపు అనే అర్థంలో ఇస్తుంది ఇమ్మడి రూపాంతరం ఇమ్మణ్ణి జలాలుపురం (శా శ 1175) శాసనంలో ఇమ్మడి దేవయ రధినీశ్వరుని ప్రసక్తివుంది.

**ఇమ్మడిశెట్టి :** ఇమ్మడి శబ్దంపై శెట్టి చేరింది చూడు ఆరోపం ఇమ్మడి

**ఇరకం :** ప్రకాశంజిల్లా దరిశి నెల్లూరుజిల్లా గూడూరు తాలూకాల్లో గల గ్రామం

**ఇరుదల :** గ్రామనామం ఇరుదల వారి పట్టడ ఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది

**ఇరుపూరు :** గ్రామనామం ఇరుపూరు రామయ్య ఖండ్రిక పుత్తూరు తాలూకాలో వుంది

**ఇలవర :** ప్రకాశంజిల్లా కందుకూరు తాలూకాగ్రామం.

**ఇలపావులూరి :** ప్రకాశం జిల్లా గ్రామం. ఇలపావులూరి పాండురంగారావు ప్రసిద్ధులు

**ఇల్లిందల:** గ్రామనామం ఈ గ్రామనామంతో ప్రముఖులు ఇల్లిందల సరస్వతీదేవి

**ఇసునూరి - విసునూరి :** ఇసునూరుపై ఔపవిభక్తికరూపం : ఇది భద్రాచలం తాలూకాగ్రామం.

**ఇస్కాల - ఇస్కా :** ఇస్కాల అనే గ్రామం నందికొట్కూరు తాలూకాలో వుంది

**ఈడ్పుగంటి :** ఇది ఈడ్పుగల్లు అనే పదానికి ఔప విభక్తికరూపం ఇది కృష్ణాజిల్లా విజయవాడ తాలూకా గ్రామం ఇది ఈడ్పు, గల్లు అనే రెండుపదాల కలయికతో ఏర్పడింది ఇలాంటివి పొన్నెగంటి, పానుగంటి, మాగంటి మొదలైనవి వున్నాయి వీనిలోని గల్లుకు పూర్వరూపం కల్లు అంటే రాయి, కొండ అనే అర్థాలనిస్తుంది దాని ఔప విభక్తకరూపం కంటి, గంటి అవడం సహజం.

అయితే పొన్నెకల్లు, పానగల్లు అనే గ్రామనామాలవిషయంలో, పై వివరణ సరియైనదే కారణమేమంటే అక్కడ కొండలున్నాయి కాని ఈడ్పుగల్లు, మాగల్లు అనే గ్రామాల్లో కొండలులేవు. అయినపుడు వానిలోని కల్లు లేక గల్లును పర్వత సూచిగా చెప్పడం కుదరదు అయితే వీనిలోని కల్లు, గల్లు అనేవి 'కొలని'కి రూపాంతరాలు. ఈడ్పుగల్లు, మాగల్లులు అలాపరిణమించడానికి పూర్వం, వాని పేర్లు ఇదుపుంగొలను, మాంగొలను అనేవి ఈ మేరకు శాసనాలున్నాయి. కనుక, పరిచయమైన శబ్దాలతో, వెంటనే అర్థం చెప్పడానికి పూనుకోరాదు పర్యాప్తమైన పరిశీలన అవసరం అలాగే బెల్లంకొండ, వినుకొండల వంటిది కాదు మానికొండ. మొదటిరెండు గ్రామాల్లో కొండలున్నాయి. మానికొండ, పోలుకొండ గ్రామాల్లో కొండలులేవు అక్కడ కొండ అనేది ఒక మొక్క పోల్చిచూడు కొండంగి.

**ఈతముక్కల :** ఒంగోలు తాలూకా గ్రామం. శా శ 1498 గుంటూరు తాలూకా కొండెపాడు శాసనంలో ఈంతముక్కల తిరుమల భట్ల ప్రస్తావనవుంది

**ఈదర :** కృష్ణాజిల్లా నూజివీడు తాలూకాగ్రామం, ఈ పేరుతో మరోగ్రామం ప్రకాశంజిల్లాలో దరిశి తాలూకాలో కలదు

**ఈదుమూడి :** ప్రకాశంజిల్లా గ్రామం.

**ఈపూరి :** ఈపూరు అనేగ్రామం వినుకొండ తాలూకాలో వుంది

**ఈమని - ఈవని :** ఈమని అనేగ్రామం తెనాలి తాలూకాలో వుంది. ఈవని అని కూడ వ్రాస్తారు ప్రసిద్ధ వైణిక విద్వాంసులు శంకరశాస్త్రిగారి గృహనామం ఈమని

**ఈశ్వరనేని :** శా శ. నందికొట్కూరు తాలూకా ఆత్మకూరు శాసనంలో ఒక ఈశ్వరనాయని ప్రస్తావనగలదు ఈశ్వర శబ్దంపై నేని. వ్యక్తినామం.

**ఉగ్రాణం :** దేవాలయ శ్రీభండారానికి చెందిన వంట వస్తువుల నిలయం శా శ. 1505 నాటి శ్రీముష్ణం శాసనంలో శ్రీభండారం ఉగ్రాణాలకు ఒక ముద్ర ఉదయగిరి తిమ్మనాయుడు సమర్పించినట్లు చెప్పబడింది ఉగ్రాణం వారు అంటే 'దేవాలయానికి సంబంధించిన పనిపాటల్లో నిమగ్నమైన వారుగా శాసనాల్లో ప్రస్తావింపబడ్డారు ' ఈ గ్రామాలపారుపత్యం చేసి స్వయంపాకులను తిరువారాధకులను పరిచారకులను బొక్కస భండారాలు వుగ్రాణము మొదలైన పనులకు' అనేవిధంగా కీ శ 1478 నాటి శాసనంలో చెప్పబడింది ' ఉగ్రాణం అంటే, సామానులు వుంచేగది

**ఉంగరాల :** చేతివ్రేలుకు ధరించే ఆభరణంగా ఉంగరం తెలిసిందే అలాగే వంపులుగా నున్న జుట్టును ఉంగరాల జుట్టు అనడం తెలిసిందే శా శ.1208 నాటి అమరావతి శాసనాల్లో శ్రీకాకుళానికి చెందిన ఉంగరాల సవ్వరాజు అనేవ్యక్తి పేర్కొనబడ్డాడు. అయితే ఉగ్గిరాల అనే గ్రామంకూడ వుంది.

**ఉంగుటూరి :** ఉంగుటూరు పేరుతోగ్రామాలు కృష్ణా, గుంటూరు జిల్లాల్లోవున్నాయి ఇతర చోట్లకూడ వుండవచ్చును.

**ఉజ్జిలి :** తెలంగాణా గ్రామం దీనిని శాసనాల్లో ఉజ్జలగిరి,ఉజ్జివొళగా కూడా ప్రస్తావించడం జరిగింది.

**ఉట్ల :** చోడవరం తాలూకాగ్రామం ఊట్ల గా గృహనామ వ్యవహారం.

**ఉండవల్లి - ఉండవెల్లి :** ఉండవల్లి గుహలు ప్రసిద్ధమైనవి ఈ గ్రామం మంగళగిరి తాలూకాలోవుంది. శాసనాలలో ఉండవెల్లిగా చెప్పబడింది

**ఉంద్ర కొండల :** గ్రామనామం శా శ 1386 నాటి శాయింపేట శాసనంలో కాశ్యపగోత్ర ఉంద్రుకొండల కేశవయ్య ప్రస్తావన వుంది

**ఉత్తమ :** శా శ. 1155 నాటి సింహాచల శాసనంలో ఒక ఉత్తమ అప్పినాయకుని ప్రస్తావన వుంది ఇది శ్రేష్ఠార్థ సంబంధికాదు. అస్కా తాలూకా గ్రామం.

**ఉన్నవ - ఉన్నం :** గుంటూరుజిల్లాలో ఉన్నవ గ్రామముంది వ్యవహారంలో ఉన్నం కూడా అయింది మాలపల్లి నవలా రచయితగా ఉన్నవ వారు పరిచిరులే

**ఉపద్రష్ట :** యజ్ఞయాగాదికాలు నిర్వహించేటప్పుడు అవి యధావిధిగా జరుగుతున్నవో లేదో పర్యవేక్షించే వ్యక్తి అంటే మొత్తం క్రియాకలాపంపై అధికారం కలిగినవాడు దీనిని గూర్చిన పూర్తి పరిజ్ఞానం కలిగివుంటే తప్ప ఇది సాధ్యం కాదు ఈ ఇంటిపేరు కలిగిన వారి కుటుంబాలలో పూర్వులెవరికో ఇది పట్టపు పేరుగావడం కారణంగా తదనంతరం ఇంటిపేరుగా స్థిరపడింది

**ఉపాధ్యాయుల :** ఉపాధ్యాయుడు తెలిసిందే శా శ 1085 నాటి ద్రాక్షారామశాసనంలో ఒక చిత్తలూరిప్రోలెభట్టు ఉపాధ్యాయులు పేర్కొనబడ్డాడు

**ఉమ్మారెడ్డి :** వ్యక్తినామం ఉమామహేశ్వర ఉమ్మ గా పరిణమించింది దానిపై రెడ్డి ఇట్లు ఉమ్మానేని

**ఉయ్యాలవాడ :** కంభం కోయిలకుంట్ల, కర్నూలు తాలూకాల్లో ఈ పేరుతో గ్రామాలున్నాయి ఉయ్యాలవాడ నరసింహారెడ్డి ప్రముఖదాత

**ఉయ్యూరి - వుయ్యూరు :** వుయ్యూరు అనే గ్రామం కృష్ణాజిల్లా గన్నవరం తాలూకాలో వుంది

**ఉరివి - ఉరిమి :** ఉరివి అనే గ్రామం గుడివాడ తాలూకాలో వుంది

**ఉలిపిరి :** పార్వతీపురం తాలూకాగ్రామం.

**ఉల్చి :** ప్రకాశంజిల్లా గ్రామం. ఉల్చి గురవరాజు ఖండ్రిక, రంగరాజు ఖండ్రిక అనే రెండు గ్రామాలు తిరుత్తని తాలూకాలో వున్నాయి.

**ఊటుకూరి :** ఊటుకూరు పేరుతో గ్రామాలు గుంటూరు, నెల్లూరు జిల్లాలో ఉన్నాయి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ ప్రసిద్ధ రచయిత్రి

**ఊతపనేని :** వ్యక్తినామం ఊత+అప్ప > ఊతప్ప వ్యవహారంలో ఊతప అయింది ఊతు అనే తమిళ శబ్దానికి ఉబ్బు, ఉబ్బుట, పొంగుట అని అర్థం ఇక్కడ శరీర సౌష్ఠవాన్ని, బలాన్ని సూచించే విధంగా వ్యక్తినామంలో చోటుచేసికుంది తెలుగులో కూడ ఊతం అనేపదం ఆసరా అనే అర్థంలో వుంది

**ఊరక్కర :** ఊరుకు అక్కర అయినవారు. ప్రధానులు ముఖ్యులైన వారు కార్యనిర్వాహకులు. అక్కర శబ్దానికి అవసరము, ఆవశ్యకము అనే అర్థాలున్నాయి అక్కరకాడు అంటే మేలు చేయువాడు, అసవరానికి ఆదుకొనేవాడు అనే అర్థాలున్నాయి

**ఊరినేని - ఊరనాయుని :** వ్యక్తినామం ఊరు అంటే గ్రామం అని తెలిసిందే అయితే ఊరు అనే గ్రామం కూడా వుంది. ఆ గ్రామానికి చెందిన అనే అర్థంలో వచ్చియుండవచ్చు లేదా ఊరి కంతటకి ప్రసిద్ధుడు గావాలనే కోరికతో తలిదండ్రులే పెట్టి వుండవచ్చు. ఊరినాయని కొత్తూరు కంగుంది డివిజన్‌లో వుంది ఊరె గృహనామం గల వారుకూడా వున్నారు.

**ఊరె - ఊరా :** గ్రామనామం

**ఎక్కిలి :** గ్రామనామ ప్రథమావయవం ఎక్కలూరు పేరుతో రెండుగ్రామాలు తాటిపత్రి తాలూకాలో వున్నాయి

**ఎచ్చెర్ల :** చీపురుపల్లె తాలూకాగ్రామం

**ఎడవిల్ల - యడవల్లి :** నరసరావుపేట తాలూకా గ్రామం ఇంకా వున్నాయి. యడవల్లి సూర్యనారాయణ ప్రముఖనటుడు

**ఎడ్లపల్ల - యడ్లపల్లి :** గుంటూరు జిల్లా తెనాలి తాలూకా గ్రామం

**ఎడ్లపాటి - ఎడ్ల - యడ్లపాటి - యడ్ల :** ఎడ్లపాడు అనేగ్రామం నరసరావుపేట తాలూకాలో వుంది. ఇందలి ఎడ్ల ఎద్దులతో సంబంధం గలదికాదు. ఇది ఒకరకం గడ్డి. ఎడ్లపాటి వెంకటరావు ప్రముఖులు.

**ఎతిరాజు - యతిరాజు :** సర్వసంగపరిత్యాగియైన వారు యతి శా.శ. 1466 నాటి మార్కాపురం శాసనంలో ఒక ఎతిరాజు లక్ష్మయ్య ప్రస్తావన గలదు.

**ఎద్దనపూడి - యద్దనపూడి :** కృష్ణా, గుంటూరు జిల్లాల్లో ఈపేరుతో గ్రామాలున్నాయి. యద్దనపూడి సులోచనారాణి నవలా రచయిత్రి

**ఎద్దుల :** ఎద్దుల వారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది. జంతుసూచి.

**ఎనమదల :** గుంటూరుజిల్లా గ్రామం. శాసనాలలో ఎనుముందలగా ప్రస్తావింపబడింది.

**ఎనిగళ్ల - వెనిగళ్ల - వెనిగండ్ల :** వెనిగండ్ల అనేగ్రామం గుంటూరుజిల్లాలో పెదకాకానికి దగ్గరలో వుంది మిగిలినవి వ్యవహారంలో వచ్చిన రూపాలు

**ఎనుముల :** దీనిని ఎనుమల, ఎనమల అని కూడ వ్యవహరించడం జరుగుతోంది మహిషజాతి పశువును ఎనుము అనడం తెలిసిందే దానిమీద బహువచనంగా యెనుముల - యనమల. ఎనుములగా చెప్పవచ్చును కాని ఇది ఎనుముల అనే వృక్షజాతి భేదంగా కన్పిస్తోంది. ఎనుముల చింతల అనే గ్రామం కడపజిల్లా జమ్మలమడుగు తాలూకాలో వుంది. ఎనుముల కూడ వ్యస్తంగా గ్రామనామం ఉందేమో తెలియరాలేదు

**ఎన్నమని - యన్నమని :** ఎన్నమనేనికి సంక్షిప్తరూపం వెన్నుడు విష్ణుశబ్దభవం.

**ఎరకూటి :** ఎర్రధాన్యాల అన్నం పండేపంటలను ఎర్ర, తెల్ల పంటలుగా వ్యవహరిస్తారు కూడు అంటే ప్రధానంగా అన్నం. ఆహారం అనే అర్థాన్ని ఇస్తుంది అరెగకూటి, జొన్నకూటి, వట్టికూటి, వరికూటి అనే గృహనామాలు కూడా వున్నాయి

**ఎరజెర్ల :** గ్రామనామం. శా శ 1069 నాటి శ్రీకూర్మ శాసనంలో ఒక ఎఱ్ఱచెర్ల పోతనాయకుని ప్రస్తావన వుంది

**ఎరపోతు :** వ్యక్తినామం ఎర్ర శబ్దంపై పోతు శా శ 1270 నాటి కాకినాడ తాలూకా భీమవరం శాసనంలో భీమేశ్వర దేవాలయ ప్రాంగణంలోని ఉమాదేవి పూజారి ఎఱపోత అప్పన ప్రస్తావన వుంది

**ఎరమనేడి - ఎరమనేని :** వ్యక్తినామం. ఎర్ర, అమ్మ = ఎర్రమ్మ పురుషులను సూచించే పేర్లలోకూడ అమ్మచోటుచేసికొంటుంది నాయకుడు, అనే శబ్దం నాయడు నేడు, నీడు నేనిగా పరిణమించింది.

**ఎరముసాని :** వ్యక్తినామం. ఎరమచూ ఎరమనేని సాని సాహిణి శబ్దభావం.

**ఎరసాని - ఎర్రసాని :** ఎర్రసానిపల్లె మదనపల్లి తాలూకాలో వుంది చూడుపై ఆరోపం

**ఎర్ర - ఎర్రా :** ఎర్రపాపిరెడ్డి పల్లె. ఎర్రావాండ్ల పల్లె అనే గ్రామాలు చంద్రగిరితాలూకాలో వున్నాయి. ఎర్రయ అనే వ్యక్తినామం ఎర్రాగా పరిణమించింది వర్ణవిశేషం కూడా కావచ్చును. శా.శ. 1221 అలంపురం శాసనంలో ఎఱ్ఱ మాచెనసెట్టి ప్రస్తావన వుంది

**ఎర్రమనేని :** ఎర్రమనాయకుడు అనేది వ్యక్తినామం ఎర్రయ్య, ఎర్రమ్మ అనేవిధంగా వ్యక్తినామాలు కన్పిస్తాయి. ఇది కొన్ని సందర్భాలో వర్ణసూచిగాను, మరికొన్ని సందర్భాల ఎరుక అంటే జ్ఞానము అనే అర్థంలోను వర్తిస్తుంది. శా.శ1183 నాటి ద్రాక్షారామ శాసనంలో ఒక ఎఱ్ఱమనేని పేర్కొనబడ్డాడు. శా శ 1061నాటి శాసనంలో కులోత్తుంగ చోడగొంకరాజుల తలారి ముప్పఎరయమ నాయకుని ప్రస్తావన వుంది

**ఎర్రంశెట్టి :** వ్యక్తినామం. ఎర్రంశెట్టి నారసింహుని తిరుత్తని పల్లె తాలూకాలో వుంది.

**ఎర్రా :** ఎర్రావారి పల్లె వాయల్పాడు తాలూకాలో వుంది.

**ఎలకూచి :** సాహితీలోకానికి పరిచయమైన ప్రసిద్ధుడు ఎలకూచి బాల సరస్వతి ఎల శబ్దం లేత, బాల అనే అర్థాల్లోను, ఎల్లయ నామరూపాంతరం గాను వర్తిస్తుంది ఇక్కడ ఈ రెండవ అర్థాన్నే గ్రహించాలి. కూచి అంటే చిన్న, ప్రియము అనే అర్థాల్లో ఇక్కడ గ్రహించాలి గారాలకూచి, అమ్మకూచి అనే పదబంధాల వాడుక తెలిసిందే అయితే సైన్యాన్ని నడిపేవారు అనే అర్థం కూడ వుంది కూచిమారుడు అనే సంస్కృత శాస్త్రగ్రంధకర్త కూడ వున్నాడు శా శ 1178 వాటి, కృష్ణాజిల్లా కోలవెన్ను శాసనాల్లో భారద్వాజగోత్రుడైన ఒక నాగనకూచి ప్రస్తావింప బడ్డాడు.

**ఎలనాటి - ఎల్నాటి - వెలనాటి :** ప్రాంతసూచి. వెలనాడు లో వకారం లోపించి మిగిలిన రెండు రూపాలుగా పరిణమించింది వేలనాడు వెలనాడు అయింది. వేలము అంటే సముద్రతీరం కృష్ణాజిల్లా దివితాలూకా తీరప్రాంతంతో సహా ఒంగోలు వరకు గల తీరభూమి వెలనాడు. నియోగి బ్రాహ్మణుల్లో అరువేల నాటి వారున్నారు ఆర్ (తమిళం) అనగా ఏరు నది ఏరులు గల తీరభూమి అని ఫలితార్థం. అయితే దీనిని పొరపాటుగా సంఖ్యావాచకంగా (ఆరు) భావించి షట్ స్రావనీ దేశంగా సంస్కృతీకరించడం జరిగింది

**ఎలం - వెలం :** జాతిసూచి. ఎలం వారిపల్లె పులివెందుల తాలూకాలో వుంది

**ఎలమాటి -యలమాటి - వెలమాటి :** - తెల్లని ఆవులు అని సాధారణార్థం నిజానకిది గోజాతి పశువులను సంకేతిస్తుంది శాసనాల్లో వెల్లెద్దు అని ప్రస్తావింప బడింది వాటిని సాకినవారికి అదిగృహనామమైంది

**ఎలవర్తి :** ఎలవర్రుకు ఔపవిభక్తికరూపం. ఈ గ్రామం గుంటూరుజిల్లా తెనాలి తాలూకాలో వుంది ఎలవర్తి ముమ్మలరాజు ఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది.

**ఎలిసెట్టి :** ఎల్లయసెట్టికి రూపాంతరము శా శ 1448నాటి గుంటూరు జిల్లా ఉండవల్లి శాసనంలో మూరుకుల గోత్రుడైన ఎల్లిసెట్టి ప్రస్తావింపబడ్డాడు.

**ఎల్లంకి - వెల్లంకి :** కృష్ణాజిల్లా నందిగామ తాలూకా గ్రామం, విశాఖజిల్లా భీమునిపట్నం తాలూకాలో మరో గ్రామముంది ఎల్లంకి వారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది.

**ఎల్లమంద - యల్లమంద :** దీనిని ఇలా రెండు విధాలుగాను వ్రాస్తారు ఎల్లమంద అనేది వ్యక్తి నామంగా కూడ కన్పిస్తుంది కోటప్పకొండపై గల దేవుని ఎల్లమందయ్య అని వ్యవహరిస్తారు. నిజానికి కోటప్పకొండ ఎల్లమంద అనేగ్రామంలోనిది. ఇది గుంటూరుజిల్లా గ్రామంగా తెలిసిందే. మరో ఎల్లమంద అనేగ్రామం చిత్తూరుజిల్లా వాయల్పాడు తాలూకాలో వుంది

ఎల్ల అంటే సరిహద్దు, పొలిమేర అని సాధారణార్థం కాని గ్రామనామ పరంగా అది కుదరదు ఎలమర్రు, ఎలకుర్రు, ఎలకుంట్ల, ఎల్లకారు(నెల్లూరుజిల్లా) అనే గ్రామాలతో పోల్చి చూసినపుడు ఇది ఒకరకం గడ్డిగా బోధ పడుతుంది దానిని సమర్థించే విధంగా మందపేరుతో ఆవులమంద, పశుమంద అనేగ్రామాలు కూడా వున్నాయి

**ఎల్లంరాజు :** వ్యక్తినామం శా శ బద్వేలు తాలూకా కత్తెరగండ్ల శాసనం (శా శ 1452)లో శ్రీవత్సగోత్రుడు అశ్వలాయన సూత్రుడు ఋక్శాఖాధ్యాయుడైన ఒక ఎల్లమరసు ప్రస్తావన వుంది అదేశాఖకు చెందిన వారికి ఇతడు మూలపురుషునిగా చెప్పవచ్చును ఇతనికి సకలి సీమ నాయంకరముంది ఎల్లంరాజుపల్లె రాజంపేట తాలూకాగ్రామం

**ఎల్లవత్తుల :** కర్నూలుజిల్లా శిరివెళ్ల తాలూకాగ్రామం.

**ఎల్లశిరి - యెల్లసిరి :** నెల్లూరుజిల్లా గూడూరు తాలూకాగ్రామం.

**ఎల్లావఝులు :** ఇది వ్యక్తినామం. ఎల్లయ్య అనేది పేరు వఝుల ఉపాధ్యాయ శబ్దభవంపై బహువచనం రూపం నెల్లూరుజిల్లా వెంకటగిరి తాలూకాలో ఈ గృహనామంలో ఎల్లావఝులపల్లె అనేగ్రామం వుంది

**ఎల్లావుల - వెల్లావుల :** వెల్ల అంటే తెలుపు ఆవులు తెలిసిందే అయితే కేవలం గోవులు మాత్రమేగాక గోజాతి పశువులు (ఎద్దులతో సహా) అని అర్థం చేసికోవాలి ఆజాతి పశువులను ప్రధానంగా సాకినవారికి అదిగృహనామం అయింది ఇనుపఎద్దు అంటే నల్లని పశువులు అంటే మహిషజాతి పశువులు

**ఏగంటి - యాగంటి :** యాగల్లు గ్రామానికి ఔపవిభక్తిక రూపం ఏగంటివారి తత్త్వాలు సుప్రసిద్ధమైనవి

**ఏగినాటి - వేగినాటి :** ప్రాంతసూచి వేగినాటిలో ఎకారం లోపించి మొదటి రూపం ఏర్పడింది వేగినాడుకు ఔపవిభక్తిక రూపం వేగినాటి పేదవేగి, చినవేగి అనే రెండుగ్రామాలు పశ్చిమగోదావరిజిల్లాలో వున్నాయి చాళుక్యవంశానికి తీరాంధ్రంలో మొదటి రాజధాని వేంగి నాడు అంటేదేశం కొన్ని సందర్భాల్లో ఈ రాజ్యం నెల్లూరు వరకు విస్తరించి వుంది ఆ ప్రాంతం వారు ఇతర ప్రాంతాలను వలసవెళ్ళినపుడు అక్కడ ఆ కుటుంబాలను దేశ భేదంతో గుర్తించడం వలన అది వారికి గృహనామం అయింది

**ఏగిశెట్టి - వేగిశెట్టి :** వేగి చూడు ఆరోపం వేగి శెట్టి అనగా వ్యాపారం చేసే వ్యక్తి

**ఏగేశిన - వేగేశిన :** ఇది వేగి దేశసంబంధి కావచ్చును

**ఏజెళ్ల - వేజెళ్ల - వేజెండ్ల :** వేజెండ్ల అనే గ్రామం గుంటూరుజిల్లాలో వుంది నిజానికది ఏజెళ్ల ఏ అనేవర్ణం మన వ్యవహారంలో యే, వే, లుగా మారుతుంది. ఇది ఒక చెట్టు చేవెళ్ల, మారెళ్ల, తురిమెళ్ల లాంటివి కూడా ఇలాంటివే

**ఏటుకూరి :** ఏటుకూరు అనేగ్రామం గుంటూరుకు సమీపంలో వుంది దాని ఔపవిభక్తికరూపం ఏటుకూరి. ప్రసిద్ధ కర్షక కవి వెంకటనరసయ్యగారి గృహనామం ఇదే

**ఏటూరి - వేటూరి :** కృష్ణాజిల్లా నందిగామ తాలూకాగ్రామం, మరో గ్రామం నెల్లూరి జిల్లా రాపూరు తాలూకాలో వుంది వేట్టూరు అనేగ్రామం తమిళనాడులోని మధురాంతకం తాలూకాలోవుంది వేటూరి ప్రభాకరశాస్త్రి ప్రసిద్ధులు.

**ఏడిద :** తూర్పుగోదావరి జిల్లా రామచంద్రాపురం తాలూకా గ్రామం

**ఏనుగు - ఏనుగుల :** ఇది జంతుసూచి కాకపోవచ్చు గుంటూరుజిల్లాలో ఏనుగుపాలెం విశాఖజిల్లాలో, ఏనుగుతుని, ఏనుగువలస, ఏనుంగుల ఏనుంగు అనేగ్రామాలు, నెల్లూరుజిల్లాలో ఏనుగువాడ గోదావరిజిల్లాల్లో ఏనుగులగూడెం, ఏనుగధారపల్లి, ఏనుగపల్లి గ్రామనా అనే గ్రామాలున్నాయి బహుశా ఈ గృహనామానికి పైగ్రామాల్లోని పూర్వపదం గృహనామమై యుండవచ్చు ద్రాక్షారామ శాసనాల్లో (శా శ 1065) ఒక ఏనుంగు నారాయణుడు పేర్కొనబడ్డాడు. కాశీయాత్ర చరిత్రకర్త ఏనుగుల వీరాస్వామి

**ఏమినేని - వేమినేని :** వ్యక్తినామం వేమశబ్దపు రూపాలు నేని నాయకశబ్దభవం

**ఏరువ :** ఒకప్రాంతపు పేరు. పొదిలి, దర్శి, బద్వేలు, సిద్ధవటం, మార్కాపురం తాలూకాల భూభాగము శా శ 1043 నాటి ద్రాక్షారామ శాసనాల్లో ఒక ఏరువ తొండయరాజు ప్రసక్తివుంది అతడు సూర్యవంశోద్భవునిగా, కోదూరు పురాధీశ్వరునిగా సంభావింపబడ్డాడు

**ఏర్లగడ్డ, యేర్లగడ్డ - యార్లగడ్డ :** యార్లగడ్డ పేరుతో కృష్ణా, గోదావరి జిల్లాల్లో గ్రామాలున్నాయి దేవరకోట (చల్లపల్లి) జమీందారులు యార్లగడ్డవారు

**ఏలేశ్వరం - ఏలేశ్వరపు :** ఏలేశ్వరం అనేగ్రామం తూర్పుగోదావరిజిల్లా పెద్దాపురం తాలూకాలో వుంది

**ఒడ్య :** శాశ 1305 నాటి సింహాచల శాసనంలో ఒక ఒడ్యపెద్ది భట్టు ప్రస్తావన వుంది ఇతడు దేవాలయంలో వేదాధ్యయనము చేయించే కొరకు నియమింపబడ్డాడు ఒడ్య శబ్దం ఒడియా ను సూచిస్తుంది

**ఒమందూరి :** ఒమందూరు అనే గ్రామం తమిళనాడులోని దిండివనం తాలూకాలో వుంది.

**ఒమ్మి :** పాలకొండ తాలూకాగ్రామం

**ఓటి :** గ్రామనామ పూర్వపదం. ఓటిగుంట ఓటేరు అనేగ్రామాలున్నాయి ఓటివారిపల్లె చిత్తూరుజిల్లా గ్రామం.

**ఓబుళనేని :** అహోబిల శబ్దం ఓబుళగా పరిణమించింది. శా శ 1446నాటి మదనపల్లి తాలూకా కమ్మేపల్లిశాసనంలో ఒక ఓబుళ్నాయని తిప్పినాయని ప్రస్తావన ఉంది.

**ఓలేటి-వోలేటి :** ఈ రెండు విధాలుగాను వ్రాస్తారు ఓలేరు అనే గ్రామం గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాలో వుంది. దాని ఔప విభక్తిక రూపం ఓలేటి. ఓలేటి పార్వతీశంగారు ప్రసిద్ధ రచయిత

**కంకణాల :** గుంటూరుజిల్లాలో కంకణాలపల్లె అనే గ్రామం వుంది. శా.శ 1090 నాటి ముఖలింగం శాసనాలలో ఒక కంకణాల పోతయ ప్రస్తావన వుంది.శా.శ. 1163 నాటి బాపట్ల శాసనంలో ఒక కంకనాల కందెనాయకుని ప్రస్తావన వుంది.

**కంగాణి :** విశాఖజిల్లా గ్రామం. శా.శ. 1309 నాటి సింహాచల శాసనంలో ఒక కంగాణి జంతోజు ప్రస్తావన వుంది.

**కంచి - కంచె :** గ్రామనామం. శా.శ 1265 నాటి సింహాచల శాసనంలో ఒక కంచి మహాసేనాపతి ప్రసక్తి వుంది. కంచి గురవరాజు ఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది.శా.శ. 1221 నాటి అలంపురం శాసనంలో కంచె మారిసెట్టి ప్రస్తావన కలదు.

**కంచనప్రోలి :** గ్రామనామం. శా.శ. 1218 నాటి పాలకొల్లు శాసనంలో ఒక కంచనపోలి దేవన ప్రస్తావన వుంది.

**కంచార :** కంచర జాతి సూచకం. కంచార చెంగన్నఖండ్రిక కాళహస్తి తాలూకాలో వుంది.

**కంచెన :** వ్యక్తినామం. కంచి, అన్నతో చేరి కంచెన్న అయింది. కంచన చెంగన్న ఖండ్రిక కాళహస్తి తాలూకాలో వుంది.కంచనప్రోలు అనేగ్రామం వుంది. అలా గ్రామనామ ప్రథమావయవం కూడాకావచ్చు.

**కంతేటి :** కంతేరుపై ఔపవిభక్తికరూపం. పశ్చిమగోదావరి, గుంటూరు జిల్లాల్లో ఈ పేరుతో గ్రామాలున్నాయి.

**కటకం :** గ్రామనామం. ఒరిస్సాలోని కటక్ తెలిసిందే. అడవిలోని పల్లెను కటకం అంటారు కటకం అయ్యప్పపేట శ్రీకాకుళం తాల్లూకాగ్రామం.

**కటికినేని :** వ్యక్తినామం. కటిక శబ్దం వ్యవహారంలో కసాయి అనేదానికి మారుగా వ్యవహారంలోవుంది. వ్యక్తి నామంగా దీనిని సంయోజింప లేము. నిజానికిది, కటికి గ్రామ నాయకుడు అనే అర్థంలో వచ్చింది. కటికి అనేగ్రామం. గుణుపురం ఏజెన్సీలోవుంది. ఇది ఒక చెట్టు. కటిక రోడి అని దానిపేరు.

**కట్టుగుత్త - కట్టుబడి:** వ్యవసాయపు కవుళ్లలోని భేదం. కట్టుగుత్త వెంగన్నగారి పల్లె కమలాపురం తాలూకాలో వుంది. కట్టుబడి వారిపాలెం నరసరావుపేట తాలూకాలో వుంది. కాగా కట్టుబడి అనే గ్రామం బిస్సంకటాకు ఏజెన్సీలో వుంది.

**కటారి :** శాసనల్లో ఇది కట్టారిగా కన్పిస్తోంది. శా.శ.1069 నాటి విజయవాడ శాసనంలో ఒక కట్టారి దాసిరెడ్డి పేర్కొనబడ్డాడు. దీనిని బట్టి ఇది ఖడ్గసంబంధమైనదిగా చెప్పడం సాధ్యంకాదు. ఒక అధికార పదవిగా చెప్పాలి. కటారివాండ్ల పల్లె చంద్రగిరితాలూకాలో వుంది.

**కడప :** ఆ జిల్లాకేంద్రగ్రామం కడప కోటిరెడ్డి ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు.

**కడమ చెర్ల:** గ్రామనామం శా శ 1386 నాటి శాయింపేట శాసనంలో హరితగోత్ర కడమచెర్ల గోపయ ప్రస్తావన వుంది

**కడియం - కడియాల :** రాజమండ్రి తాలూకాగ్రామం కడియాల వారిపల్లె చంద్రగిరి తాలూకాలో వుంది కడియం ఒక రకం గడ్డి

**కడివెండి :** గ్రామనామం

**కందనేని - కంఠంరాజు :** ఇది నిజానికి శ్రీకంఠంనేని వ్యక్తినామాలు శ్రీకంఠుడు శివుడు కంఠంరాజు కొండూరు గుంటూరు తాలూకాగ్రామం

**కత్తి - కత్తుల :** ఖడ్గమనే అర్థంలో తెలిసిందే దీనిని ఉపయోగించే వారికి ఆ ఇంటిపేరు వచ్చియుండవచ్చునని భావించడం జరుగుతుంది అలాకావడానికి అవకాశం లేకపోలేదు కాని ఇది ఒక రకం చెట్టు కత్తిచెట్టు అనే గ్రామం గొలుగొండ ఏజెన్సీలో వుంది కత్తిమడుగు అనే గ్రామం కంగుంది డివిజన్‌లోను కత్తిపూడి అనే గ్రామం తూర్పుగోదావరి జిల్లాలోను వున్నాయి కత్తి చెట్టు అనేగ్రామం గొలగొండఏజెన్సీలోవుంది శా శ 1443 నాటి జమ్మలమడుగు తాలూకా దొమ్మరనంద్యాల శాసనంలో ఒక కత్తి తిప్పినాయడు ప్రస్తావింపబడ్డాడు చూడు కత్తి శా శ 1263 నాటి శ్రీకూర్మం శాసనంలో ఒక కత్తుల కూనపనాయకుని ప్రస్తావన వుంది శా శ 1301 నాటి శ్రీకూర్మం శాసనంలో మరొక కత్తుల భూమాసాని ప్రసక్తి గలదు ఈ ఇంటిపేరుతో కత్తి పద్మారావు ప్రముఖులు

**కదిరి :** గ్రామనామం తాలూకా కేంద్రం ఖదిర అనేది ఒక చెట్టు కదిరి ముత్తనపల్లె కంగుంది డివిజన్‌లో వుంది

**కనకధార :** శా శ 1262 నాటి నాటి సింహాచలం శాసనంలో ఒక కనకధార ఉయ్యమ్మ ప్రస్తావన గలదు కనక అనేగ్రామం ఛత్రపూర్ తాలూకాలోవుంది

**కనకమేడల :** పదం బంగారు మేడలు (భవనం) గా భాసిస్తోంది కాని ఇది గ్రామనామం గావచ్చు కనకధార అనే గ్రామం, మేడలైను అనే గ్రామాలున్నాయి. అలాగే కనకవల్లి, మేడపి మేడపాడు అనేగ్రామాలు కూడా వున్నాయి

**కనగాల :** గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాగ్రామం

**కనుపర్తి :** ఇది కనుపర్రుకు ఔపవిభక్తిక రూపం ఈ పేరుతో గుంటూరు. కడపజిల్లాల్లో గ్రామాలున్నాయి కనిమె అనేది ఒక రకం గడ్డి కనుమూరు, కనిగిరి, గ్రామాలలోని కను, కని అనేది కూడ ఇదే పర్రు అనేది, ప్రవాహాల ప్రక్కన గల ఎత్తైన భూమి పాలపర్రు, కొండిపర్రులను పోల్చిచూడండి కనుపర్తి అనేగ్రామం ప్రకాశంజిల్లాలోను నెల్లూరు జిల్లా రాపూరు తాలూకాలోవుంది అనిరుద్ధచరిత్ర కావ్యకర్త కనుపర్తి అబ్బయామాత్యుడు.

**కన్నం :** కన్నాం అనే గ్రామం గజపతినగరం తాలూకాగ్రామం

**కన్నెబోయిన :** ఇందలి కన్నెశబ్దము కన్య సంబంధికాదు. కృష్ణసంబంధి అది కన్నగా పరిణమించి కన్నగా రూపొందినది శా శ 1065 నాటి విజయవాడ శాసనాల్లో ఒక కన్నియ బోయడు పేర్కొనబడ్డాడు.

**కందాడ - కందాళ :** రెండు విధాలా వ్యవహారముంది కందాడు అనేగ్రామం తమిళనాడులోని దిండివనం తాలూకాలోవుంది. ఇది కందాళగా మారింది. చూడు . కందాడ శా శ 1464నాటి ప్రొద్దటూరు తాలూకా గోపవరం శాసనంలో వాధూలగోత్ర ఆపస్తంభ సూత్రుడు యజుశ్శాఖాధ్యాయియైన కంద్దాళ దేవరాజాచార్యుల ప్రస్తావన వుంది కందాళ గోవిందాచార్యుల ఖంద్రిక పుత్తూరు తాలూకాలో వుంది.

**కందిమళ్ల :** గ్రామనామం కందిమళ్ల బుచ్చయ్య చౌదరి ప్రముఖులు

**కప్పగంతుల:** తెలియవచ్చినంత వరకు బ్రాహ్మణుల్లో ముఖ్యంగా ఈ ఇంటి పేరు కన్పిస్తోంది దీనికి వేద పరనంలో ఒక రీతి అని అర్థం చెప్పడం జరిగింది ఈ భావన సరికాదనిపిస్తోంది వేద పరనం ఒక క్రమంలోనే జరుగవలసియుంది. దానికి భిన్నమైన రీతి అంగీకార్యము కాదు. సంస్కృతంలో దీనికి సమానమైన పదం మండూక గతి అక్కడ దీనికర్థం వ్యాకరణపరంగా, కొన్ని సూత్రాలను క్రమం వదలి పరించడం. దీనికి కారణమిది సృష్టిలోని సమస్త జంతుజాలపు గమనరీతికి సాధారణ పద్ధతిలో ఒక క్రమం వుంటుంది అంటే ఒక అడుగుకు మరో అడుగుకు మధ్యగల దూరం దానిని గమించడానికి పట్టే వ్యవధిలో సమత వుంటుంది. కాని కప్పగమనం అలా వుండదు అది గెంతే తీరులో సమత వుండదు ఒక గెంతులో వుండే దూరానికి, దాని తరువాతి గెంతులో వుండే దూరంలో వ్యత్యాస ముంటుంది. పిల్లలు నీటిమీద తేలి ఎగిరే పద్ధతిలో చిల్ల పెంకులు విసరుతారు అది నీటిని తాకి మరల ఎగిసి మరల నీటిని తాకి గెంతుతూ ప్రయాణం చేస్తుంది ఆ గెంతులలో కూడా సమస్థితి వుండదు అందువలన ఆ ఆటను కప్పగంతులంటారు అవిధంగా సూత్ర పరనంలో క్రమం తప్పి చదివితే దానిని మండూక గతి అంటారు అలా చదివే వారికి ఆ కుటుంబ నామం స్థిరపడియుండవచ్చును

కాగా లోకంలో కప్పగంతు లేక కప్పదాటు పదానికి మరో సందర్భంలో కూడా వ్యవహారంలో వుంది ఇది నాడీ చలనానికి సంబంధించింది గుండె కొట్టుకునే విధానాన్ని ఆశ్రయించి వుంటుంది దీని చలనంలో కూడ ఒక క్రమం వుంటుంది వ్యక్తియొక్క ఆరోగ్యాన్ని బట్టి దీని చలనంలో భేద మేర్పడుతుంది అంటే చలనానికి చలనానికి మధ్యగల వ్యవధి తక్కువ గావచ్చు. ఎక్కువ గావచ్చు. ఏమైనా అప్పుడు కూడ ఒక సమత వుంటుంది చలనంలోని హ్రస్వ దీర్ఘతలను బట్టి వైద్యుడు రోగ నిదానం చేస్తాడు. (ఇప్పుడు నాడీచలనం గమనించగలవారు తక్కువైనారు) అలాకాక, సమత లోపించి, ఒకసారి దీర్ఘంగా, మరొకసారి

హ్రస్వంగా, ఒక సమతలేని నాడీ చలనం వుంటే నాడి కప్పదాటు వేస్తోందంటారు అలాంటి రోగిని మరణం నుండి తప్పించడం దాదాపుగా అసాధ్యం అంటే నాడీ చలనాన్ని గ్రహించడంలో ఎంత నేర్పు అవసరమో బోధపడుతోంది అలాంటి చలనాన్ని గ్రహించి, కప్పదాటుగా నిర్ధారించడం చాలా నైపుణ్యంతో కూడినదని, దానిని గ్రహింపగలవారికి, కప్పగంతుల అనేది పౌరుషనామంగా వర్తిస్తోందని మరొక భావన ఈ రెంటిలో ఆ కుటుంబాలవారికి దేనివల్లనైనా ఆ గృహనామం స్థిరపడి యుండవచ్చు.

**కమతం :** శా శ 1078 నాటి అమరావతి శాసనంలో ఒక కమతం వాసెనాయకుని ప్రస్తావన వుంది ఇతడు కులోత్తుంగ చోడగొంక నరేశ్వర శ్రీపాదారాధకునిగను విప్రప్రసాదనిత్యోదయుని గను చెప్పబడ్డాడు కమతం అంటే సేద్యభూమి కమతగాడు అంటే పాలేరు నిజానికి సేద్యగాడు అని అర్థం కర్ణాటకలోని కామత్ కూడా ఇదే అయితే కమతం అనే గ్రామం, రావికమతం అనే గ్రామం కూడా వున్నాయి

**కంబర :** పాలకొండ తాలూకాగ్రామం

**కంభం :** ప్రకాశంజిల్లా గ్రామం కంభవారిపల్లె అనేగ్రామం వాయల్పాడు తాలూకాలో వుంది

**కరణం :** గ్రామ ఆయవ్యయాలు వ్రాసే ప్రభుత్వాధికారిగా కరణం తెలిసిందే వారు సాధారణంగా నియోగిశాఖకు చెందిన బ్రాహ్మణులై వుంటారు అయితే ఇంటిపేరులోని కరణం ఎల్లవేళలా, ముఖ్యంగా బ్రాహ్మణేతరుల్లో అయినపుడు గ్రామాధికారి అనే అర్థంలో వర్తింపదు. ఇది ఒక ప్రాంతం పేరు వల్లభరాయని క్రీడాభిరామంలో ఒక కరణకాంత ప్రసక్తివుంది గుంటూరునుండి నెల్లూరిసీమ పర్యంతం గల తీరభూమికి కర్ణాటకమని పేరు. దానికి పడమరగా నున్న తూర్పుకనుమలను అంటివున్న భూభాగం (కనిగిరి నుండి సుమారుగా వెంకటగిరి వరకు) కటకం ఈ రెంటికి నడుమగల భూభాగం అనగా కర్ణాట కటక దేశాలమధ్య గలది కరణదేశం ఉదయగిరి కర్ణాట కటక మధ్యస్థలంగా చెప్పబడింది. శా శ 1407 శాసనంలో ఒడ్డెరాజులు, తురకరాజులు, తెలుగురాజులతో పాదు కరణరాజులు పేర్కొనబడ్డారు బ్రాహ్మణేతర ఇంటిపేరులోని కరణం, ఆ కుటుంబీకులు ఆ ప్రాంతంవారని తెలియజేస్తుంది కరణాలు మూడు విధాలు శిష్ఠ, గోష్ఠి, సంప్రతి అనేవి

**కరవది :** బాపట్ల తాలూకా గ్రామం శా శ 1496నాటి తెనాలి తాలూకా శేకూరు శాసనంలో ఒక కరవది కొండయ్య ప్రస్తావన వుంది

**కరివెన :** నందికొట్కూరు తాలూకాగ్రామం.

**కర్నాటి - కర్ణాటి :** ప్రాంతవిశేషము కర్నాటక అనగానే సాధారణంగా నేటి కర్ణాటక రాష్ట్రం మదిలో మెదులుతుంది. కాని గృహనామంలోని కర్నాటి దానికి చెందినది కాదు. గుంటూరునుండి నెల్లూరి వరకు గల తీరభూమికి కర్నాటకమని పేరు అందులో గుంటూరు నుండి ఒంగోలు వరకు గలది వెలనాడు ఆ పైది పాకనాడు. శ్రీనాధుడు తనభాష కర్ణాట భాష అనడంలోని అంతర్యమిదే అతడు సింగరాయకొండ సమీపంలోని పాకల గ్రామానికి

చెందినవాడు. ఇంటిపేరులోని కర్నాటి బంగోలు, కావలి మధ్యగల తీరప్రాంతాన్ని సూచిస్తుంది. శా.శ. 1107 నాటి కూడలి సంగమేశ్వరం శాసనంలో కర్నాటి గోకర్ణ దేవ మహారాజుల ప్రస్తావన వుంది. కర్నాటి లక్ష్మీనరసయ్య ప్రముఖ జానపద కళాకారులు.

**కర్రా:** కర్ర అనే గ్రామం శ్రీకాకుళం జిల్లాలో వుంది. కర్రావారిసావరం తాడేపల్లి గూడెం తాలూకాగ్రామం.

**కర్రి:** కర్ర గ్రామపు ఔపవిభక్తిక రూపం. కర్రి సాంబమూర్తిశాస్త్రి ప్రముఖులు.

**కలగర:** కృష్ణాజిల్లా తిరువూరు తాలూకా గ్రామం.

**కలపాల:** కలువపాముల అనే గ్రామనామం గృహనామ వ్యవహారంలో కలపాల అయింది. ఇది కృష్ణాజిల్లా గన్నవరం తాలూకాగ్రామం. కలపాల సూర్యప్రకాశరావు ప్రముఖులు.

**కలబంద:** వృక్షసూచి. బహుశా ఈ పేరుతో గ్రామం వుండి వుండవచ్చు. కలబంద వారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది.

**కలికిరి:** వాయల్పాడు తాలూకాగ్రామం.

**కలిదిండి:** కృష్ణాజిల్లా కైకలూరు తాలూకాగ్రామం. కలిదిండి కృష్ణంరాజు ప్రముఖులు.

**కలిపినేని:** శా.శ. 1088నాటి అమరావతి శాసనంలో ఒక కల్లపనాయకుని ప్రస్తావన ఉంది. ఇతడు దుర్జయవంశస్తునిగను, సామంతునిగను, ముచ్చయ కుమారునిగను చెప్పబడ్డాడు. కలిపి గ్రామనామం.

**కలుగోట్ల:** కోయిలకుంట్ల తాలూకాగ్రామం.

**కలువకొల్ని - కలువ కొలను:** గ్రామనామం. శా.శ 1386 నాటి శాయింపేట శాసనంలో కాశ్యపగోత్ర యజుశ్శాఖీయుడైన కలువకొల్ని మల్లుభట్లు ప్రస్తావన వుంది.

**కలువాయ (యి)** ఆత్మకూరు తాలూకాగ్రామం.

**కల్యాణం:** శా.శ. 1478 నాటి గుత్తితాలూకా గజరాంపల్లి శాసనంలో కల్యాణం వీరయ ప్రస్తావన వుంది. బహుశా ఇది కల్యాణ దుర్గానికి సంక్షిప్తరూపం కావచ్చు.

**కల్లూరు:** దీని ఔపవిభక్తిక రూపం కల్లూరి. కల్లు ఊరుల కలయిక కల్లూరు. కల్లు అంటే రాయి. పర్వతం. అదిగల గ్రామం కల్లూరు. అనంతపురం జిల్లాలో ఈ పేరుగల గ్రామాలున్నాయి. ఆ ఊరు వదలి వచ్చిన కుటుంబాలవారు, క్రొత్తచోట, ఆగ్రామనామంతో వ్యవహరింపబడడం కారణంగా కాలక్రమంలో అది ఆ కుటుంబాలకు ఇంటిపేరయింది. అయితే పై గ్రామమే కానక్కరలేదు. ఇతర జిల్లాల్లో కూడ కల్లూరు పేరుతో చాలా గ్రామాలున్నాయి. కల్లూరి చంద్రమౌళి మంత్రిగా పనిచేశాడు.

**కళింగ:** దేశ విశేషము. నేటి ఒరిస్సాలోని బెరహంపూరు నుండి పిఠాపురం వరకు గల ప్రాంతము కళింగదేశము. ఇది ఉత్కలింగము, మదు కలింగము (మధ్య కలింగము) కలింగము అని మూడు విభాగాలు. పిఠాపురం ప్రాంతము కలింగములోనిది. అయితే

ఈ కళింగ అనే పేరు ఉత్తరభారతం నుండి వచ్చింది గంగానది పరీవాహక ప్రాంతంలో వున్నట్లు చరిత్రకారుల కథనం కలింగ మాదిరాజు ప్రస్తావన శా శ 1370 నాటి కాకినాడ తాలూకా భీమవరం శాసనంలో వుంది ఇతడు కౌండిన్య గోత్రుడు కౌండిన్య గోత్రులైన మాదిరాజు వారికి, శాసనంలోని మాదిరాజుమూల పురుషుడుగావచ్చును

**కళ్లేపల్లి :** కృష్ణాజిల్లా దివితాలూకా గ్రామం. శాసనాల్లో కడలుపల్లిగా వ్రాయబడింది

**కవిటి :** శ్రీకాకుళ తాలూకాగ్రామం

**కవిత :** టెక్కలి తాలూకాగ్రామం.

**కవులూరు (రి) :** నంద్యాల, బెజవాడ తాలూకాలలో ఈ పేరుతో గ్రామాలున్నాయి

**మునగాల:** కృష్ణా, కర్నూలు జిల్లాల్లో ఈ పేరుతో గ్రామాలున్నాయి

**కసుకుర్తి :** కసుకుర్రు అనే గ్రామం గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాలో వుంది దాని ఔపవిభక్తిక రూపం.

**కస్తల :** ఈ గ్రామం గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలోవుంది

**కస్తూరి :** పరిమళద్రవ్యం కస్తూరిపాడు శ్రీకాకుళం తాలూకాగ్రామం హిందూపత్రిక యజమానులు కస్తూరివారు.

**కాకర్ల :** కృష్ణా, ప్రకాశం, శ్రీకాకుళం జిల్లాలో ఈ పేరుతో గ్రామాలున్నాయి త్యాగరాజ స్వామివారి గృహనామం ఇదేనని చెపుతారు.

**కాకాని :** చినకాకాని పెదకాకాని అనే గ్రామాలు గుంటూరు జిల్లాలోను, కాకాని అనే గ్రామం ప్రకాశంజిల్లా వినుకొండ తాలూకాలోను వున్నాయి శాసనాలలో కాకాండిగా ప్రస్తావింపబడింది కాకాణి అని కూడ వ్రాస్తారు. కాణి అంటే భూఖండము వరగాని లోని కాని కూడ ఇదే ప్రముఖ నాయకులుగా కాకాని వెంకటరత్నం పరిచితులే.

**కాకి :** ఇది పక్షిపేరుగా తెలిసిందే అయితే గృహనామ సంబంధంగా, పక్షికి సంబంధం లేదు కాకి అనేది ఒక చెట్టుపేరు ఈ పేరుతో అనంతపురం జిల్లా మడకశిర తాలూకాలో గ్రామముంది కాకిమడుగు కాకి మాధవరావు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు

**కాగిత - కాయిత :** ఇది మనం వ్రాసుకుంటున్న కాగిత సంబంధికాదు ఇది ఒక చెట్టు, అసలు పేరు కాకతి ఈ పదంతో పెద్దకాకితపల్లె అనేగ్రామం శ్రీకాకుళంజిల్లాలోను కాగిత అనేగ్రామం విశాఖపట్నంజిల్లా వీరవల్లి సర్వసిద్ధి తాలూకాల్లో వున్నాయి ఈ గ్రామం నుండి రావడంవల్లనే కాకతీయులకు ఆ పేరుగలిగి వుండాలి.

**కాచినేని :** ఇది వ్యక్తినామం. ఇందలి కాచ కాశ కాశి శబ్దసంబంధి శాసనాల్లో (శా శ 1337 కొండవీడు) ఒక మచ్చ కాచినేని పేర్కొనబడ్డాడు. అతడు కొలవేమసాని తండ్రిగా చెప్పడం జరిగింది.

**కాజ - కాజులూరి:** కాజ పేరుతో ప్రసిద్ధంగా రెండుగ్రామాలు గుంటూరుజిల్లా కృష్ణాజిల్లాల్లో వున్నాయి శాసనస్థనామం క్రాంజ. నారాయణ తీర్థుల స్వగ్రామం గుంటూరుజిల్లాలోనిది. కాజులూరు అనే గ్రామం గోదావరి జిల్లాలో వుంది. శా శ.1718 నాటి పేద కళ్ళేపల్లి శాసనంలో క్రాంజ లింగారెడ్డి ప్రస్తావన వుంది

**కాటపర్తి :** గ్రామనామం. శా శ 1220 నాటి పాలకొల్లు శాసనంలో ఒక కాటపర్తి శ్రీపతిప్రగ్గడ ప్రస్తావన వుంది.

**కాటమనేని :** వ్యక్తినామం కాటయ్య పైనేని చేరింది కాటిరేడు అనేది శివుని బోధిస్తుంది. నేని నాయకశబ్దభవం.

**కాటంరెడ్డి :**శా.శ. 1310 నాటి సర్పవరం శాసనాల్లో ఒక కాటమరెడ్డి వేమారెడ్డి ప్రస్తావన గలదు ఇతడు కొండవీడు నేలిన కుమారగిరి బావమరది, రాజమండ్రి నేలిన కాటయవేమారెడ్డి

**కాటూరు:** ఈ పేరుతో కృష్ణ, చిత్తూరు జిల్లాల్లో గ్రామాలున్నాయి సౌందరనందకావ్యకర్త కాటూరి వెంకటేశ్వరరావు గారు సాహితీ లోకానికి పరిచయమైనవారే

**కాటేపల్లి :** గ్రామనామం శా శ 1197 నాటి పొన్నూరు శాసనంలో కాటేపల్లి అప్పరాజు ప్రస్తావనవుంది

**కాట్రగడ్డ :** ఇది ఊరి పేరుగనుక ఏ కులంవారిలో నయినా వుండే అవకాశముంది ఇక్కడ కులమనే పదం, ప్రస్తుతం విస్తృత ప్రచారంలో వుంది గనుక ఉపయోగం కలుగుతోంది కులశబ్దం సంస్కృత సంబంధి. తెలుగులో దీనికి సమానమైన పదం లేదు. తెలుగు సమాజంలో వున్నవి వృత్తులే తప్ప కులాలు కావు. కనుక ఇక్కడా ఇక ముందూ కులమనే పదం వ్యవహార బోధ కొరకు మాత్రమే ఉపయోగింపబడుతోందని గ్రహింప మనవి.

కాట్రగడ్డ అనే పేరుతో రెండు పదాలున్నాయి. గడ్డ అనే పదం ఎత్తైన నేల, ముఖ్యంగా నదీ తీరస్థమైన భూమిని తెలియపరుస్తుంది. యార్లగడ్డ, నంగేగడ్డ, పురిటిగడ్డ మొదలైనవన్నీ ఇలాంటివే. అంతేగాక గడ్డ శబ్దం ప్రవాహార్థంలో కూడా వుంది గడ్డమణు(దు)గు కొండూరు అనే దాని లోని, గడ్డ ప్రవాహ సూచియే దీనిని కాట్రగడగా భావించి, కంపకోటగా అర్థం చెప్పడం జరిగింది కాని అది సమంజసము కాదు ఈ కాట్రగడ్డ అనే గ్రామం, శ్రీకాకుళం జిల్లాలో వుంది. కాట్ర అనేది ఒక రకం గడ్డి గుంటూరు జిల్లాలో కాట్రపాడు అనే గ్రామముంది అట్రగడ (అక్కుళ్లు) వరిభేదంగా తెలిసిందేగదా

విజయవాడలో నేడు అంతర్భాగమైన మొగల్రాజపురంలో కాట్రగడ్డ కుటుంబానికి చెందిన కమ్మ వారున్నారు. ఒకప్పుడది స్వతంత్ర గ్రామం. అది కాట్రగడ్డవారికి మొఖాసాగా చెల్లివచ్చినదని వయోవృద్ధులు చెప్పగా తెలిసింది. కాని అలాంటి ఆధారమేమీ లేదని ఆ కుటుంబానికి చెందిన వారొకరు చెప్పారు. కాట్రగడ్డ నరసయ్య ప్రముఖులు

**కాట్నేని :** వ్యక్తినామం కాటినాయకుడు. కాట్నేని ఎర్రగుడి కొమారకాలవ రాయచోటి తాలూకాగ్రామం

**కాండూరు(రి) :** గ్రామనామం. కాండూరి వారి అగ్రహారం ఒంగోలు తాలూకాలోవుంది.

**కాంద్రు :** కాంద్రు అనేగ్రామం నెల్లూరుజిల్లా గూడూరు తాలూకాలో వుంది. కాంద్రుపాడు అనే గ్రామం కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలో వుంది

**కానాల :** నంద్యాల తాలూకా గ్రామం. బనగానపల్లి ప్రాంతంలో కూడా మరోగ్రామం వుంది. కాన, ఆల ల కలయిక కానాల కన కూడా గడ్డి కనిగిరిలోనిది ఇదే.

**కానుకుర్తి :** గ్రామనామం. కానుకుర్త వారిపల్లె చంద్రగిరి తాలూకాలో వుంది కుర్తి : ఎత్తైన భూమి.

**కానుకొలను :** గ్రామనామం. కొలను తెలిసిందే.

**కానిపాప:** కానిపాప కామినేండు అనే వ్యక్తి ప్రస్తావన శా శ 1372 నాటి కాకినాడ తాలూకా భీమవరం శాసనంలో వుంది. అర్థం సమంగా తెలియరాదు. సంబోధనలో వస్తుంది. తల్లికాన, లంజకాన.

**కానూరి :** కానూరి పేరుతో రెండుగ్రామాలు కృష్ణాజిల్లా బందరు, విజయవాడ తాలూకాల్లో వున్నాయి. 'ఆంధ్రజ్యోతి' వ్యవస్థాపకులు కానూరి వారు

**కామన :** వ్యక్తనామం కామ అన్నల కలయిక కామన. కాముడు మన్మధుడు శా.శ. 1565 నాటి కోయిలకుంట్ల శాసనంలో కామన రంగారెడ్డి ప్రస్తావన వుంది

**కామర్సు కామరసు :** కామ అరసుల కలయిక. అరసు అంటే కన్నడంలో రాజు. ఇట్లు తిమ్మరసు. శా. శ. 1479 నాటి చిన్న అహోబిలం శాసనంలో కామరసు వారి ప్రస్తావన వుంది.

**కామరాజుగడ్డ :** గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాగ్రామం.

**కామినేని :** వ్యక్తినామం. కామ, కామిగా మారింది కామశబ్దం మన్మధుని సూచిస్తుంది నేని నాయకశబ్దభవం.

కామనాయకుడు అనే వ్యక్తినామ పరంగా వచ్చిన గృహనామం. శా.శ. 1071నాటి ద్రాక్షారామ శాసనంలో ఒక దండనాయకుడైన కామినాయకుడు పేర్కొనబడ్డాడు. కామినేని పల్లె శిరివెళ్ల తాలూకాగ్రామం.

**కామిశెట్టి :** వ్యక్తినామం కాకినాడ తాలూకా భీమవరం శాసనంలో ఒక కామిశెట్టి పోతమ్మ ప్రస్తావన గలదు.

**కాము :** శా శ.1328 నాటి మదనపల్లి తాలూకా తంబళ్లపల్లిగ్రామ శాసనంలో వెంగలి కులస్థుడైన ఒక కాము దోరపనాయని ప్రస్తావన వుంది. ఇతనికి నాయంకరముంది.

**కారుమంచి:** ప్రకాశంజిల్లా గ్రామం ఇది ఒకరకం మొక్క పోల్చిచూడు. కామంచి

**కారుమూరి:** కారుమూరుకు ఔపవిభక్తికరూపం గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాగ్రామం

**కాలవ:** కర్నూలు తాలూకా గ్రామం కాలవ వారి ఖండ్రిక రాజంపేట తాలూకాగ్రామం కాలువ కృష్ణయ్య అనే వ్యక్తిప్రస్తావన శా శ 1469 నాటి కదిరి తాలూకా పట్నం శాసనంలో వుంది

**కాసరనేని:** వ్యక్తినామం కేరళలో కాసరగోడ్ ఒక గ్రామం కాసర ఒక గడ్డి కాసరనేనిపాలెం కృష్ణాజిల్లాలో వుంది

**కాళంగి:** గ్రామనామం. శా శ. 1242 నాటి మక్తల శాసనంలో ఒక కాళంగి సింగన ప్రసక్తి ఉంది

**కాళోజి :** కాళ, కాళి శబ్దభవం దానిపై 'జీ' చేరి వ్యక్తినామంగా ప్రవర్తిల్లింది ఇది మహారాష్ట్ర భాషా ప్రభావం. ఈ గృహనామంతో ప్రసిద్ధులైనవారు కాళోజి నారాయణరావు

**కాళ్ల - కాళ్లకూరు:** పశ్చిమగోదావరి జిల్లా భీమవరం తాలూకాగ్రామం కాళ్ల + కుర్రు కాళ్లకూరు అయింది కాళ్ల అనే గ్రామంకూడ ఇదే తాలూకాలో వుంది ఇది ఒక చెట్టు అంతే తప్ప శరీరావయవంకాదు వరవిక్రయ కర్త నారాయణరావుగారి గృహనామం కాళ్లకూరి.

**కావూరి:** కావూరి పేరుతో రెండు గ్రామాలు గుంటూరు జిల్లాలో వున్నాయి. అందొకటి కొండకావూరు. ఇందలి కొండ కోటప్పకొండకు సంకేతం.

**కాసు - కాసులు:** కాసుపై బహువచనం కాసుల. బంగారాన్ని కాసులలో చెప్పడం వుంది. అయితే ఇది అలా వచ్చింది కాదు. కాసలనాడు ఒక ప్రాంతం. మెదకు జిల్లా ప్రాంతం కాసలనాడు. శా శ. 1124 నాటి జలాలుపురం శాసనంలో ఒక కాసు మల్లోజు ప్రస్తావన వుంది కాసుల పురుషోత్తమ కవిసాహితీలోకానికి బాగా పరిచితుడు. కాసు బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగాపనిచేశారు

**కింతలి:** చీపురుపల్లె తాలూకాగ్రామం కాళింగులలో కింతల కాళింగులు ఒక భేదం

**కింతాడ:** గ్రామనామం. శా.శ. 1281 నాటి సింహాచలం శాసనాలలో ఒక కింతాడ చింగన బోయని ప్రసక్తి వుంది వీరవల్లి తాలూకాలోవుంది.

**కిలారు:** కిలరము అంటే పశుసంపద పశుశాల. దానిపై అధికారి కిలారి. కీలారము అని కూడా శాసనాల్లో ప్రస్తావింపబడింది ప్రభువులకు, దేవాలయాలకు గల పశుసంపదను, పశుశాలలను కిలరముగా సంభావింపబడ్డాయి 1 శ్రీ భీమేశ్వర మహాదేవర కిలరము ' ద్రాక్షారామ శాసనాలు. శా శ 1318 నాటి సింహాచలం శాసనంలో కిలారి శ్రీరామపడ్డిరాయని ప్రస్తావనగలదు

**కిళాంబి - కిడాంబి :** శా శ 1386 నాటి శాయింపేట శాసనంలో ఆత్రేయగోత్రుడైన కిళాంబి ధర్మయప్రస్తావన గలదు వైష్ణవుల్లో గృహనామంగా కన్పిస్తుంది తమిళనాడులోని గ్రామనామమై యుండవచ్చు

**కీసర :** కృష్ణాజిల్లా నందిగామ తాలూకాగ్రామం

**కుక్కల:** జంతు సంబంధిగా కుక్క తెలిసిందే దీనిపై బహువచనం చేరితే కుక్కల అవుతుంది అయితే గృహనామంలోని కుక్కల జంతు సంబంధి కాదు ఇది గ్రామ నామం కుక్కలపల్లె (చిత్తూరు), కుక్కనూరు అనే గ్రామాలున్నాయి కొన్ని మొక్కల పేర్లకు ముందు కుక్క చేరుతుంది కుక్క తులసి (Ocinum Canum) అలాంటిదే కన్నడంలో కుక్క అంటే పొదగా పెరిగే ఒక మొక్క, తెలుగులో పొగాకులాంటి కలుపు మొక్కను కుక్కపొగాకు (Blumea densiflora) అంటారు. కుక్కపల్లె వారిపాలెం నరసరావుపేట తాలూకాలో వుంది

**కుంకుదిటి :** కుంకుదురుకు ఔపవిభక్తిక రూపం కుంకుదురు గ్రామనామం శా శ. 1330 నాటి సింహాచల శాసనం ఒక కుంకుదిటి సెట్టి ఓబళ ప్రస్తావన వుంది ఇతదు సాంతాల గోత్రికుదు

**కుంచ :** రాయఘధ ఏజెన్సీ గ్రామం.

**కుడుములు :** గోలుగొండ ఏజెన్సీగ్రామం

**కుంటముక్కల :** కృష్ణాజిల్లా బెజవాడ తాలూకాగ్రామం

**కుదరవల్లి :** కృష్ణాజల్లా గుడివాడ తాలూకాగ్రామం

**కుందుర్తి :** కుందుర్రుపై ఔపవిభక్తిక రూపం నరసరావుపేట తాలూకాలో వుంది

**కుప్పిలి :** చీపురుపల్లి తాలూకా గ్రామం

**కుముదవల్లి :** బిస్సం కటాకు ఏజెన్సీగ్రామం

**కురగంటి - కురుగంటి :** కురగల్లుపై ఔపవిభక్తిక రూపం. కురగల్లు అనే గ్రామం మంగళగిరి తాలూకాలో వుంది శాసనాలలో కురుంగలు అని చెప్పబడింది కురుగంటివారి ఖంద్రిక కందుకూరు తాలూకాలో వుంది. సీతారామయ్య సాహితీ విమర్శకులు.

**కురప :** కురప బాచన్నగారి ఔనిపల్లె కురుపపల్లె అనేగ్రామం చంద్రగిరి తాలూకాలో వున్నాయి.

**కురుచేడు (టి) :** ప్రకాశంజిల్లా దరిశి తాలూకాగ్రామం. శా శ 1476 నాటి పెద్ద అహోబిలం శాసనాలలో కాశ్యపగోత్రుడు, అపస్తంబసూత్రం యజుశ్శాఖాధ్యాయి, సూర్యవంశోద్భవుడు, మహామండలేశ్వరుడు అయిన కురుజేటి తిమ్మరాజు ప్రస్తావింపబడ్డాడు

**కురుమద్దాలి :** కురుమద్దాల, అనే గ్రామం కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాలో వుంది.

**కురువాడ :** చీపురుపల్లె తాలూకా గ్రామం.

**కుర్రా :** కుర్ర పల్లె అనేగ్రామం నెల్లూరుజిల్లా ఉదయగిరి తాలూకాలో వుంది ఈ ఇంటిపేరుకు గ్రామనామంలోని కుర్ర కారణం కావచ్చు.

**కూచిపూడి :** ఈ పేరుతో కృష్ణాజిల్లా గుంటూరుజిల్లాల్లో గ్రామాలున్నాయి

**కూచిభట్ల:** వ్యక్తినామం శా శ. 1308 నాటి సింహాచల శాసనంలో ఒక కూచిభట్టు ప్రస్తావన వుంది కూచి · చూడు. ఎలకూచి

**కూచిమంచి - కూసుమంచి :** గ్రామనామం. కూచిమంచి తిమ్మన నీలాసుందరీ పరిణయ కర్త

**కూనపరెడ్డి :** కూన అంటే చిన్న పోల్చిచూడు పిల్లికూన కూన కున్న, గున్నగా పరిణమించింది ఏనుగుగున్న. శా శ 1334 నాటి సర్పవరం శాసనంలో ఒక కూనపరెడ్డి సింగరి ప్రస్తావన కలదు.

**కూనపులి - కూనుపిల్లి :** వ్యక్తి నామం. అయితే దీనికి ఆకారం గ్రామనామం శా శ 1338 నాటి పొన్నూరు శాసనంలో ఒక కూనపులి అనపోతానాయని ప్రస్తావన వుంది శాశ. 1288 నాటి సింహాచల శాసనాలో ఒక కూనుపిల్లి ప్రస్తావన ఉంది 1300 నాటిశాసనంలో కూడా ఒక పిలుక కూనపిల్లి ప్రస్తావనవుంది

**కూరపాటి :** ఈ పేరుగల గ్రామాలు గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలో వున్నాయి

**కూరాడ :** కృష్ణాజల్లా గుడివాడ తాలూకాగ్రామం.

**కూర్మనీడి :** వ్యక్తినామం. విష్ణువు అవతారాల్లో ఒకటి కాగా శ్రీకూర్మం ప్రసిద్ధ వైష్ణవక్షేత్రం దానిపై నీడి చేరింది

**కూలి :** రాయఘధ ఏజెన్సీ గ్రామం.

**కూళ్ల :** కూళ్లు సేలంజిల్లా హోసూరు తాలూకాలో వుంది

**కృత్తివెంటి :** కృత్తివెన్నుకు ఔప విభక్తిక రూపం బందరు తాలూకా గ్రామం.

**కృష్ణదాసి :** వ్యక్తినామం కృష్ణసేవకుడు శ్రీకూర్మ శాసనాల్లో కాశ్యపగోత్రుడైన ఒక శ్రీకృష్ణదాసి తిరువెంగళదాసి ప్రస్తావన వుంది.

**కెమిదేవుని :** శా శ 1389 నాటి ఆలంపురం శాసనంలో కెమిదేవుని వీరయ్య ప్రస్తావన వుంది కెమిదేవుడు వ్యక్తినామం కెమ్ అంటే కన్నడంలో ఎరుపు అనిఅర్థం.

**కేతినీడి** వ్యక్తినామం కేతువు ఒకగ్రహంగా తెలిసిందే ప్రధానంగా శైవుల్లో ఇది వ్యక్తినామంగా కన్పిస్తుంది శ్రేష్ఠుడు అనే అర్థంకూడా వుంది. నీడు నేడు అనేవి నాయడు శబ్దంనుండి ఏర్పడ్డాయి

**కేదారి - కేదార :** టెక్కలి తాలూకాగ్రామం కేదారం ఒక క్షేత్రము. కాగా మాగాణి అని కూడా అర్థం.

**కేశవపంతులు :** కేశవ విష్ణు సంబంధ నామం పంతుల, పంత్ అనే మహారాష్ట్ర శబ్దంపై బహువచనం. పంత్ శబ్దానికి మేలిమి, ఒప్పయినది అనేవి అర్థాలు. దీనికి సమీప మాతృక సంస్కృతంలోని 'పన్' శబ్దం. మహారాష్ట్రంలో రాజోద్యోగులకు (బ్రాహ్మణులకు) బిరుదు నామంగా చెల్లి వచ్చింది. తెలుగులో ఉపాధ్యాయులను పంతులుగా సంభావించడం కద్దు కేశవపంత్ అనే వ్యక్తి ప్రసిద్ధుడు కావడం వలన, అనంతరం ఆ కుటుంబీకులకు ఆయన పేరే గృహనామంగా ప్రవర్తిల్లినది.

**కేశవభట్ల :** వ్యక్తినామం. కేశవుడు విష్ణువు. కేశవ శబ్దంపై భట్ల చేరింది. భట్టుపై బహువచనం భట్ల శా శ 1498 గుంటూరు తాలూకా కొండెపాడు శాసనంలో కేశవభట్లరాఘవయ్య ప్రస్తావన వుంది.

**కేసాని :** వ్యక్తినామం. కేశవ సాహిణి, కేసానిగా పరిణమించింది

**కైకరం :** పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు తాలూకా గ్రామం.

**కొక్కిలిగడ్డ :** కృష్ణాజిల్లా దివితాలూకా గ్రామం.

**కొక్కు :** కొక్కు వారిపల్లె చంద్రగిరి తాలూకాలో వుంది. గ్రామనామం.

**కొక్కొండ :** గ్రామనామం. దీని ఔపవిభక్తిరూపంలో కొక్కంటి అనే గ్రామం కదిరి తాలూకాలో వుంది. కొక్కొండ వెంకటరత్నం పంతులు సాహితీలోకానికి పరిచితులు.

**కొంక :** కొంకా చెన్నయ్య గుంట చంద్రగిరి తాలూకాలో వుంది గ్రామనామ ప్రథమావయవం చూడు కొంకేపూడి .

**కొంకేపూడి :** కృష్ణాజిల్లా బందరు తాలూకాగ్రామం

**కొంగ, కొంగారుగుడ :** జయపురం ఏజెన్సీగ్రామాలు

**కొంగర :** నవరంగపురం ఏజెన్సీలో ఈ పేరుతో రెండు గ్రామాలున్నాయి కొంగర వారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది. సినీనటులు జగ్గయ్యగారి గృహనామం.

**కొంగల :** కొంగాల నూగూరు తాలాకాగ్రామం కొంగలవీడు అనే గ్రామం కడప జిల్లా బద్వేలు తాలూకాలో వుంది.

**కొచ్చెర్ల :** చీపురుపల్లె, వినుకొండ తాలూకాలలో ఈ పేరుతో గ్రామాలున్నాయి.

**కొచ్చెర్లకోట :** ప్రకాశంజిల్లా దరిశితాలూకా గ్రామం.

**కొంచ :** పాలకొండ తాలూకాగ్రామం

**కొటికలపూడి :** కృష్ణాజిల్లా బెజవాడ ప్రకాశంజిల్లా దరిశి తాలూకాల్లో ఈ పేరుతో గ్రామాలున్నాయి.

**కొట్టారు (రి) - కొరారి :** అధికార శ్రేణిలో ఒకపదవి. శా శ. 1219 నాటి శాసనంలో ఒక కొట్టారి కేశవదాసు పేర్కొనబడ్డాడు కవిత్రయంలోని తిక్కన ఇంటిపేరు కొట్టరువు అని తలచబడింది. నేటి వ్యవహారంలో కొరారు, కొరారిగా కన్పిస్తోంది.

**కొట్టాల :** నంద్యాల తాలూకాగ్రామం.

**కొట్టిశ (స ):** రాజాం తాలూకాగ్రామం.

**కొట్టు :** పార్వతీపురం తాలూకాగ్రామం

**కొట్రా :** గ్రామనామ పూర్వపదం గావచ్చును కుట్రవాడ గ్రామంచోడవం తాలూకాలోవుంది

**కొడమంచిలి :** నరసాపురం తాలూకాగ్రామం శా శ 1222 నాటి పాలకొల్లు శాసనంలో కొడమంచిలి కేతనప్రస్తావన వుంది నరసాపురం తాలూకాగ్రామం

**కొడవటిగంటి :** కొడవటి కల్లు అనేగ్రామం కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలో వుంది. ప్రసిద్ధరచయిత కుటుంబరావుగారి ఇంటిపేరు

**కొడవలి :** గంజాజిల్లా గ్రామనామం ఇది ఒక గడ్డిమొక్క అసలు పేరు కొడవలి కొడవలి కోసే సాధనం కూడా భాషలో ఇలాంటి విశేషాలు చాలా వున్నాయి కొడవలి వారి పాలెం అనే గ్రామం గుంటూరుజిల్లా బాపట్ల తాలూకాలో వుంది.

**కొడాలి :** కొడాలి అనేగ్రామం కృష్ణాజిల్లా దివి తాలూకాలో వుంది కొడాలి రాజారావు ప్రముఖులు.

**కొణకంచి :** కృష్ణాజిల్లా నందిగామ తాలూకాగ్రామం. శాసనంలో కొండకంచి

**కొణతం - కొణతాల : కొంతాల :** కొణతం ఆయుధ విశేషం శా శ1213 నాటి త్రిపురాంతక శాసనాల్లో ఒక కొంతాలనాగినాయకుని ప్రస్తావన వుంది ఇతరు రేచెర్ల కులోత్తమునిగా, మహా మండలేశ్వరునిగా, సకలసేనాధిపునిగా చెప్పబడ్డాడు

**కొణికి :** గుడివాడ, ఒంగోలు తాలూకాలలో ఈ పేరుతో గ్రామాలున్నాయి. శా శ 1559 నాటి వెల్లూరు తాలూకా పల్లకొండ శాసనంలో ఒక కొణికి రామలింగం ప్రస్తావన వుంది

**కొణిజేటి :** కొణిజేడుపై ఔపవిభక్తిక రూపం ప్రకాశంజిల్లా గ్రామం కాంగ్రెసు నాయకులు రోశయ్యగారి గృహనామం ఇదే.

**కొణిదెన :** గుంటూరుజిల్లా నరసరావుపేట తాలూకాగ్రామం శాసనాల్లో కొణ్యదొనగా ప్రస్తావితము

**కొండపనేని :** కొండప నాయక శబ్దం నుండి ఉత్పన్నమైనది శా శ 1060నాటి సత్తెనపల్లి శాసనంలో ఒక కొండప నాయకుడు ప్రస్తావింపబడ్డాడు ఇది వ్యక్తి నామం కావచ్చును లేదా కొండపిగ్రామ నాయకుడు అనే భావనలో వచ్చియుండవచ్చును.

**కొండపి - కొండేపి :** ప్రకాశంజిల్లా కందుకూరు తాలూకాగ్రామం

**కొండబోయిన :** వ్యక్తినామం. కొండబోయినపల్లె కనిగిరి తాలూకాలోవుంది

**కొండబోలు - కొండప్రోలు :** ఇది గ్రామనామసంబంధి ఈగ్రామం గుంటూరు జిల్లా వినుకొండతాలూకా లోనిది శా శ 1337 నాటి కొండవీటిశాసనాల్లో కొండప్రోలు సర్విశెట్టి అనేవైశ్యుదు పేర్కొనబడ్డాదు

**కొండమనేని - కొండమ నాయని :** వ్యక్తినామం కొండ శబ్దంపై అమ్మచేరి కొండమ, అప్పచేరి కొండప్ప అయింది ఇలా పురుషుల పేర్లలో అమ్మ చేరడం వుంది. కొండమ నాయకుడు కొండమనేనిగా పరిణమించింది. కొండమనాయని పాలెం ధర్మవరం తాలూకాలో వుంది

**కొండమల్లు :** వైశ్యుల్లో కన్పించేగృహనామం. మల్లికార్జునస్వామికి సంకేతమైన వ్యక్తినామం శా శ 1300నాటి గుంటూరుజిల్లా ఎనుమదల శాసనంలో వైశ్యకులోత్తమునిగా ఒక కొండమల్లు ప్రస్తావనవుంది.

**కొండముది :** గుంటూరుజిల్లా బాపట్ల తాలూకాలో గ్రామం

**కొండవీటి :** కొండవీడుకు ఔపవిభక్తక రూపం రెడ్డిరాజుల రాజధాని. దీనికి కుండిన పురమనే పేరుకూడా వుండేది గోపీనాధపట్నమని కూడా పేరు

**కొండూరు (రి) :** ఈ రెండు విధాల దీనికి వ్యవహారముంది. ఈ పేరుతో చాల గ్రామాలున్నాయి అందువలన వివక్ష అవసరమై వాటిపై ఇతర పదాలు చేశాయి. అలాంటి వాటిల్లో కంరంరాజు కొండూరు గుంటూరు జిల్లాలో గడ్డ మణుగు కొండూరు కృష్ణాజిల్లాలో వున్నాయి.

**కొండేపూడి :** భద్రాచలం తాలూకా గ్రామం

**కొంద్రాజు - కొండరాజు :** వ్యక్తినామం శా శ. 1472 నాటి చిన్న అహోబిలం శాసనంలో మహామండలేశ్వరులైన కొంద్రాజు చిన తిమ్మయ ప్రస్తావన గలదు

**కొత్త - క్రొత్త :** ఈ రెండువిధాలగాను, తమ ఇంటిపేరును వ్యవహారించే కుటుంబాలున్నాయి నిజానికి రెండూ ఒకటే. కొత్త అంటే అందరికీ తెలిసిందే. ఇంకా దీనిని వివరించాలంటే సంస్కృత శబ్దంలో నవీనము, నూతనము అనిచెప్పాలి. కాని, ఇంటిపేరు విషయంగా ఈ అర్థం చెల్లిరాదు అయితే ఆ కుటుంబాలవారు, మరో గ్రామానికి కొత్తగావచ్చినపుడు వారు కొత్తగా వచ్చిన వారు గనుక, వారిని అలా పిలవడం వలన, వారి ఇంటిపేరు కొత్త కావచ్చు గదా అనవచ్చును అలా అయ్యే అవకాశం లేకపోలేదు. అయితే కొత్త శబ్దం మరో అర్థంలో వ్యవహారంలో వున్నపుడు దీనిని ఆటంకపరుస్తుంది ఆ శబ్దార్థం ఒక విధమైన ప్రాకే మొక్కను సూచిస్తుంది కొత్తలం అనే గ్రామం అనంతపురం జిల్లా మడకశిర తాలూకాలో వుంది అలం అనేమాట ప్రాకే మొక్కను సూచిస్తుంది ఈ విధమైన అభిప్రాయానికి రావడానికి కారణం కోట (Fort) ఏదీ లేనిచోట కొత్తకోట అనేగ్రామం ఉండడం కనుక ఈరెండు అర్థాల్లోను దీనిని సంయోజింపవచ్చును. కొత్తవారిపల్లె మదనపల్లి తాలూకాలోవుంది కొత్త సచ్చిదానందమూర్తి ప్రముఖ తత్వవేత్త

**కొత్తపల్లి :** గ్రామనామం. శా శ. 1496 నాటి తెనాలి తాలూకా శేకూరు శాసనంలో భరద్వాజగోత్ర అపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయ క్రొత్తపల్లి ఓబుళయ్య ప్రస్తావన వుంది.

**కొప్పర :** పాలకొండ తాలూకాగ్రామం

**కొప్పర్తి :** కొప్పర్రు గ్రామనామంపై ఔపవిభక్తిక రూపం. కొప్పర్తి వారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది

**కొప్పాక :** విశాఖజిల్లా అనకాపల్లి తాలూకాగ్రామం

**కొప్పురావూరి :** కొప్పురావూరు అనే గ్రామం గుంటూరుజిల్లా పెదకాకాని సమీపంలో ఉంది చినరావూరు, పెదరావూరు అనేగ్రామాలు తెనాలి తాలూకాలో వున్నాయి

**కొప్పుల :** ఉత్తరాంధ్రలో కొప్పుల వెలమ అనే ఒక వర్గం జనులున్నారు కొప్పుల ఒక గ్రామం కూడా. శా.శ. 1282 సింహాచలం శాసనాలలో ఒక కొప్పుల కాపయ నాయకుని ప్రస్తావన వుంది 1222 నాటి పాలకొల్లుశాసనంలో ఒక కొప్పుల ప్రొలెబోయని ప్రస్తావనవుంది

**కొప్పేడు :** గ్రామనామం కొప్పేడు ఆచార్యుల ఖండ్రిక పుత్తూరు తాలూకాలో వుంది

**కొమరగిరి:** అమలాపురం తాలూకాగ్రామం కొమర, గిరి అనేరెండుపదాల కలయిక వలన ఏర్పడింది. కొమర శబ్దం కుమార శబ్దంనుండి వచ్చింది అయితే గిరి వుండడం వలన అక్కడ కొండ వుందనుకుంటే పొరపాటు అవుతుంది ఇది కొండవీడు నేలిన కుమారగిరిరెడ్డి పేరుమీదుగ వచ్చిన గ్రామం ఆయన బావమరిది కాటయవేమారెడ్డి నిర్మించాడు కుమారగిరికి ఆపేరు పెట్టడానికి కారణమైనది త్రిపురాంతకం త్రిపురాంతకానికి కుమారగిరి అనే వ్యవహారముంది. కొమగిరి కృష్ణమోహనరావు ప్రముఖులు

**కొమరం :** గ్రామనామం. కొమరం భీము తెలంగాణ ఉద్యమంలో అమరుడైన వ్యక్తి

**కొంపల్లె :** గ్రామనామం కొంపల్లె రాఘవయ్య ఖండ్రిక కాళహస్తి తాలూకాలో వుంది.

**కొమ్మన :** వ్యక్తినామం. కొమ్మనవారి పల్లె రాజంపేట తాలూకాగ్రామం.

**కొమ్మనమంచి :** గ్రామనామం. శా శ. 1170 కొడిదెన శాసనంలో ఒక సత్తెనపల్లి కొమ్మనమంచి ప్రస్తావన వుంది

**కొమ్మనాపల్లి :** శ్రీకాకుళ తాలూకాగ్రామం.

**కొమ్మర - కొమిర :** గ్రామనామం కొమ్మర కామవరపుకోట తాలూకాలో వుంది కాగా కొమిర పేరుతో కూడా గ్రామాలున్నాయి.

**కొమ్మి :** నెల్లూరుజిల్లా కావలి తాలూకాగ్రామం

**కొమ్మరాజు :** వ్యక్తినామం. కొమ్మశబ్దం ప్రధానుడు, ముఖ్యుడు, భర్త అనే అర్థాల్లో ప్రయుక్తము శా.శ 1168 నాటి గుంటూరుజిల్లా పొత్తూరు శాసనాల్లో మండలేశ్వరుడైన పరిచ్ఛేద కొమ్మరాజు ప్రస్తావన వుంది. చూడు. కొమ్మిరెడ్డి.

**కొమ్మిరెడ్డి - కొమ్మూరెడ్డి - కొమ్మినేని :** ఇది వ్యక్తినామం ఇందలి కొమ్మశబ్దం, వృక్షశాఖాసంబంధికాదు కొమ్మ శ్రేష్ఠము,ప్రధానము, ఉన్నతము అనే అర్థాల్లో కూడ సంయోజింపబడింది స్త్రీలు తమ భర్తలను ఉద్దేశించి, వారిపేరు ఉచ్చరించడం దోషమనే ఉద్దేశంతో కొమ్మారాయుడు అని చెప్పడం వ్యవహారంలో వుంది. వ్యక్తినామాల్లో శ్రేష్ఠ, ప్రధానము అనే భావన చోటు చేసికుంది దానిపై రెడ్డి, నాయుడు అనే పదాలు చేరి పై వ్యక్తినామాలు సిద్ధించి, వారు ఆ కుటుంబాలలో ప్రధానులు కావడం వలన అనంతరకాలంలో ఆ కుటుంబాలకు గృహనామాలుగా స్థిరపడ్డాయి గుంటూరుజిల్లా మందపాడు శాసనాల్లో ఒక కొమ్మిరెడ్డి ప్రస్తావన వుంది

**కొరటాల :** కొరిటెపాడు అనే గ్రామం ప్రస్తుతం గుంటూరులో భాగమైనది కొరటాల ఒక రకం గడ్డి కొరటాల సత్యనారాయణ కమ్యూనిష్టు నాయకులు

**కొరవి - కొరివి :** వరంగల్లు జిల్లా గ్రామనామం కొరివి వారిపల్లె చిత్తూరుజిల్లా గ్రామం.

**కొలిమెర్ల :** కృష్ణా, నెల్లూరు జిల్లాల్లో ఈ పేరుతో గ్రామాలున్నాయి

**కొర్రపాటి :** ఇది కొర్రపాడుకు ఔపవిభక్తిక రూపం. కొర్రపాడు అనే గ్రామం అనంతపురం జిల్లాలో వుంది. కొర్రలు ధాన్యవిశేషంగా తెలిసిందే కొర్లపాడు అనే గ్రామం కూడా వుంది.

**కొల :** శ్రీకాకుళం జిల్లా గ్రామం శా శ 1070 నాటి ముఖలింగం శాసనాలలో అరిరాయభైరవసామంతుడైన ఒక కొల గొంపన ప్రస్తావన వుంది

**కొలని:** ఇది పాలకొలనికి (పాలకొల్లు) సంక్షిప్తరూపం. పాలకొల్లు శాసనంలో ఒక కొలని భీమన ప్రగడ ప్రస్తావన వుంది.

**కొలసాని :** ఇది వ్యక్తినామపరంగా వచ్చింది శాసనాల్లో (శా శ 1337 కొండవీడు) ఒక కొలవేమసాని పేర్కొనబడడం జరిగింది

**కొల్ని - కొలని :** గ్రామనామం. శా శ. 1386 నాటి శాయింపేట శాసనంలో హరితగోత్ర కొల్ని కృష్ణయ్య ప్రస్తావన వుంది.

**కొల్లా :** కొల్లపేరుతో రెండుగ్రామాలు గంజాజిల్లాలో వున్నాయి. వ్యవహారంలో దీర్ఘం వచ్చింది కొల్లా వెంకయ్య పార్లమెంటు మెంబరుగా పనిచేశారు.

**కొల్లి :** కొల్లి ఒక చెట్టు. కాగా కొలనుకూడ కొల్లిగా పరిణమించింది. శిఖాకోల్ శిఖాకొల్లి అయింది. కొల్లివారి గూడెం కామవరపుకోట తాలూకాలో వుంది. కొల్లి పూర్వపదంగా గంజాం జిల్లాలో చాలా గ్రామాలున్నాయి. కాగా సేలం జిల్లాలో కొల్లికొండలు వున్నాయి.

**కొల్లిపర :** తెనాలి తాలూకాలో వుంది. కొల్లిపర వెంకట రమణయ్య నాయుడు పార్లమెంటు మెంబరుగా పనిచేశారు.

**కొవ్వలి :** పశ్చిమ గోదావరి జిల్లా గ్రామం. కొవ్వలి వారి నవలలు బాగా ప్రసిద్ధమైనవి.

**కొవ్వాడ :** విశాఖజిల్లా భీముని పట్నం తాలూకాగ్రామం.

**కోసన(నా)**: ఇదివ్యక్తినామం శా క. 1090నాటి ద్రాక్షారామ శాసనంలో కోనభీమరాజు బంటు అయిన ఒకకొసనయ్య పేర్కొనబడ్డాడు

**కోసరాజు** : ఇదివ్యక్తి నామం కోశసంబంధిగా భావింపబడుతోంది

**కోకా** : కోకా నారాయణపాలెం బందరు తాలూకాగ్రామం పోల్చిచూడు కొక్కంటి, కొక్కు గ్రామ నామాలు

**కోగంటి** : కోగల్లు గ్రామనామపు ఔపవిభక్తికరూపం. గుంటూరుజిల్లా గ్రామం

**కోట**: కోటవెంకట్రామరాజుపురం రాజంపేట తాలూకాగ్రామం కోట పేరుతో నెల్లూరు జిల్లాలో గ్రామం వుంది కాగా ధరణికోటకు కోట సంక్షిప్తరూపం. కోట శ్రీనివాసరావు సినీనటులు

**కోటగిరి**: గ్రామనామం నిజామాబాదు జిల్లా గ్రామం కోటగిరి విద్యాధరరావు మంత్రి

**కోటపాటి** : కోటపాడు పై ఔపవిభక్తిక రూపం ప్రకాశంజిల్లాగ్రామం శాశ 1551 నాటి ధర్మవరం తాలూకా చిన్నకోట్లశాసనంలో ఒక కోటపాటి లింగన ప్రస్తావన వుంది

**కోట్ల**: పెద్దకోట్ల, చిన్నకోట్ల అనే రెండు గ్రామాలు అనంతపురంజిల్లా ధర్మవరం తాలూకాలో వున్నాయి కోట్ల విజయభాస్కరరెడ్డిగారు ప్రసిద్ధ కాంగ్రెసునాయకులు ముఖ్యమంత్రిగా పనిచేశారు.

**కోడుమూరు** : కర్నూలుజిల్లా గ్రామం. దామోదరం సంజీవయ్యగారి స్వగ్రామం

**కోదాటి**: కోదాడు కోదాటి నారాయణరావు ప్రముఖులు నల్గొండ జిల్లా గ్రామం

**కోన**: ఈ పేరుతో సాలూరు తాలూకాలో, పార్వతీపురం ఏజెన్సీలో, బాపట్ల తాలూకాలో గ్రామాలున్నాయి కొండ, కోనలలోని కోన తెలిసిందే ఇది కోణ శబ్దసంబంధి రెండు కొండల మధ్య గల ఖాళీ ప్రదేశము అయితే లోయకాదు లోయ వున్నచోట రెండు కొండల మధ్య ఎడముంటుంది కోనలో లోతట్టుగా కలసి వుంటాయి అక్కడ పుట్టిన ఏరే నిజానికి కోనేరు కాగా కోనంకి మొదలైన వాటిలో నిది ఒక రకం గడ్డి ఈ గృహనామం గ్రామ నామంగా ఏర్పడింది తలకోన, పల్లెకోన అనే గ్రామాలున్నాయి తూర్పుగోదావరి జిల్లా కోనసీమ శాసనాల్లో కోనగా సంభావింపబడింది కోన ప్రభాకరరావు గవర్నరుగా పనిచేశారు

**కోనంకి** : నరసరావుపేట తాలూకాలో ఒకటి పల్నాడు తాలూకాలో మరొకటి ఈ పేరుతో గ్రామాలున్నాయి

**కోనయ్యగారి** : వ్యక్తినామ పూర్వక గౌరవసూచక ఔపవిభక్తిక రూపం కోనయ్యగారి వెంకట్రాముని ఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది ఇందలి కోన కృష్ణుని సూచిస్తుంది కోణంగి అంటే కృష్ణుడు కోణ అంటే వేణువు.

**కోనాడ** : విశాఖజిల్లా భీమునిపట్నం తాలూకాగ్రామం.

**కోనూరి** : కోనూరుకు ఔపవిభక్తిక రూపం ఇది గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలో వుంది

**కోనేరు** : గంజాం జిల్లా గ్రామం. కోనేరు రామకృష్ణారావు ఆంధ్ర విశ్వవిద్యాలయ ఆచార్యులుగా పనిచేశారు

**కోపల్లె :** ఈ పేరుతో రెండుగ్రామాలున్నాయి అందు ఒకటి గుంటూరుజిల్లా తెనాలి తాలూకాలోను, రెండవది పశ్చిమగోదావరి జిల్లా భీమవరం తాలూకాలోను వున్నాయి. కోపల్లె హనుమంతరావు గారు ఆంధ్రదేశానికి చిరపరిచితులు

**కోమటినేని :** వ్యక్తినామం కోమటి అంటే వైశ్యుడనేది సామాన్యార్థం ఇది గోమర శబ్దభవమని చెపుతారు అయినపుడు ఇది జైనమత సంప్రదాయం నుండి వచ్చినదవుతుంది రెడ్డిప్రభువుల్లో పెదకోమటి వేమారెడ్డి ఒకరు

**కోరాడ :** విశాఖజిల్లా భీముని పట్నం తాలూకాగ్రామం కోరాడ నరసింహారావు ప్రసిద్ధ నర్తకులు కోరాడ రామకృష్ణయ్య ప్రసిద్ధభాషావేత్త

**కోలవెన్ను - కోలవెంటి :** కృష్ణాజిల్లా బెజవాడ తాలూకాగ్రామం కోలవెన్ను రామకోటేశ్వరరావు ప్రసిద్ధులు

**కౌతా - కవుతా :** గ్రామనామ ప్రథమ పదం పోల్చిచూడు కౌతాళం కవుతరం

**క్రాప :** అమలాపురం, తెనాలి తాలూకాల్లో ఈ పేరుతో గ్రామాలున్నాయి

**క్రొవ్విడి - కొవ్విడి :** రెండు విధాలుగాను గృహనామంలో వ్యవహారం ఉంది ఈ పేరు గల గ్రామం పశ్చిమగోదావరి జిల్లా భీమవరం తాలూకాలో వుంది ఈ గృహనామంతో బాగా పరిచయస్థులు లింగరాజుగారు

**ఖండవిల్లి :** ఈ గ్రామం పశ్చిమగోదావరిజిల్లా తణుకుతాలూకాలో ఉంది ఖండవిల్లి లక్ష్మీరంజనం గారు సాహితీ లోకానికి పరిచితులు.

**ఖండ్రిక :** భూమిలో కొంత భాగం ఖండ శబ్ద భవం గ్రామంలోని కొంత భూభాగాన్ని ప్రభువులు తమకు సేవలు చేసేవారికి దానమిచ్చినపుడు, దానగ్రహీతల పేరుతో ఈ ఖండ్రిక లను వ్యవహరించారు చిత్తూరు జిల్లాలో ఇలాంటివి చాల అధికం కాగా ఖండ్రిక పేరుతో స్వతంత్రగ్రామాలు ఉన్నాయి అలా అది గృహనామమైంది

**గంగసాని :** గంగయసాహిణి అనేది వ్యక్తినామం కాకతీయసేనాని, పానగల్లు, మార్జవాడలకు ప్రభువైన గంగయ్యసాహిణి ప్రస్తావన శా శ 1173 నాటి దుర్గిశాసనాల్లో వుంది

**గంగాధర :** శా శ 1312 నాటి సింహాచలం శాసనంలో ఒక గంగాధర తమ్మయ ప్రస్తావన కలదు ఈ పేరుతో గ్రామం వుంది గంగాధర నెల్లూరు అనే గ్రామం కూడావుంది.

**గంగినేని :** వ్యక్తినామం. గంగశబ్దం గంగిగా పరిణమించింది.గంగినేని అనేగ్రామం మధిరదగ్గరవుంది.

**గంగిరెడ్డి :** వ్యక్తినామం. గంగిరెడ్డిపల్లె మదనపల్లి తాలూకాలో వుంది.

**గంగు :** వ్యక్తినామం గంగువారి సిగడాం చీపురుపల్లి తాలూకాగ్రామం.

**గంగుల:** గంగశబ్దంపై బహువచనం. వేల్పూరు శాసనాల్లో (శా.శ 1162) ఒక గంగుల పోత బోయుడు పేర్కొనబడ్డాడు. గంగులవారి అయ్యవారిపల్లె ఉదయగిరి తాలూకాలో వుంది

**గంజి:** ఉడికిన అన్నంలోని ద్రవపదార్థాన్ని గంజి అనడం తెలిసిందే. అయితే ఇంటి పేరుకు దీనికి సంబంధం లేదు. ఇది చెట్టు. గంజికుంట అనేగ్రామం అనంతపురం జిల్లా గుత్తితాలూకాలో వుంది. గంజి రామారావు కమ్యూనిష్టు నాయకులు.

**గంజికుంట :** శా శ 1382 కడపజిల్లా బలమకూరు గ్రామశాసనంలో ఒక గంజికుంట తిప్పజియ్య ప్రస్తావన వుంది.

**గట్టినేని - ఘట్టినేని - ఘట్టమనేని :** వ్యక్తినామం. గట్టి అనే పదం బలిమికి, శక్తికి సంకేతం అయితే గట్టు అంటే కొండ కూడా, ఇక్కడ కూడా అదే అర్థంవర్తిస్తుంది. గట్టప్పనాయనిపల్లె కంగుంది డివిజన్‌లో వుంది. ఘట్టమనేని కృష్ణ ప్రముఖ చలన చిత్రనటులు.

**గడిపూడి :** గ్రామనామం. గడియపూడి ఒంగోలు తాలూకా లోవుంది

**గడియారం :** చూడు ఘటశాసి, ఘడియారం గడియారం వారి ఖండ్రిక కందుకూరు తాలూకాగ్రామం. గడియారం వెంకట శేషశాస్త్రి కవి.

**గడ్డం:** గడ్డంవారిపల్లె చంద్రగిరి తాలూకాలో వుంది. బహుశా ఇది గడ్డ శబ్దం కావచ్చును శా శ 1565 నాటి కోయిల కుంట్ల శాసనంలో గడ్డం అమిలిరెడ్డి ప్రస్తావనవుంది.

**గణపనేని :** వ్యక్తినామం. గణపతి శబ్దభవం గణయ్యగా కూడ వ్యక్తినామముంది.

**గణపవరపు : గణపారపు - గణపారం :** గణపవరము పై ఔపవిభక్తికరూపం. తీరాంధ్రంలో చాల గణపవరాలున్నాయి ఇందులో కొన్ని కాకతి గణపతి దేవుని పేరు మీదుగా, మరికొన్ని కోట గణపతి పేరుమీదుగా మరికొన్ని చాళుక్య గణపతిపేరుమీదుగా వచ్చాయి గణపారం అనే గ్రామం భద్రాచలం తాలూకాలో వుంది గణపవరం పేరుతో నరసరావుపేట తాలూకాలో, తూర్పు పశ్చిమగోదావరి జిల్లాల్లో వున్నాయి.

**గణపా :** గణపయ్యకు సంక్షిప్తరూపం గణపావారి గూడెం కామవరపుకోట తాలూకాలో వుంది

**గణేశుని :** గణేశుని పల్లె పేరుతో రెండుగ్రామాలు కనిగిరి తాలూకాలో వున్నాయి

**గంట :** గంటావాండ్ల పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది వాద్య విశేషంగా తెలిసిందే అయితే ఇది గంటి గ్రామనామం నుండి వచ్చియుండవచ్చును

**గంటి :** తూర్పుగోదావరి జిల్లా రాజోలు తాలూకాగ్రామం శా శ.1420 నాటి ప్రొద్దుటూరు శాసనాల్లో ఒక గంటి కన్నమనాయని ప్రస్తావన వుంది

**గండు :** గండ శబ్దం నుండి వ్యుత్పన్నము. గండ, శక్తి సామర్థ్యాలకు సంకేతం. బాలచంద్రుని భార్య గండు వారి ఆడపడుచు.

**గండుబోయన:** వ్యక్తినామం గండుబోయన పల్లె వాయల్పాడు తాలూకాలో వుంది

**గద్దె :** గ్రామనామ ప్రథమావయనసూచి గద్దెకెరె అనేగ్రామం బళ్లారిజిల్లా హడగల్లు తాలూకాలో వుంది గద్దెరామమోహనరావు రాజకీయ నాయకులు.

**గంధం :** పరిమళ ద్రవ్యంగా తెలిసిందే చందనాన్ని అరగదీస్తే వచ్చిన దానిని గంధ మంటారు నిజానికి గంధము అంటే వాసన దానికి మంచి చేర్చి చందనానికి సంకేతంగా ఉపయోగిస్తున్నాము. ఇది ఇలా వుండగా, దీనిని అరగదీస్తే వచ్చిన దానిని గంధమనడం కూడా ఉంది. అంటే గుణ ప్రాధాన్యంపోయి, రూపసామ్యంతో అలా వ్యవహరిస్తున్నాము భాషలో ఇలాంటివి చాల వుంటాయి అయితే ఇంటి పేరైన 'గంధ' శబ్దానికి, సువాసన ద్రవ్యానికి ఏమీ సంబంధం లేదు ఇది ఒక ఊరిపేరు శ్రీకాకుళం జిల్లాలో పెద్ద గంధం, చిన్నగంధం అనే రెండు గ్రామాలున్నాయి. ఇక్కడ గంధం అంటే ఒక రకం గడ్డి సువాసనతో కూడి వుంటుంది మరొకరకం తీగె మొక్క కూడా వుంది అ ఊరి నుంచి వచ్చినవారు గంధం వారైనారు వీరగంధం కూడా ఇలాంటిదే గంధం అప్పారావు ప్రముఖులు

**గంధమునేని :** వ్యక్తినామం ఇచ్చటి గంధము చందన సంబంధికాదు గంధం అనేది గ్రామనామం. చూడు గంధం గ్రామనామంపై నాయకుడు చేరింది

**గంధసిరి :** ఇది ఒక ఊరిపేరు శా శ 1112 విజయవాడ శాసనాల్లో ఒక గంధసిరి బొల్లిరెడ్డి పేర్కొన బడ్డాడు గ్రంధసిరి అని కూడా వ్రాస్తారు

**గన్నవరపు - గన్నవరం :** గన్నవరం పేరుతో కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాల్లో గ్రామాలున్నాయి. గన్నవరం ఔపవిభక్తికరూపంలో గన్నవరపు అయింది. గన్నవరపు సుబ్బరామయ్య సాహితీలోకానికి పరిచితులు.

**గన్నె :** గన్నయ అనేది వ్యక్తినామం గన్నెగా పరిణమించింది శా శ. 1216నాటి మక్తల (మహబూబ్‌నగర్ జిల్లా) శాసనంలో గన్నెనాయక పల్లి గ్రామ ప్రస్తావన వుంది ఇది గణ్య శబ్దం కావచ్చు గణహ అంటే శివుడు

**గన్నే :** గ్రామనామ పూర్వపదం గన్నేపల్లి అనే గ్రామం కంభం తాలూకాలో వుంది

**గంప :** శా శ 1213 నాటి బాపట్లశాసనంలో ఒకగంప మరెబోయుని ప్రస్తావన వుంది గంప అనే గ్రామం గొలుగొండ ఏజన్సీలో వుంది

**గంభీరం :** విశాఖజిల్లా భీమునిపట్నం తాలూకాగ్రామం.

**గరివిడి :** చీపురుపల్లె తాలూకాగ్రామం.

**గాడేపల్లి :** గ్రామనామం గాడేపల్లి వారి ఖండ్రిక కందుకూరు తాలూకాగ్రామం. గాడేపల్లి హరిసర్వోత్తమరావు గ్రంథాలయోద్యమ కర్త

**గాండ్ల :** గ్రామనామ ప్రథమావయవం గాండ్లపెంట అనేగ్రామం కదిరి తాలూకాలో వుంది పెంట అంటే పశువులను మందవేసే స్థలం గాండ్ల అనేది చెట్టుపేరు గాండ్లవారిపల్లె అనేగ్రామం కూడా అదే తాలూకాలో వుంది గాండ్లపల్లె సేలం జిల్లా హోసూరు తాలూకాలో వుంది

**గాదె:** శాసనాల్లో ఇది గాధెగా కూడ వ్రాయబడింది గాదెలవర్రు పేరుతో గ్రామాలున్నాయి గాదెలలంక, గాదికమరా, గాదిరాయి, గాదంపాలెం, గాదెలవలస, అనే గ్రామాలుకూడా వున్నాయి. ఆ గ్రామనామాల్లోని ప్రధమ పదం గృహనామంగా వర్తించింది. ద్రాక్షరామ శాసనాల్లో గాదె శ్రీరామ మంత్రి ప్రస్తావన వుంది గాదె వెంకటరెడ్డి కాంగ్రెస్ నాయకులు.

**గారపాటి - గార్ల - గారపాడు:** గార్లపాడు పేరుతో చాలాగ్రామాలు ఉన్నాయి ఒక గారపాడు గుంటూరుజిల్లాలో వుంది. గార్ల అనే గ్రామం ఖమ్మంజిల్లాలో వుంది. గార్ల ఒక చెట్టు

**గాలి:** పంచభూతాల్లో ఒకటైన వాయువును, గాలితో సంకేతిస్తాము అయితే గృహనామ విషయంలో దీనికి ప్రసక్తిలేదు. ఇది ఒక చెట్టు గాలికొండ అరకువెళ్లే త్రోవలోవుంది గాలి చెట్లుగల కొండ గనుక అది గాలికొండ అలాగే గాలేరు అనేది కూడ తెలిసిందే. ఈదగాలి అనేగ్రామం నెల్లూరుజిల్లాలో వుంది. గాలివారిపల్లె చిత్తూరుజిల్లా వాయల్పాడు తాలూకాలోవుంది గాలి ముద్దుకృష్ణమ నాయడు ప్రముఖులు.

**గాలిపెంచల:** గ్రామనామం గాలిపెంచల నరసింహారావు ప్రముఖులు.

**గింజుపల్లి:** ఈ గ్రామం గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలో వుంది

**గిడుతూరు (రి):** గొలుగొండ తాలూకాగ్రామం గిడుతూరి సూర్యం ప్రముఖులు.

**గుగ్గిళ్ల:** ఉడికించిన చిరుధాన్యం గుగ్గిళ్లు (పెసలు, సెనగలు, కందులు వగైరాలు), అయితే గుగ్గిలం ధూపంవేసే పదార్థం గ్రామనామం కూడా శా శ 1386 నాటి శాయింపేట శాసనంలో హరితగోత్ర గుగ్గిళ్ల అనంతవర్ముల ప్రస్తావన వుంది గుగ్గిల శ్రీకాకుళం తాలూకాగ్రామం.

**గుజ్జుల:** గుజ్జర్లపూడి అనే గ్రామ ప్రధమావయం

**గుజ్జలి:** చీపురుపల్లి తాలూకాగ్రామం

**గుడిముందలి:** ప్రదేశసూచి గుడిముందరి కొత్తూరు అనేగ్రామముంది గుడిమోర బాగలు అనే గ్రామం కూడా వుంది గుడిముందరి వాకిలి అని అర్థం గుడిచెంపగిరి అనేగ్రామం కంగుంది డివిజన్‌లో వుంది

**గుడివాడ:** ఈ పేరుతో కృష్ణా, గుంటూరు, విశాఖజిల్లా గ్రామాలున్నాయి

**గుడిశ - గుడిశల:** చిన్నది, గుండ్రనిది అయిన పాకను గుడిసె అనడం తెలిసిందే అయితే ఈ పేరుతో ఒకగ్రామం తూర్పుగోదావరిజిల్లా చోడవరం తాలూకాలో వుంది ఈ ఇంటి పేరుతో ప్రసిద్ధులు వెంకటస్వామి కాంగ్రెసు నాయకులు.

**గుండవరము (పు)** గ్రామనామం.

**గుండపోలు:** రాపూరు తాలూకాగ్రామం

**గుండాల:** భద్రాచలం తాలూకాగ్రామం.

**గుండు:** గుండువారి గూడెం భద్రాచలం తాలూకాగ్రామం గుండు హనుమంతరావు సినిహాస్యనటుడు

**గుత్తి - గుత్తా - గుత్తికొండ :** అనంతపురం జిల్లాలో ఆ పేరుగల తాలూకాకు కేంద్రగామం గుత్తికొండ అనేగ్రామం గుంటూరుజిల్లాలో వుంది అదికూడ గృహనామంగా వుంది గుత్తి వ్యవహారంలో గుత్తా అయింది. గుత్తా రాజారావు ప్రముఖులు.

**గుమ్మడి :** ఇది శాకంగా తెలిసిందే సంస్కృతంలో కూష్మాండం. అయితే గృహనామంగా రావడానికి కారణం ఆ పేరుగల గ్రామాలు. పెద్దగుమ్మడ, చిన్న గుమ్మడ అనేగ్రామాలు గంజాంజిల్లాలో వున్నాయి. గుమ్మండి అనేగ్రామం పొట్టంగి ఏజెన్సీలోవుంది. గుమ్మడి వెంకటేశ్వరరావు సినీనటులు

**గుమ్మలూరు - (రి) :** ఇది ఈ రెండురూపాల్లోను వ్యవహారంలో వుంది. ఇది పశ్చిమగోదావరిజిల్లాలోని గ్రామం. గుమ్మంపై బహువచనం 'లు', ఆపైన ఊరుచేరి ఈ పేరు సిద్ధించింది. బూదిగుమ్మ తాడుగుమ్మి, పాలగుమ్మి మొదలైనవానిలో గల గుమ్మికి ఇదే ఆకరం ఆ మూడూ కూడ గ్రామనామాలే ఇంటిపేర్లు కూడ గుమ్మలక్ష్మీపురం అనేగ్రామంకూడ వుంది గుమ్మ అనేది ఒకజాతి వృక్ష సామాన్యనామం పాలగుమ్మి, తాడుగుమ్మి అనేవి అందులోని భేదాలు. ఇక్కడ ప్రత్యేకంగా చోటుచేసికుంది

**గుమ్మా :** గుమ్మ, గుమ్మ పేరుతో విశాఖ, శ్రీకాకుళం జిల్లాల్లో చాలగ్రామాలున్నాయి

**గురజాడ :** కృష్ణాజిల్లా గన్నవరం తాలూకాగ్రామం కన్యాశుల్క నాటకకర్త గురజాడ అప్పారావు

**గుర్రపుశాల :** మార్కాపురం తాలూకాగ్రామం.

**గుర్రం - గుర్రాల :** గుర్రం కొండమ నాయుడు ఖండ్రిక పుత్తూరు తాలూకాలో వుంది ఇక్కడ గుర్రం జంతు సూచికాదు గుర్రాల అనేది ఒక రకం గడ్డి, గ్రామనామం కూడా. పిడుగురాళ్ల అసలు పేరు పిడ గుర్రాల

**గుర్రం కొండ :** వాయల్పాడు తాలూకాగ్రామం

**గుర్విణేని :** వ్యక్తినామం గురువు శబ్దం గుర్వి అయింది గుర్వి నాయనిపల్లె సేలంజిల్లా కృష్ణగిరితాలూకాలో వుంది గురువు ఉపాధ్యాయుడు కాగా బృహస్పతి, శుక్రులను గురువు శబ్దంతో వ్యవహరిస్తారు.

**గుళ్లపల్లి :** ఈ పేరుతో ప్రకాశంజిల్లా ఒంగోలు సమీపాన ఒకగ్రామం, చిత్తూరుజిల్లాలో ఒక గ్రామం ఉన్నాయి. రెండు చోట్ల దానిపేరు గుండ్లాపల్లి, గుండ్లపల్లె. వ్యవహారంలో గుళ్లపల్లి అయింది. గుంటూరుజిల్లాలో ఈ ఇంటిపేరుగల కుటుంబాలున్నాయి

**గువ్వల :** గ్రామనామపూర్వపదం. గువ్వలవారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది గువ్వలకుంట అనేగ్రామం. నందికొట్కూరు తాలూకాలో వుంది

**గూటాల :** పోలవరం తాలూకాగ్రామం.

**గూడ - గూడా :** గ్రామనామ ప్రథమావయవం. గూడపల్లి, గూడపాడు. గూడావారి ఖండ్రిక చిత్తూరు జిల్లావుంది

**గూడపల్లి :** ఈ పేరుతో కృష్ణాజిల్లా గుంటూరు జిల్లాల్లో గ్రామాలున్నాయి. గూడవల్లి రామబ్రహ్మం సినీదర్శకులు

**గూడూరి :** గూడూరుకు ఔప విభక్తికరూపం కృష్ణా, నెల్లూరు జిల్లాల్లో ఈ పేరుతో గ్రామాలున్నాయి గూడూరి సమశ్శివాయ ప్రముఖులు

**గూడెం :** చీపురుపల్లి తాలూకాగ్రామం

**గెద్ధనాపల్లె :** పెద్దాపురం తాలూకాగ్రామం

**గెల్లి :** గెల్లి అంటే ఉప్పు కుప్ప. శా శ. 1502 నాటి గుంటూరుజిల్లా శాసనాల్లో ఒక గెల్లి ఎల్లిశెట్టి పేర్కొనబడ్డాడు గెల్లి రమేష్ ప్రముఖులు.

**గెదల :** గేదెలు మహిషజాతి పశువులు గేదల నాయుడిపాలెం ఛత్రపూర్ తాలూకాగ్రామం

**గొట్ట :** ఈ పేరుగల గ్రామం గుణుపురం ఏజెన్సీలో వుంది.

**గొట్టిగల్లు - గొట్టిగంటి :** గ్రామనామం. గొట్టిగుంట వారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది

**గొట్టిపాటి - గొట్టుముక్కల :** గొట్టిపాడు గ్రామంపై ఔపవిభక్తిక రూపం. ఈ పేరుతో గుంటూరు నరసరావుపేట తాలూకాలలో గ్రామాలున్నాయి గొట్టిముక్కల అనేగ్రామం పల్నాడు తాలూకాలో వుంది. గొట్టి అనేది ఒక చెట్టు దీని కాయలు గుండ్రంగా వుంటాయి దీనివలననే గోలీకాయలను గొట్టికాయలనడం జరుగుతోంది గొట్టికాయలు తినరాదు ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు గొటిపాటి బ్రహ్మయ్యగారు. గొట్టిపాటివారిపల్లె చంద్రగిరి తాలూకాలో వుంది

**గొట్టుముక్కల :** నందిగామ తాలూకాగ్రామం

**గొడవర్తి :** గొడవర్రు పేరుతో కృష్ణా, గుంటూరుజిల్లాల్లో గ్రామాలున్నాయి ఇది ఔపవిభక్తిక రూపం

**గొడ్ల :** గొడ్లు అంటే మహిషజాతి పశువులు. శా శ 1197 నాటి గుంటూరుజిల్లా ఎనమదల గ్రామశాసనంలో ఆ గ్రామపు బలిజ ఒక గొడ్లనారాయణ దాసు పేర్కొనబడ్డాడు శా శ 1197 నాటి పొన్నూరు శాసనంలో ఎనమదల బలిజులైన గొడ్లగోపాలదాసు, నారాయణ దాసులు ప్రస్తావింపబడ్డారు.

**గొంది :** సందులుగొందులు అనడం తెలిసిందే అయితే గృహనామం దీని సంబంధమైనది కాదు. గొంది అనే గ్రామం పశ్చిమ గోదావరి జిల్లా నరసాపురం తాలూకాలో వుంది ఇతరచోట్ల కూడ వుండవచ్చును.

**గొబ్బూరు - (రి) :** ప్రకాశంజిల్లామార్కాపురం, విశాఖజిల్లా అనకాపల్లి తాలూకాలలో గ్రామాలున్నాయి గొబ్బూరిజగ్గన చారిత్రకవ్యక్తి

**గొర్రెపాటి :** గొర్రెపాడు గ్రామం నరసరావుపేట తాలూకాలో వుంది దాని ఔప విభక్తిక రూపం గొర్రెపాటి కిసాన్, పండిత అనే వివక్షతో ఇద్దరు వెంకట సుబ్బయ్యలు ఈ ఇంటి పేరుతో ప్రసిద్ధులు.

**గొలవాడ :** గ్రామనామం. శా.శ. 1559నాటి పంచదార్ల శాసనంలో ఒకగొలవాడ పోతునట్టువుని ప్రసక్తివుంది

**గొల్ల :** ఒకజాతిజనులు. కాగా ఒకరకం గడ్డికూడా గ్రామంలో ఆ కులంలో పెద్దరికం వహించే వారిని కూడా గొల్ల శబ్దంతో సంభావిస్తారు. అంటే ఆవ్యక్తి గ్రామ మహాజన సభలో, రాజసంబంధమైన కార్యాల్లో పాల్గొనే ప్రముఖుడు. ఈ మేరకు శాసనాల్లో సమాచారముంది. గొల్ల నాగయనహళ్లి అనేగ్రామం బళ్లారి తాలూకాలో వుంది.

**గొల్లగార :** శా.శ. 1350 నాటి సింహాచల శాసనంలో ఒక గొల్లగార నరసబోయని ప్రస్తావన వుంది. గొల్లగారము – గొల్లలపై తీసేపన్ను అని శాసనాలలో చెప్పబడింది. ఇక్కడ అది వసూలు చేసే అధికారి కావచ్చు.

**గొల్లపూడి :** కృష్ణాజిల్లా బెజవాడ తాలూకాగ్రామం. తూర్పుగోదావరి జిల్లాలో వుంది. ఇంకా కూడ వుండవచ్చును. గొల్లపూడి మారుతీరావు ప్రముఖ సినీనటులు – రచయిత.

**గొల్లమందల :** గ్రామనామం. పోల్చిచూడు ఎల్లమంద గొల్లమందలవారి శరభవరం ఎల్లవరం తాలూకాలో వుంది.

**గొల్లాపిన్ని:** గ్రామనామం. ఒకరకం గడ్డి.

**గోకిన :** వ్యక్తినామసూచి గోకినాయని అనేదాని సంక్షిప్తరూపం గోకినేపల్లి అనేగ్రామం కూడా వుంది. వివరాలకు చూడు గోగినేని

**గోకివాడ :** సర్వసిద్ధి తాలూకాగ్రామం.

**గోకుల – గోకులం :** పర్లాకిమిడి తాలూకాగ్రామం. ఆవులమంద అని శబ్దార్థము

**గోగినేని :** గోగినాయకుడు అనేది వ్యక్తినామం గోగి శబ్దం గొంక శబ్దంనుండి ఉత్పన్నమైనది వీరుడు అనే అర్థంలోని గొంగ శబ్దానికి కూడ ఇదేమూలం ఇది శ్రేష్ఠము, బలిష్ఠము అనే అర్థాల్లో సంయోజింప బడింది పంటిపై పన్ను వున్నచో, గొగ్గిపన్నులు (దంతాలు) అనడం తెలిసిందే 11,12 శతాబ్దాల్లో ముఖ్యంగా చోడులలో, కోట కమ్మ పాలకుల్లో ఈ వ్యక్తినామం అధికంగా కన్పిస్తుంది పాలకుల ననుసరించి పాలితులు కూడ ఈ నామాన్ని అధికంగా స్వీకరించారు. శా శ 1062 నాటి గుంటూరుజిల్లా మోపర్రు శాసనాల్లో గోకి నాయకుడు ప్రస్తావింపబడ్డాడు గొంక, గోగిఅయింది చరిత్రలో చాలమంది గోకిలేక గొంక నాయకులున్నారు N G Ranga గా ప్రసిద్ధులైన రైతునాయకుని గృహనామం గోగినేని.

**గోగులు- గోగుల :** గోగు కూర తెలసిందే. గ్రామనామం కావచ్చును. శాసనాల్లో గోంగులగా ప్రస్తావింప బడింది శా.శ. 1219 నాటి దుర్గిశాసనాలో ఒక గోంగుల పోచినాయని ప్రస్తావన వుంది.

**గోటేటి :** గోటేరు అనే గ్రామనామపు ఔపవిభక్తిక రూపం ఇది పశ్చిమగోదావరిజిల్లా తణుకు తాలూకాలో ఉంది

**గోడే :** గంజాం జిల్లాగ్రామం. శా శ 1203 నాటి సింహాచల శాసనంలో గొడ నరసింహదేవర ప్రస్తావన వుంది మరో శాసనంలో గోడెజగ్గారాయని ప్రస్తావన వుంది గోడేవారి సంస్థానం వుంది

**గోన :** వంశనామం గ్రామ నామ ప్రధమావయవం. రంగనాధ రామాయణ కర్త గోనగన్నారెడ్డి సాహితీ లోకానికి పరిచితుడు. శా.శ. 1167 నాటి వద్దమాను (మహబూబ్‌నగర్ జిల్లా) శాసనంలో గోన కుప్పాంబ ప్రసక్తివుంది ఈమె, వద్దమానునేలిన మల్యాల గుండయభార్య గోన గ్రామనామ ప్రధమావయవం గోను నరసాయపాలెం రాపూరు తాలూకాలో వుంది. గోనుపల్లె అనే గ్రామం అదే తాలూకాలో వుంది. గోనెపాడు, గోనెల గోనుగుంటి అనే గ్రామంలో కూడా వున్నాయి.

**గోనెల :** గ్రామనామం.

**గోపతి :** ఆబోతు అని సాధారణ అర్థం అయితే ఇంద్రుడు శివుడు, సూర్యుడు అనే అర్థాలుకూడా వున్నాయి.

**గోపరాజు :** గోపశబ్దంపై రాజు వ్యక్తినామం గోపాల సంక్షిప్తరూపం గోప. శా.శ 1452 ఉండపల్లి శాసనంలో స్థలకరణంగా ఒక గోపరాజు మహాపాత్రుల ప్రస్తావనవుంది. శా శ.1619 నాటి నందికొట్కూరు తాలూకా బొల్లావరం గ్రామశాసనంలో కాశ్యపగోత్రులైన ఒక గోపరాజు వంశోద్భవులైన ప్రసన్నయ్యంగారి ప్రస్తావన వుంది గోపరాజు రామచంద్రరావు నాస్తిక వాద ప్రముఖులు.

**గోపాలుని :** గోపాలుడు అనే వ్యక్తి మూలపురుషుడు గావడం వలన, తరువాతి అతని సంతతి వారికి అతనిపేరే ఇంటిపేరు అయింది చిత్రాంగదా పరిణయ కర్త రామకవి, కుటుంబనామం ఇదే అతడు నన్నయ తమవంశంవాడని చెప్పికున్నాడు ఈ ఇంటిపేరుగల వారు ఆంధ్రనియోగ బ్రాహ్మణుల్లో వున్నారు శా శ 1197 నాటి పొన్నూరు శాసనంలో శాసనంలో గోపాలుని అమరయ, ప్రస్తావింపబడ్డాడు

**గోపినేని - గోపునాయక :** వ్యక్తినామం. గోపిశబ్దంపై నాయక శా శ 130[illegible] నాటి సింహాచలం శాసనంలో ఒక గోపునాయక పురాయనాయకుని ప్రస్తావన గలదు గోపినేని పాలెం నందిగామ తాలూకా గ్రామం.

**గోపు :** రాజోద్యోగము శా శ 1313 నాటి తంగెడ శాసనంలో ఒక గోపులెంక తెలుంగరి ప్రస్తావనవుంది గోపువాని పాలెం గన్నవరం తాలూకాలో వుంది

**గోర - గోరా :** శా శ 1311 నాటి సింహాచలం శాసనంలో ఒక గోర చింగిరిసేనాపతి మరో శాసనంలో ఒక గోరా పురాయికిలారి ప్రస్తావన వుంది. గోర గ్రామ నామం

**గోరంట్ల :** గోరింట అనేది ఒక మొక్క దాని బహువచనం గోరంట్ల ఈ పేరుతో అనంతపురం, గుంటూరుజిల్లాల్లో గ్రామాలున్నాయి ఈ ఇంటిపేరుగల వారి ప్రధమ ఆవాసం ఆ గ్రామాల్లో

ఏదైనా కావచ్చు. అయితే తిమ్మ సముద్రంలోని గోరంట్ల వారి ప్రధమ ఆవాసం అనంతపురంజిల్లా అని చెప్పడానికి చారిత్రక ఆధారాలున్నాయి గోరంట్ల బుచ్చయ్య చౌదరి ప్రముఖులు

**గోరస:** పిఠాపురం తాలూకాగ్రామం. శబ్దార్ధము మజ్జిగ

**గోలి:** గుంటూరుజిల్లా పల్నాడులోని గ్రామం ఆ గ్రామం నుండి వలస వచ్చిన వారికి ఆ గ్రామ నామం ఇంటి పేరయింది. శా శ 1326 నాటి సర్పవరం శాసనాల్లో ఒక గోలి సోమారి ప్రస్తావన కలదు

**గోళ్ల:** కల్యాణదుర్గం నందిగామతాలూకాగ్రామం గోడి అనేది ఒక చెట్టు. గోళ్లవారిపల్లె చిత్తూరుజిల్లా గ్రామం.

**గోళ్లమూడి:** కృష్ణాజిల్లా నందిగామ, గుంటూరుజిల్లాల్లో ఈ పేరుతో గ్రామాలున్నాయి

**గోవర్ధనగిరి:** ప్రకాశంజిల్లా కంభం తాలూకాగ్రామం. మరో గోవర్ధనగిరి కర్నూలుజిల్లా డోన్ తాలూకాలో వుంది

**గోవాడ:** గుంటూరుజిల్ల తెనాలి తాలూకా గ్రామం గోవాడ నిరీక్షణరావు రాజకీయ నాయకులు.

**గోసరి - గోసారి:** గోసరము అంటే ఒక విధమైన యజ్ఞము అయితే ఇచ్చట ఆ అర్ధంలో కాక గోపాలకుడు అనే అర్థంలో వచ్చింది ఘోషము అంటే గోవులమంద శా శ 1072నాటి విజయవాడ శాసనాల్లో ఒక గోసరి కొమ్మయను పేర్కొనడం జరిగింది

**గోసాల:** కృష్ణాజిల్లా బెజవాడ తాలూకాగ్రామం

**గౌతు:** గౌతుగుడ మల్కనగిరి ఏజెన్సీగ్రామం గౌతులచ్చన్న మంత్రిగా పనిచేశారు

**గౌరాజు - గౌరిరాజు- గవరరాజు:** గౌరిశబ్దం ఇన్ని విధాలుగా పరిణమించింది శా శ 1482నాటి గుంటూరుజిల్లా శేకూరు శాసనంలో ఒక గౌర్రాజు కోనరాజు ప్రస్తావన వుంది. వీరికి ఆ గ్రామంపై నాయంకరముంది గౌరిగ్రామనామంపై రాజు గౌరిరాజు పర్లాకిమిడి తాలూకాగ్రామం. గవర ఒక జాతి జనులు.

**గౌరిశెట్టి:** వ్యక్తినామం గౌరి పార్వతి గవరకులస్తులకు ఆరాధనీయ. దానిపై శెట్టి

**గ్రంధి:** ఈ ఇంటిపేరు వైశ్యులలో కన్పిస్తోంది. గ్రంధసరి అనేగ్రామముంది. గందె అనే ఇంటిపేరు శాసనాలలోవుంది శా శ 1418 నాటి సంతరావూరు శాసనల్లో గందె పోతయ అనునతడు తన తండ్రి శ్రీగిరిశెట్టికి పుణ్యంగా కార్యము నిర్వహించి నట్టే చెప్పిబడింది.

**ఘటశాసి:** శాసనాల్లో ఘడియశాశులుగా చెప్పబడింది పారశాల నిర్వహణాధికారులు.

**ఘడియపూడి - గడియపూడి:** ప్రకాశంజిల్లా గ్రామం.

**ఘడియారం:** శా శ. 1326 నాటి సర్పవరం శాసనంలో, గోలసోమారెడ్డి భావనారాయణ ఆలయంలో ఘడియారము పెట్టి, దానికి నిర్వహణకు ఔబళోఝ, సింగాఓఝలకు జీతాలను ఏర్పాటు చేసినట్లు చెప్పబడింది.

**ఘడిశాసులు :** శా శ 1243 నాటి సింహాచలం శాసనంలో కాండవశాఖ, తైత్తిరీయ శాఖలు చదివించెడి ఘడిశాసులైన బ్రాహ్మణులు అని ప్రస్తావించబడింది చూడు ఘడియారం

**ఘంటసాల :** కృష్ణాజిల్లా దివితాలూకా గ్రామం ప్రసిద్ధగాయకులు ఘంటసాల వెంకటేశ్వరరావు

**ఘంటా :** ఘంటావాని పాలెం అనకాపల్లె తాలూకాలో వుంది చూడు గంట ఘంటా కృష్ణమూర్తి ప్రముఖులు

**ఘోడెరాయ :** వ్యక్తినామం శా శ 1345 నాంటి పలివెల శాసనంలో ఘోడెయరాయ త్రిపురారి జియ్య ప్రస్తావన గలదు ఇతడు రాజమహేంద్రవరాన్ని ఏలిన వీరభద్రారెడ్డికి కులక్రమానుగత గురువు. శ్రీనాధుడు భీమేశ్వరపురాణంలో ఘోడెరాయాంక సద్గురురాజ భీమేశ్వరస్వామి అని సంభావించింది ఇతనినే. నిజానికిది గోడే చూడు గోడే. త్రిపురారిని శ్రీనాథుడు శబ్దార్ధపరంగా భీమయగా మార్చాడు అర్థం శివుడు గోడేవారి సంస్థానం బ్రాహ్మణులది ఈ శాసన కర్తలు వీరభద్రారెడ్డి, ఆయన భార్య అనితల్లి

**చక్రవర్తి :** గొలుగొండ ఏజెన్సీ గ్రామం శా శ 1343 నాటి సింహాచలం శాసనంలో చక్రవర్తి వారి ప్రస్తావన వుంది భీమేశ్వరస్వామి అని ప్రస్తావించినది ఇతనినే అయితే త్రిపురారిని భీమేశ్వరస్వామిగా మార్పుచేశాడు ఈశాసనకర్తలు వీరభద్రారెడ్డి, ఆయన భార్య అనితల్లి చక్రవర్తి అంటే ప్రభువు గ్రామనామాల్లోని చక్రవర్తి ఆ పేరుగల గడ్డికి సంకేతం.

**చక్రవర్తుల :** చక్రవర్తుల వారి ఖండ్రిక పొదిలి తాలూకలో వుంది

**చంద్ర :** చంద్ర గ్రామనామం ఒక చెట్టు చంద్ర వారిపల్లె వాయల్పాడు తాలూకాలో వుంది

**చతుర్వేదులు:** నాలుగు వేదాలను (ఋగ్యజుస్సామ అధర్వణవేదాలను) అభ్యసించినవారు. ఈ కుటుంబ నామం గల కుటుంబాల పూర్వులలో అంతటిస్థాయి కలిగిన వారుండడం వలన, అనంతర కాలంలో వారికా ఇంటిపేరు చెల్లివచ్చింది ఇలాగే ద్వివేదుల. అంటే రెండు వేదాలను (ఋగ్వేద యజుర్వేదాలను) అభ్యసించినవారు, వాటిపై అధికారం కలిగిన వారని అర్థం. కాగా ఉత్తర భారతంలో త్రివేదులున్నారు ఆంధ్ర రాష్ట్రానికి మొదటి గవర్నరు చందూలాల్ మాధవలాల్ త్రివేది వీరిని ప్రాంత భేదాన్ని బట్టి త్రిపాఠీలనడం కూడా వుంది. అలాగే తివారీలు కూడా. ఇక్కడ మూడు వేదాలంటే ఋగ్యజుస్సామ వేదాలు.

చతుర్వేదుల, త్రివేదుల ద్వివేదులతోపాటు ఆంధ్రదేశంలో సామవేదం ఇంటిపేరు గలిగిన వారు కూడా వున్నారు ప్రత్యేకంగా సామవేదాన్ని గానం చేయడంలో నిపుణత సాధించిన కుటుంబాలకు ఇది ఇంటిపేరుగా స్థిరపడింది ఉత్తర భారతంలో సామగానం చేసేవారిని సామ బ్రాహ్మణులు, సామవిప్రులనడం కలదు

**చదలవాడ - చెదలాడ :** చెదలవాడ అనే గ్రామం గుంటూరుజిల్లాలోను, చెదలాడ అనే గ్రామం తూర్పుగోదావరి జిల్లాలోను వున్నాయి. చదలవాడ పిచ్చయ్య రాజకీయ నాయకులు

**చదుం :** ఈ పేరుగల గ్రామం చిత్తూరు జిల్లా పుంగనూరు తాలూకాలో వుంది ఇందలి చ కారాన్ని దంత్యయుక్తంగా చదవాలి

**చద్దికూటి :** చద్ది అన్నము చద్దికూటి ఖండ్రిక అనేగ్రామం, కాళహస్తి తాలూకాలోవుంది

**చందన :** ఇది గంధపు చెట్టుతో సంబంధమున్నదిగాదు ఇది ఒక ఊరిపేరు. అనంతపురంజిల్లా తాడిపత్రి తాలూకాలో వుంది

**చందలూరి :** చందలూరు అనేగ్రామం ప్రకాశంజిల్లాలో వుంది

**చందూరు :** చిత్తూరుజిల్లా పుంగనూరు తాలూకా గ్రామం

**చందోలు - చందవోలు :** గుంటూరుజిల్లా గ్రామం వెలనాటి చోడుల రాజధాని ఇది

**చంద్రగిరి :** చిత్తూరుజిల్లా గ్రామం తాలూకాకేంద్రం

**చంద్రశేఖరుని :** వ్యక్తినామం శా శ 1240 నాటి పాలకొల్లు శాసనంలో ఒక చంద్రశేఖరుని వెందయ్య ప్రస్తావన వుంది చంద్రశేఖరుడు శివుడు

**చంద్రాల :** విజయవాడ, గుడివాడ తాలూకాల్లో ఈ పేరుతో గ్రామాలున్నాయి

**చర్ల - చెర్ల :** ఈ పేరుతో తూర్పుగోదావరి జిల్లా నూగూరు తాలూకాలో, ఖమ్మంజిల్లాలో గ్రామాలున్నాయి సాహితీ పరులకు బాగాపరిచయమైన వారు చర్ల గణపతిశాస్త్రిగారు

**చలంచాల :** ప్రకాశంజిల్లా కందుకూరు తాలూకాగ్రామం

**చలిపందిరి :** గ్రామనామం శాశ 1170 కొణిదెన శాసనంలో ఒక చలిపందిరి పోతరాజు ప్రస్తావనవుంది

**చలివేంద్ర (ద్రం) :** ప్రకాశంజిల్లా దరిశి తాలూకాగ్రామం, ఈ పేరుగల మరో గ్రామం పాలకొండ తాలూకాలో వుంది

**చల్లా - చల్లపల్లె :** ఈ పేరుతో కృష్ణాజిల్లా దివితాలూకాలోను, పశ్చిమగోదావరిజిల్లా ఏలూరు తాలూకాలోను గ్రామాలున్నాయి ఇందలి చల్ల శబ్దం మజ్జిగ (buttermilk) తో సంబంధమున్నది కాదు చల్ల అనేది ఒక చెట్టు చల్లచింతలపూడి, చల్లగరిగల అనే గ్రామాలు కూడా వున్నాయి. వ్యస్తంగా చల్లా అనేది కూడ ఇంటిపేరుగా వుంది శా శ 1185 నాటి కొణిదెన శాసనంలో ఒక చల్ల బ్రమ్మన బోయని ప్రసక్తివుంది చల్లావారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది చల్లా రాధాకృష్ణ ప్రముఖులు

**చాగంటి - చాగల్లు :** చాగల్లుపై ఔపవిభక్తిక రూపం చాగంటి చాగల్లు పేరుతో గ్రామాలు గుంటూరు జిల్లాలోను, పశ్చిమగోదావరిజిల్లాలోను వున్నాయి

**చాగి - సాగి :** ఇది త్యాగి శబ్దభవంగా చెపుతారు ఆ మేరకు శాసనస్థ సాక్ష్యం కూడా వుంది కాని చాగల్లు, చాగలేరు గ్రామ నామాలతో పోల్చిచూసినపుడు అలా చెప్పడానికి కుదరదు గ్రామనామ సంబంధియే అవుతుంది. శా.శ 1121 నాటి విజయవాడ శాసనాల్లో చాగి పోతరాజు మహామండలేశ్వరునిగా పేర్కొనబడ్డాడు. చాగి వ్యవహారంలో సాగి అయింది

**చాట్రగడ్డ :** గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాగ్రామం.

**చాప్యపు :** చాప్యము శబ్దంపై ఔపవిభక్తికరూపం గ్రామనామం శా శ 1313 నాటి సింహాచల శాసనంలో ఒక చాప్యపు అడకుమల్లుని ప్రస్తావన వుంది

**చామర్తి :** చామర్రుపై ఔపవిభక్తిక రూపం. ఈ గ్రామం సాగిసూర్యనారాయణరాజు రాజకీయ నాయకులు గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలో వుంది. శా శ 1130 నాటి శ్రీకూర్మ శాసనంలో ఒక చామర్తి సీతయ ప్రస్తావన వుంది. చామర్తివారి ఖండ్రిక కందుకూరు తాలూకాగ్రామం

**చామల -** సామల శ్రీకూర్మశాసనంలో కాశ్యపగోత్రానికి చెందిన ఒక చామల అప్పన ప్రసక్తి వుంది. దీనిని దంత్యంగా చదవాలి సామర్లు అనేది ఒక ధాన్యవిశేషం సామర్ల కోటలోని సామర్ల కూడ అదే దానిని శాసనాల్లో చామర్లకోట అని కూడా వ్రాయడం జరిగింది. సామల రమేషుగారు నడుస్తున్న చరిత్ర సంపాదకులు

**చావ - చావా :** గ్రామనామ ప్రథమావయవం చావలి గుంటూరుజిల్లా తెనాలి తాలూకాగ్రామం చావ, అనే గృహనామం దీనివల్లనే వచ్చింది ఇది ఒకరకంగడ్డి చావా అని కూడా వ్రాస్తున్నారు

**చావలి :** తెనాలి తాలూకాగ్రామం చావలి లింగమ నాయుడిపల్లె కాళహస్తి తాలూకాలో వుంది

**చిగిచెర్ల :** అనంతపురంజిల్లా ధర్మవరం తాలూకా గ్రామం చిగి చెర్ల అనే రెండుపదాల కలయిక వలన ఏర్పడింది చిగి శబ్దాన్ని చిగిరింతతో పూల్చిచూసినపుడు ఒకరకం మొక్కగా బోధపడుతుంది చెర్ల చెరువులకు సంక్షేపరూపం

**చిగురు కోట :** కృష్ణాజిల్లా కైకలూరు తాలూకాగ్రామం, చిగురు అనే గ్రామం రాయఘడ తాలూకాలో ఉంది

**చిగురుపాటి :** చిగురుపాడుకు ఔపవిభక్తిక రూపం లేత ఆకులను చిగురుటాకులు అనడం, ఒకవిధమైన మట్టిని చిగురుమట్టి అనడం తెలిసిందే అయితే ఇది ఆ రెంటికి చెందినది కాదు. ఇది ఒకరకం తీగె జాతికి చెందిన మొక్క. ఈ గ్రామం గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలో వుంది.

**చిచ్చిలి :** చిచ్చిలి గ్రామం చంద్రగిరి తాలూకాలో వుంది

**చిటిప్రోలు :** వ్యక్తినామం చిటి, చిట్టిశబ్దసంబంధి ప్రోలు అంటే ప్రోల వుండే స్థలం. ప్రోలశబ్దానికి కోశాధికారి అని అర్థం ప్రోలు అనగా కోశాధికారి ఉండే చోటు అనగా ఇప్పటి ట్రెజరీవుండే గ్రామం లాంటిది ధనవంతుడు కావాలనే ఉద్దేశంతో ప్రోలశబ్దం వ్యక్తినామ పరంగావచ్చి వుండవచ్చు. జుట్టు పోలగాడుఅంటే జుట్టు మాత్రమే సంపదగా గలవాడు

**చిట్టా :** వస్తువులను, ఆయ వ్యయ వివరాలను చిట్టా అనడం తెలుసు. అయితే గృహనామానికి ఇది ఆకరం కాకపోవచ్చు. ఇది వ్యక్తినామం కావడానికి అవకాశముంది.

చిట్టమంత్రి చరిత్రలో ప్రసిద్ధినందినవాడు శా శ 1440 నాటి పెదకాకాని శాసనంలో ఇతని ప్రస్తావన వుంది అప్పటి ఇతని ఇంటిపేరు రెంటూరి ఇతడు కౌండిన్య సగోత్రుడు. ఆపస్తంబసూత్రుడు యజుశ్శాఖాధ్యాయి మహామంత్రి తిమ్మరసు రాజ్యకార్యనిర్వహణా భారమును వహించినవాడు బ్రాహ్మణులలో చిట్టావారు పై చెప్పిన గోత్రాదికములతో సరిపోయిన వారి కుటుంబాలకు ఇతడు మూలపురుషునిగను, అలాకాని చోట, చిట్టంపాడు, చిట్టంవలస మొదలైన గ్రామనామాలలోని మొదటిపదం ఆకరమవుతుంది. చిట్టా బాలకృష్ణశాస్త్రి ప్రముఖులు

**చిట్టినీడి - చిట్టినేని :** వ్యక్తినామం చిట్టి అంటే చిన్న చిట్టనేని వెంకటరావు ప్రముఖులు

**చిట్టూరు(రి) :** కృష్ణాజిల్లా దివితాలూకా గ్రామం మరో గ్రామం రాయచోట తాలూకాలో వుంది

**చిత్రపు :** చిత్రం గ్రామనామపు ఔపవిభక్తిక రూపం శాశ 1346 నాటి కాకినాడ తాలూకా భీమవరం శాసనంలో ఒక చిత్రపు భీమన్న ప్రస్తావన వుంది

**చిత్రం :** కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాగ్రామం ఇది ఒక రకం గడ్డి చిత్రచేడు అనే గ్రామం కూడా వుంది

**చిత్రవాడ :** గ్రామనామం కాకినాడ తాలూకా భీమవరం శాసనంలో ఒక చిత్రవాడ ప్రోలయరడ్డి ప్రస్తావన వుంది

**చనుమోలు :** గ్రామనామం చనుమోలు వెంకటరావు ప్రముఖులు

**చింతమనేని :** ఇది వ్యక్తినామం చింతమనాయుడు అనేది అసలుపేరు చింతయ్య అనే పేరు వ్యక్తినామాల్లో వుంది బహుశా ఆలోచనాపరుడు, జిజ్ఞాసువు, వేదాంతి ముముక్షువు అనే భావనలో ఈ దేశీయపదం వ్యక్తినామాల్లో చోటు చేసుకొని వుండవచ్చును

చరిత్రకు సంబంధించి శా శ 1076 నాటి అవనిగడ్డ శాసనంలో ఒక చింతమనీడు ప్రస్తావింపబడ్డాడు ఇతడు కొల్లూరికి విభుడు వెలనాటి గొంక భూపతికి అన్వయభృత్యుడు. అంటే తర తరాలుగా ఆ ప్రభువంశానికి వీరు విశ్వాసపాత్రులు ఈయన భార్య గుండమ్మ. ఇతని కుమారుడు ముత్తినాయకుడు ముత్తినేని వారు కూడా వున్నారు

**చింతలపూడి :** ఈ పేరుతో పశ్చిమగోదావరి గుంటూరుజిల్లాల్లో గ్రామాలున్నాయి. ఇతర చోట్ల కూడ వుండవచ్చును శా శ 1324 నాటి సర్పవరం శాసనంలో చింతలపూడి కాచన్న ప్రస్తావన వుంది

**చింతాడ :** బొబ్బిలి తాలూకాగ్రామం

**చింతామణి :** టెక్కలి తాలూకాగ్రామం మరో చింతామణి గ్రామం కర్నాటకలో వుంది

**చిన్నం - చిన్నం బాక :** ఈ రెండు గృహనామాలు ఉన్నాయి. చిన్నంబాక అనేది ఒక గ్రామనామం అందలి పూర్వభాగం వ్యస్తంగా గృహనామమై యుండవచ్చును శా శ 1486 నాటి కొండవీటి శాసనాల్లో ఒక చిన్నంబాక రామయ ప్రస్తావన వుంది చిన్నం రామయ్య తెలుగు పండితులు

**చిమటా :** ఈ పేరుగలగ్రామం పొదిలితాలూకాలోవుంది.

**చిరుమామిళ్ల :** నరసరావుపేట తాలూకాగ్రామం చిరుమామిళ్ల అంటే, మామిడిలో చిన్నది అని కాదు చిరుమామిళ్ల అనేది ఒకరకం గడ్డి

**చిలకపాటి :** చిలకపాడు అనేగ్రామం ప్రకాశంజిల్లాలో వుంది. ఇది దాని ఔపవిభక్తికి రూపం.

**చిలకల - చిలకా :** చిలకల గ్రామం నంద్యాల తాలూకాలో వుంది.

**చిలమకూరు - చిలంకుర్తి:** ప్రకాశంజిల్లా కనిగిరి పొదిలి తాలూకాలలో ఈ పేరుతో గ్రామాలున్నాయి.

**చిలుకూరు :** పశ్చిమ గోదావరిజిల్లా భీమవరం తాలూకాగ్రామం. చిలు+కుఱ్ఱు వ్యవహారంలో చిలుకూరు అయింది. ప్రసిద్ధ భాషావేత్త నారాయణరావు గారి గృహనామం చిలుకూరి

**చిల్లకల్లు - చిల్లకంటి :** కృష్ణాజిల్లా నందిగామ తాలూకాగ్రామం చిల్లకంటి ఔపవిభక్తిక రూపం.

**చీకటి :** శ్రీకాకుళం జిల్లాలో ఒక ప్రాంతం ఒకగ్రామం తాలూకాకేంద్రం శా శ 1203 నాటి సింహాచల శాసనంలో చీకటి దేశాధికారిగా అమాత్య అనంతజీయన చెప్పబడ్డాడు చీకటి పరశురామ నాయుడు రాజకీయనాయకులు.

**చీమకుర్తి :** ప్రకాశం జిల్లాగ్రామం శేషగిరిరావు ఈ ఇంటిపేరుతో ప్రముఖులు

**చీర్ల :** వస్త్రవిశేషం కాదు చీర్లదిన్నె అనేగ్రామం ప్రకాశంజిల్లా కనిగిరి తాలూకాలో ఉంది. చీర్లగురప్పఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది. కనిగిరి తాలూకాగ్రామం

**చుక్కా :** గ్రామనామ ప్రథమావయవం. చూడు. చుక్కపల్లె, చుక్కావారి పల్లె చిత్తూరు తాలూకాగ్రామం.

**చుక్కపల్లె :** వీరవల్లి తాలూకా గ్రామం

**చుట్టి - చుట్టు :** చుట్టి అనేగ్రామం వెంకటగిరి తాలూకాలో వుంది

**చుండి :** ప్రకాశంజిల్లా కందుకూరు తాలూకాగ్రామం చుండి రంగనాయకులు, కళాశాల స్థాపకులు

**చెంగల్వ :** ఎఱ్ఱని కలువ అని శబ్దార్థము. చెంగల్వకాళకవి ప్రసిద్ధుడు.

**చెంగారెడ్డి :** వ్యక్తినామం. ఇది చంగ శబ్ద భవం. అందమైన అని అర్థం. చెంగారెడ్డి నారాయణరెడ్డి ఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది

**చెన్నమనేని :** చెన్న శబ్దం అందమనే అర్థాన్నిస్తుంది శా శ.1419 నాటి గుత్తితాలూకా రామాపురం శాసనంలో ఒక చెన్నమనాయని ప్రస్తావన వుంది. ఇతనికి నాయంకరముంది. అప్పటి అతని గృహనామం జన్నె. చెన్నమనేని పల్లె అనేగ్రామం కడపతాలూకా లో వుంది.

**చెన్నాప్రగడ :** వ్యక్తినామం. శా శ 1465 నాటి విశాఖజిల్లా పంచదార్ల శాసనంలో చెన్నాప్రగడ చెన్నకవి ప్రస్తావన వుంది ఇతడు బెహరాపురం కరణం. అప్పటివారి గృహనామం ఒడ్డిపర్తి

**చెన్నుపాటి :** చెన్నుపాటి వారిపల్లె చంద్రగిరి తాలూకాలో వుంది చెన్నుపాడుకు ఔపవిభక్తిక రూపం.

**చెన్నూరి :** కృష్ణాజిల్లా, కడప జిల్లాలో ఈ పేరుగల గ్రామాలున్నాయి

**చెన్నూరు (రి) :** కర్నూలు, కడపజిల్లాల్లో ఈ పేరుతో గ్రామాలున్నాయి

**చెముడు :** సాలూరు తాలూకాగ్రామం

**చెరకు :** గ్రామనామాల్లో చోటుచేసికున్న చెరుకు, ఖాద్య శాకమైన చెరుకుగాదు దానిని పోలిన గడ్డిజాతి మొక్క గ్రామనామం శా శ 1124 నాటి జలాలుపురం శాసనంలో ఒక చెఱకు బొల్లిరెడ్డి ప్రస్తావన వుంది చెరుకువారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది శా శ 1123 నాటి సర్పవరం శాసనంలో ఒక చెరుకుల నారెబోయుని ప్రస్తావన గలదు

**చెరుకువాడ :** పశ్చిమగోదావరిజిల్లా భీమవరం తాలూకాగ్రామం ఉపన్యాసకేసరి నరసింహం పంతులగారి గృహనామం చెరుకువాడ

**చెరుకూరు :** చెరుకూరి ఈ పేరుగలగ్రామాలు చాల వున్నాయి. ఉదాహరణకు బాపట్ల తాలూకాలో ఒకటి వుంది ఈనాడు సంపాదకులు చెరుకూరి రామోజిరావు

**చెరువు:** జలాశయమని అర్థం. ఈ పేరుగల గ్రామం బాపట్ల తాలూకాలో వుంది

**చెలమ :** గిద్దలూరు సమీప గ్రామం

**చెలమచెర్ల :** గ్రామనామం

**చెలమల :** నూగూరుతాలూకాగ్రామం.

**చెలికాని :** వ్యక్తినామం. చెలికాడుకు ఔపవిభక్తిక రూపంగా చెప్పవచ్చును. చెలికాడు అంటే స్నేహితుడు అని తెలిసిందే. అయితే వ్యక్తినామపరంగా దీనిని అనువర్తింప చేయలేము. చెల్లిగాని వలస అనేగ్రామం శ్రీకాకుళం జిల్లా రాజాం తాలూకాలో వుంది. ఇందలి చెల్లి శబ్దం చెల్లయకు మారుగా నిలిచింది. చెల్లయ్య, చెల్లమ్మ అనే పేర్లు వ్యవహారంలో వున్నాయి. చెల్లు శబ్దానికి సమర్థుడు, అర్హుడు అనే అర్థాలున్నాయి చెలికాని వారిపోతేపల్లి కామవరపుకోట తాలూకాలో వుంది. చెలికాని అన్నారావు ప్రముఖులు.

**చెలినేని - చెల్నెని -** చెల్లయ్య, చెల్లమ్మ వ్యక్తినామాలుగా పరిచయమైనవే, తమ్ము శబ్దం, చెల్లిశబ్దం రెండూ వ్యక్తినామాలుగా కుదురుకున్నాయి శా శ 1344 నాటి కాకినాడ తాలూకా భీమవరం శాసనంలో ఒక చెల్నేని మురారి ప్రస్తావన గలదు

**చెవిటికల్లు - చెవిటికంటి :** కృష్ణాజిల్లా నందిగామ తాలూకాగ్రామం.

**చెవ్వ - చెవ్వా :** చెవ్వారిపల్లె పులివెందుల తాలూకాలో వుంది. చెవ్వ, చేవ సంబంధి. చూడు. చావా.

**చేకూరు - చేకూరి - శేకూరు - శేకూరి :** వీటి అన్నింటికి మూలమైనది శేకూరు అనేగ్రామం. తెనాలి తాలూకా గ్రామం. అయితే వాస్తవానికి ఇది చేకుర్రు. చేకూరి కాశయ్య ప్రముఖులు.

**చేబ్రోలు:** ఈ పేరుతో రెండు గ్రామాలున్నాయి. ఒకటి పశ్చిమగోదావరి జిల్లాలో మరొకటి గుంటూరు జిల్లాలోను వున్నాయి. శాసనాల్లో చేంబ్రోలు.

**చేమకుర్తి - చేమకూరి :** శా.శ 1322 నాటి గుంటూరు జిల్లా ఎనమదల గ్రామ శాసనంలో ఒక చేమకుర్తి అన్నమనాయని ప్రస్తావనవుంది. చేమకూరి వెంకటకవి విజయవిలాస కర్త.

**చేమూరి :** గ్రామనామం. చేమూరివాని ఖంద్రిక పుంగనూరు తాలూకాలో వుంది. దీని రూపాంతరం చేమురి.

**చొప్ప :** ఎండిన జొన్నను చొప్ప అంటారు. అయితే చొప్పల్లె అనే గ్రామం ముంది. అందలి ప్రథమావయవం కావచ్చు. చొప్పగడ్డిఅనేది కూడ వుంది. చొప్పరామన్న గూడెం నిడదవోలు తాలూకాలో వుంది. చొప్పదండి అనే గ్రామం ప్రకాశం జిల్లాలో వుంది.

**చోడోజు :** చోడ శబ్దంపై ఓజుచేరిన వ్యక్తినామం. శా.శ. 1336 నాటి కాకినాడ తాలూకా భీమవరం శాసనంలో ఒక చోడోజు కొమ్మన ప్రస్తావన వుంది. చోడ రాజవంశం.

**చోద్యం :** గోలుగొండ తాలూకాగ్రామం.

**చౌట - చవట :** గ్రామనామ పూర్వపదం. చౌటపల్లి. గుడివాడ నందిగామ తాలూకాల్లో ఈ పేరుతో గ్రామాలున్నాయి. చౌట పాపాయపాలెం సత్తెనపల్లి తాలూకాగ్రామం.

**చౌదరి :** సాధారణంగా ఇది కమ్మ వారికి పట్టపు నామంగా చెల్లివస్తుంది. చౌదరి అంటే చౌత్ అనే పన్ను వసూలుచేసే అధికారి అని చెప్పడం పరిపాటి. కాని ఇది చౌత్ ద్వారా పదసంబంధి. అంటే నాలుగు వీధుల వైపు ద్వారములు కలవాడు అని అర్థం. అంటే అతడెంత ప్రముఖుడో తెలియవస్తుంది. కనుక చౌదరి అంటే ప్రముఖుడు, అధికారి అని అర్థంచేసికోవాలి. కులపెద్దను కూడ చౌదరి అనడం వుంది. గ్రామాధికారి, పెద్దమనిషి అనే అర్థాల్లో కూడ వర్తిస్తుంది. అయితే ఇది కాలక్రమంలో కమ్మవారికి పరిమితమయింది. శా.శ. 1181 నాటి గుంటూరుజిల్లా దుర్గిశాసనాల్లో ఒక బ్రాహ్మణ ప్రముఖుడు సవుదరం మల్లపరాజు ప్రస్తావన వుంది. అతడు నందాపుర అగ్రహార ప్రభుముఖ్యునిగా చెప్పబడ్డాడు. బారాదరి అంటే ఇంటికి 12 ద్వారాలు కలవాడు. తెలంగాణాలలోని ఉజ్జిలి శాసనాల్లో ఒక సౌధరి కేషవయ్య ప్రస్తావన వుంది. చౌదరివారి పల్లె బద్వేలు తాలూకాలో వుంది.

**ఛత్రం :** ఛత్రమంటే గొడుగు. దేవుని ఉత్సవ ఊరేగింపులో గొడుగు పట్టడం వుంది. ఆ ఉద్యోగులు ఛత్రం వారుగా చెప్పబడ్డారు. గుంటూరు శాసనాలో ఒక ఛత్రం నారె పేర్కొనబడ్డాడు.

**జక్కంపూడి:** కృష్ణాజిల్లా బెజవాడ తాలూకాగ్రామం జక్కంపూడి సీతారామారావు ప్రముఖులు

**జక్కసాని:** వ్యక్తినామం జక్క యక్ష శబ్దభవం జక్కసాని కుంట్ల డోన్ తాలూకాగ్రామం

**జక్కువ:** గజపతినగరం తాలూకాగ్రామం

**జగడం:** జగడంవారిపల్లె మదనపల్లి తాలూకాలో వుంది జగడ అంటే కలహము వాద్య విశేషం కూడా

**జగ్గాపండితుల:** వ్యక్తినామం గుంటూరుజిల్లా అప్పికట్ల శాసనంలో జగ్గాపండితుల రామాపండితుల ప్రస్తావన గలదు జగ (మ) నుండి వ్యుత్పన్నము లేక జంగ కూడా కావచ్చును

**జటావల్లభుల:** చరిత్రలో జటా చోడవల్లభుడనే ప్రభువున్నాడు బహుశా అతని ముఖ్య ప్రధాని కుటుంబానికి ఆ పేరు స్థిరపడి వుండవచ్చు పాలకుల, యజమానుల పేర్లు తమ సంతతికి పెట్టుకోవడం వుంది అలాగే యజమానుల గృహనామం సేవకులకు కూడా ఒక్కొక్కప్పుడు వర్తిస్తుంది

**జంగం - జంగా:** ఇది ఒక కులనామంగా వర్తిస్తోంది నిజానికి శివభక్తులు జంగంవారుగా చెప్పబడ్డారు శా శ 1475 నాటి బద్వేలు తాలూకా కలుగురాళ్లపల్లి గ్రామ శాసనంలో ఒక జంగం సర్వయ్య వీరణాల బసవయ్య కుమారునిగా చెప్పబడ్డాడు జంగంనరసయ్యపల్లె, జంగంవారిపల్లి కనిగిరి తాలూకాలో వున్నాయి

**జడ్డు:** ఇది గ్రామనామం శా శ. 1171 నాటి వేల్పూరుశాసనాల్లో ఒక జడ్డుముత్తబోయని ప్రస్తావని వుంది. జడ్డేరు శృంగవరపుకోట తాలూకాగ్రామం. జడ్డర్లలోని జడ్డుకూడా ఇదే. జిడ్డు కృష్ణమూర్తి తత్త్వవేత్త

**జతనము:** యత్నశబ్ద వికృతి జతనము ఈ ఇంటిపేరు తో జతనము పెద్దిరాజు అనేవ్యక్తి శా శ 1332 నాటి అహోబిలం శాసనాలలో పేర్కొనబడ్డాడు.

**జనరెడ్డి - జనురెడ్డి:** శా శ 1315 నాటి సింహాచల శాసనంలో ఒక జనరెడ్డి శ్రీహరిరెడ్డి ప్రస్తావన వుంది జానారెడ్డి అనేపేరు నేడుకూడా వ్యవహారంలోవుంది

**జనాన:** శా శ 1271 నాటి సింహాచలం శాసనంలో దేవాలయంలో నామసంకీర్తనము చేయు ఒక జనాన చన్నమాధవ దాసిప్రస్తావన గలదు ఇది గ్రామనామం కావచ్చు.

**జంధ్యాల:** జంధ్యము అనగా యజ్ఞోపవీతము ఇది ధరింపక వేదోక్త కార్యములను నిర్వహింపరాదు. ఈ ఇంటిపేరుతో ప్రముఖ సినీకవి ఒకరున్నారు.

**జన్నాభట్ల -జొన్నా భట్ల:** యజ్ఞ శబ్దభవం జన్న, వ్యవహారంలో జొన్న అయింది. భట్టు అంటే పండితుడు శా శ 983 నాటి గుంటూరుజిల్లా వలివేరు శాసనాల్లో ఒక జన్నియభట్టు ప్రస్తావింపబడ్డాడు.

**జన్ను:** శా శ. 1271 నాటి సింహాచల శాసనంలో ఒక జన్ను నరసింహమ ప్రస్తావన వుంది. జన్నుగుడ అనే గ్రామం జయపురం తాలూకాలోవుంది.

**జన్యావుల :** ఆవులు తెలిసిందే జన్యావులు అంటే పునరుత్పత్తి కొరకు సాకే ఆంబోతులు కావచ్చును శా శ 1386 నాటి మాచర్ల శాసనంలో ఒక జన్యావుల సింగననాయని ప్రస్తావనవుంది

**జంపని :** గుంటూరుజిల్లా తెనాలి తాలూకాగ్రామం జంపని గ్రామం గుంటూరుజిల్లాలోను, జంపెన గ్రామం, విశాఖజిల్లాలోను వున్నాయి

**జంబు :** జంబువారి పల్లె చిత్తూరుజిల్లా గ్రామం శంభు శబ్దం తమిళంలో చంబుగా పరిణమించింది అది జంబు అయివుండవచ్చును జంబులింగం తమిళనాట వ్యాప్తిలోనున్న వ్యక్తినామం.

**జమ్మి :** జమ్ము పేరుతో పార్వతీపురం తాలూకాలో గ్రామాలున్నాయి జమ్మికోనేటిరావు రచయిత

**జమ్ముల మడక :** ప్రకాశంజిల్లా దరిశి తాలూకాగ్రామం, కనిగిరి తాలూకాలో కూడా వుంది. ప్రసిద్ధ అలంకార శాస్త్ర పండితులు మాధవరామశర్మగారి గృహనామం ఇదే

**జయంతి :** కృష్ణాజిల్లా నందిగామ తాలూకాగ్రామం

**జరుగు - జరుగుల - జరుగుమిల్లి :** ఈ మూడు ఇంటిపేర్ల వారు గలరు వస్తువును ఉన్నచోట నుండి, కొంతదూరానికి త్రోయడాన్ని జరపడం అంటాము అలాగే మనిషిని కూడా, అవతలకు వెళ్లమనడంలో కూడా జరుగు శబ్దాన్ని ఉపయోగిస్తాము. అయితే ఇంటిపేరును ఈ అర్థంలో సంయోజించడం కుదరదు ఇది ఒక రకం చెట్టు దీనికి అవకాశం మిస్తున్నది ఈ పేరుతో నున్న గ్రామం ఇది కంగుంది డివిజన్‌లో వుంది జరుగుబహువచన రూపం జరుగుల జరుగుమల్లి అనేగ్రామం ప్రకాశంజిల్లా కుందుకూరు తాలూకాలో వుంది

**జలగం :** జలగం వారి ఖండ్రిక నిడదవోలు తాలూకాలో వుంది జలగం వెంగళరావు ముఖ్యమంత్రిగా పనిచేశారు బహుశా జలగాం అనే గ్రామనామ సంబంధి కావచ్చును

**జలనిధి :** గుణుపురం ఏజెన్సీగ్రామం

**జలమూరి :** గ్రామనామంపై ఔపవిభక్తికరూపం శా శ 1015 నాటి ముఖలింగం శాసనాలలో జలమూరివారి ప్రస్తావన వుంది శ్రీకాకుళం తాలూకా గ్రామం

**జల్తారు :** గుణుపురం ఏజెన్సీగ్రామం

**జల్లి :** గ్రామనామ పూర్వపదం జల్లిపల్లి జల్లివారిపుల్లలచెరువు కంభంతాలూకాలో వున్నాయి

**జవాది :** ఇది తెలంగాణంలోని గ్రామం అమ్మృతలూరి శాసనంలో ఒక జవాది తిర్మలయ్య ప్రస్తావన వుంది శాసనకాలం క్రీ శ 1576

**జాడు - జంతరునాడు :** ప్రదేశసూచి విశాఖజిల్లాలో ఒక ప్రాంతం ఇది చీపురపల్లె తాలూకాగ్రామం ఈ ఇంటిపేరుతో జాడ వారి కొత్తవలస అనేగ్రామం విశాఖజిల్లా బొబ్బిలి తాలూకాలో ఉంది శ్రీనాథుడు కాటయవేమారెడ్డి జైత్రయాత్రకు వర్ణించేసందర్భంలో దీనినిగూర్చి చెప్పాడు కీ శ 1294 నాటి సింహాచలం శాసనంలో ఒక పాత్రుని జాడు జియ్యనగా ప్రస్తావించడం జరిగింది. అలాగే జంతరునాడుకూడ ఆ ప్రదేశానికి చెందిన వ్యక్తులను సూచించే విధంగా అనేక శాసనాల్లో ప్రస్తావింపబడింది.

**జాతికర్త**: ఇది రాజోద్యోగ విశేషము శా శ కొండవీడు శాసనంలో మార్కొండ పుత్రుడైన ఒక జాతికర్త విరూపాక్షుని ప్రస్తావన గలదు.

**జామి**: శృంగవరపు కోట తాలూకాగ్రామం శా శ 1330 నాటి సింహాచలం శాసనంలో ఒక జామి అల్లుశెట్టి ప్రస్తావనవుంది

**జాలాది**: దీనిని దంత్యంగా చదవాలి ఇది నరసరావుపేట తాలూకా గ్రామం ప్రముఖ సినీ కవి జాలాదిగా తెలిసిన వ్యక్తి జాలాది రాజారావు

**జాలిమూడి**: రాజమండ్రి తాలూకాగ్రామం

**జిల్లా**: జిల్లావారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది ఇది జీయల శబ్దభావం. చూడు జీయరెడ్డి

**జిల్లేళ్ల**: జిల్లేడు మొక్క తెలిసిందే అయితే ఇక్కడ ఇది గ్రామనామం. ప్రొద్దటూరు తాలూకాలో ఒక జిల్లేళ్లవుంది ఇంకా కొన్ని గ్రామాలున్నాయి శా శ 1480 నాటి మదనపల్లి తాలూకా సోంపాలెం శాసనంలో మండలేశ్వర జిల్లెళ్ల కృష్ణమరాజయ్య ప్రస్తావన వుంది

**జీయరెడ్డి - జీరెడ్డి**: వైష్ణవ సంప్రదాయానికి చెందినది జీయశబ్దం శా శ 1310 నాటి సింహాచలం శాసనంలో ఒక జీయరెడ్డి సింగసాని ప్రస్తావన ఉంది జీరెడ్డి కొత్తపల్లె జమ్మలమడుగు తాలూకాలో వుంది

**జుంజు**: గ్రామనామ ప్రథమావయవం. జుంజురామన హళ్లి అనేగ్రామం రాయదుర్గం తాలూకాలో వుంది జుంజుపల్లె సేలంజిల్లా కృష్ణగిరి తాలూకాలో వుంది జుంజూరు పార్వతీపురం ఏజన్సీలో వుంది

**జూపల్లి**: శా శ 1446నాటి ప్రొద్దటూరు తాలూకా ఉప్పారపల్లి శాసనంలో ఒక జూపల్లి రామానాయని ప్రస్తావన వుంది

**జూపూడి**: దీనిని దంత్యంగా చదవాలి ఈ పేరుతో గ్రామాలు విజయవాడ బాపట్ల సత్తెనపల్లి తాలూకాలలో వున్నాయి జూపూడి యజ్ఞనారాయణ న్యాయవాది రాజకీయ నాయకులు

**జూలకంటి**: జూలకల్లుకు ఔపవిభక్తిక రూపం ఈ గ్రామం గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలో వుంది

**జెట్టి**: జెట్టివారి పల్లె రాజంపేట తాలూకాగ్రామం జెట్టి అంటే మల్లుడు

**జొన్నలగడ్డ**: ఈ పేరుతో కృష్ణా, గుంటూరుజిల్లాలో గ్రామాలున్నాయి జొన్నపాడు అనే గ్రామం కూడ వుంది ఇందలి జొన్న, ఖాద్యధాన్యమైన జొన్నకాదు. ఇది ఒక గడ్డిమొక్క

**జొన్నవిత్తుల**: ధాన్యవిశేషం ఈ గృహనామంతో ఒక సినీకవి వున్నారు.

**జోతి - జోతుల**: ఇది గీప సంబంధమైనది కాదు జోతి అనేగ్రామం కడపజిల్లా శాద్ధవటం తాలూకాలో వుంది జోతిపై బహువచనం జోతుల

**జోళదరాసి**: బళ్లారి తాలూకాగ్రామం

**జోస్యుల :** శా శ. 1170 కొణిదెన శాసనంలో ఒక జోశ్య అన్నిపెద్ది ప్రస్తావన వుంది. ఇంకా శా శ. 1359 నాటి విశాఖజిల్లా పంచదార్ల శాసనంలో ఒక జ్యోస్యుల విశ్వేశ్వరభట్ల ప్రస్తావన వుంది జ్యోతిష పండితుడు ప్రభువు ఆస్థానంలో ఇది కూడ ఒక పదవి ద్రాక్షారామ శాసనంలో నల్లయభట్టు అనే వ్యక్తి కులోత్తుంగచోడ రాజేంద్రచోడయరాజుల జోస్యులుగా చెప్పబడ్డాడు. జోస్యుల సూర్యనారాయణమూర్తి కవి, రచయిత.

**జ్యోతిష:** శా.శ. 1330 నాటి సింహాచలశాసనంలో ఒక జోతిష వరదునాయని ప్రస్తావన వుంది. మరోశాసనంలో ఇతడే జోస్యవరదు నాయునిగా పేర్కొనబడ్డాడు.

**టంగుటూరి :** టంగుటూరు పేరుతో ప్రకాశం, కడప, నెల్లూరుజిల్లాల్లో గ్రామాలున్నాయి టంగుటూరి ప్రకాశంపంతులు ఆంధ్రకేసరి.

**టేకుపల్లి :** కృష్ణాజిల్లా దివి తాలూకాగ్రామం. ప్రసిద్ధ సినీగాయకుడు ఘంటసాల వెంకటేశ్వరరావు జన్మస్థలం

**డబ్బా:** ఇది వస్తువుగా ఉపయోగించే డబ్బాకాదు ఇది గ్రామనామం పాడువా ఏజెన్సీలో ఈ పేరుతో గ్రామం వుంది.

**డబ్బీరు :** డబ్బర్ గంజాంజిల్లా లోవుంది దాని రూపాంతరమేమో తెలియరాదు

**డహాళ :** శా శ 1337 నాటి సింహాచల శాసనంలో ఒక డహాళ లఖవునాయని ప్రస్తావన వుంది గ్రామనామం కావచ్చును.

**డాకమారి :** శా.శ 1271 నాటి సింహాచలం శాసనంలో ఒక డాకమారి సంకమనాయని ప్రస్తావన గలదు. శాసనాలలో ద్రక్షరామం డాకరేమిగా ప్రస్తావింపబడింది డాక శబ్దంపై మారి చేరియుండవచ్చును గ్రామనామాలపై నేని, నాయుడు చేరినవి ముందు చెప్పబడ్డాయి

**డేగల :** పక్షి సూచకంగా డేగ తెలిసిందే. గృహనామంగా దీనిని సమసింపలేము. డేగల అనేది ఒక రకం గడ్డి కూడా. మంగళగిరికి సమీపంలోని బేతపూడికి డేగల బేతపూడి అని శాసనస్థ వ్యవహారం. ఈ వివక్షకు కారణం. బేతపూడి పేరుతో మరికొన్ని గ్రామాలుండడం. కాగా డేగల పేరుతో డేగలపాలెం, డేగలబుడ్డిని అనేగ్రామాలు విశాఖజిల్లాలోను, డేగపూడి అనేగ్రామం నెల్లూరుజిల్లాలోను వున్నాయి శా శ 1440నాటి పెదకాకాని శాసనంలో ఒక డేగల పెదవీరాభక్తుడు పేర్కొనబడ్డాడు.

**డొక్కు :** ఇది ఒకరకం గడ్డిమొక్క, డోకి పర్రులో గల డోకి ఇదే. ఈ పదం పూర్వపదంగా శ్రీకాకుళం గంజాం జిల్లాల్లో గ్రామాలున్నాయి.

**డోకిపర్తి :** డోకిపర్రుకు ఔపవిభక్తిక రూపం. ఈ పేరుతో గ్రామాలు గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలో కృష్ణాజిల్లా బందరుతాలూకాలలో వున్నాయి

**తంగిరాల:** గుంటూరుజిల్లా వినుకొండ తాలూకాలో వుంది తంగిరాల వీరరాఘవయ్య ప్రముఖులు

**తటవర్తి:** తటివర్రు అనే గ్రామం కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాలో వుంది

**తడపనేని:** వ్యక్తినామం తడ అప్పల కలయిక తడప్ప తడ శబ్దానికర్థం ఆపుట తడగట్టుట అంటే నిరోధించుట తడ అనేది నెల్లూరు జిల్లా గ్రామం సరిహద్దు (రాజ్యానికి) అని అర్థం తడప్పఅంటే ఆగ్రామ నామ సంబంధి వ్యక్తినామం.

**తప్పెట :** తప్పెట్ల అనేగ్రామం కడపతాలూకాలో వుంది తప్పెట వారిపల్లె కదిరి తాలూకాలోవుంది

**తమ్మనేని - తమ్మినాయని:** వ్యక్తినామం శా శ 1296 నాటి సింహాచలం శాసనంలో ఒక తమ్మినాయక పురాయి నాయని ప్రస్తావన వుంది తమ్మయ అంటే తమ్ముడు. తమ్మినేని సీతారాం ప్రముఖులు

**తమ్మిలి:** శా శ 1218 నాటి పాలకొల్లు శాసనంలో ఒక తమ్మిలి భీమయరెడ్డి ప్రస్తావన వుంది.

**తరిగొండ :** చిత్తూరుజిల్లా వాయల్పాడు తాలూకాగ్రామం. తరిగొండ వెంగమాంబ కవయిత్రి

**తరిమెల :** కమ్యూనిష్టు నాయకుల్లో ప్రముఖుడైన నాగిరెడ్డి గారి ఇంటిపేరు. ఇది అనంతపురం జిల్లాలోని గ్రామం

**తలశిల :** గ్రామనామం కావచ్చు శీల అనేగ్రామం తూర్పుగోదావరి జిల్లాలో వుంది చరిత్రలో శిలావంశం వారున్నారు

**తలారి :** తలవరి వ్యవహారంలో తలారి అయింది వధ్యస్థానంలో శిక్షను అమలుజరిపే వానిగా రూఢమైంది కాని నిజానికి, శాంతి భద్రతలను పర్యవేక్షించే అధికారశ్రేణిలోని ఒక ప్రధానమైన పదవి ఇది. శా శ 1219 నాటి శాసనంలో ఒక తలారి పిచ్చయ్య పేర్కొనబడ్డాడు.

**తల్లపనేని :** తల్ల అప్పల కలయిక తల్లప్ప తల, శిరస్సు, అనే అర్థంలో తెలిసిందే ఇదికాక ముఖ్యము, ముఖ్యుడు, ప్రధానుడు అని అర్థాలు కూడా దీనికి చెల్లివస్తాయి. తమ బిడ్డ గొప్పవాడుకావాలనే ఆకాంక్షతో ఇలా పేర్లు పెట్టుకుంటారు పశ్చిమ గోదావరి జిల్లా శాసనాల్లో ఒక తల్లప నీండు ప్రస్తావింపబడ్డాడు వ్యక్తినామం శా శ 1199 నాటి పాలకొల్లు శాసనంలో ఒక తల్లపనేని ప్రస్తావన వుంది అప్పటి వారి గృహనామ సూరాసాని.

**తల్లాప్రగడ:** ఇచ్చటి తల్ల శబ్దం తల్లి అంటే ప్రధాన మనే అర్థంలో వ్యవహృతం తల్లయ, తల్లమ్మ అనేవి వ్యక్తి నామాలుగా చరిత్ర కాలంలో వ్యవహారంలో వున్నాయి. శా.శ 1332 నాటి అహోబిలం శాసనాల్లో ఒక ఉంద్రాజు తల్లాపెగ్గడ ప్రస్తావనవుంది

**తాటిపాముల:** గ్రామనామం తెలంగాణా గ్రామం కొలనుపాక శాసనాల్లో ప్రస్తావితము.

**తాడంకి** : కృష్ణాజిల్లా గన్నవరం తాలూకా గ్రామం దీని మరోరూపం తానంకి తాడంకి వారి భక్తి గేయాలు ప్రసిద్ధము

**తాడి** : విశాఖజిల్లా అనకాపల్లి తాలూకాగ్రామం దీని మరోరూపం తానంకి

**తాడిగొట్ల** : కడప తాలూకా గ్రామం తాడిగొట్ల రామచంద్రాపురం కడపతాలూకాలో వుంది

**తాడిపర్తి** : గ్రామనామం సినీనటి శారద గృహనామం ఇదే.

**తాడువాయి** : కృష్ణాజిల్లా నందిగామ తాలూకా గ్రామం.

**తాడేపల్లి** : ఈ పేరుతో చాలాగ్రామాలున్నాయి ఉదాహరణకు విజయవాడకు సమీపంలో ఒకటి, మంగళగిరికి సమీపంలో ఒకటి, కృష్ణాజిల్లా దివితాలూకా కొడాలికి సమీపంలో ఒకటివున్నాయి మానస బోధ శతక కర్త తాడేపల్లి పానకాల రాయకవి

**తాండ్ర** : తాండ్ర పాపారాయుడు చారిత్రక వ్యక్తి గొప్పవీరుడు బొబ్బిలి రాజవంశం వారి బంధువు తాండ్ర అనేది విశాఖజిల్లా గ్రామం మామిడి రసాన్ని తాండ్ర చేయడం తెలుసు అయితే అది వేరు ఈ తాండ్ర ఒకచెట్టు పేరు

**తాతపూడి** : రామచంద్రపురం తాలూకాగ్రామం నరసరావుపేట తాలూకాలో కూడా వుంది.

**తాతా** : వ్యక్తినామం తాతయ్య

**తానికొండ** : గ్రామనామం తానికొండల వారి పల్లె చంద్రగిరితాలూకాలో వుంది

**తాపీ** : ఈ ఇంటిపేరుగల వారిలో ప్రముఖులు, చేమకూర విరచిత విజయవిలాసానికి హృదయోల్లాస వ్యాఖ్య సంతరించిన ధర్మారావు గారు ఇది తాపీ పనిచేయడం వలననే తమ కిది ఇంటిపేరయిందని, మొదట వీరి ఇంటిపేరు బండి లేక బందారు అని, అప్పట్లో, ఆ కుటుంబాలవారు, సైన్యంలో పనిచేసేవారని, వీరి తాతగారు లక్ష్మయ్యగారు, అలా కాక తాపీపనిలో ప్రవేశించారని, ఆ కారణంగా అయనను తాపీ లక్ష్మయ్య అనేవారిని తన తండ్రిగారిని బళ్లోవేసినపుడు, ఆ లక్ష్మయ్యగారి కుమారునిగా తాపీ అప్పన్న వ్రాసారని, అలా అదే తమకు ఇంటి పేరయిందని, వారువ్రాసుకున్న దానిని బట్టి తెలుస్తుంది తాపీ అనేది, భవన నిర్మాణ కార్యంలో ఉపయోగించే పనిముట్టు

**తామాడ** : చీపురుపల్లి తాలూకాగ్రామం తామాడ చిట్టబ్బాయి ప్రముఖులు.

**తాళ్ల** : శా శ 1262 నాటి నాటి సింహాచలం శాసనంలో వసిష్ఠగోత్రజుడైన ఒక తాళ్ల తిరుపడి నాయని ప్రస్తావన గలదు

**తాళ్లపాక** : అన్నమాచార్యుల స్వగ్రామం తాళ్లపాక . అది వారి ఇంటిపేరుకూడ ఈ గ్రామం కడపజిల్లా రాజంపేట తాలూకాలో వుంది శా శ 1468 నాటి నరసరావుపేట తాలూకా మిన్నెకల్లు శాసనంలో తాళ్లపాక తిరుమల్లయ్యంగారి కుమారుడు అన్నమయ్యగారి ప్రస్తావన వుంది భరధ్వాజగోత్ర, అశ్వలాయన సూత్ర, ఋక్శాఖాధ్యాయిగా ఇతడు చెప్పబడ్డాడు

**తిప్పాభట్ల:** భట్టు శబ్దంవల ఇది బ్రాహ్మణ కుటుంబాలకు పరిమితమైన గృహనామంగా విదితము. ఇది వ్యక్తి నామ సూచి భట్టు శబ్దానికర్థం, పండిత బ్రాహ్మణుడు అయితే స్తోత్రపారాలు చేసే, వందికులం వారికి కూడా ఇది చెల్లిపస్తుంది ఇక తిప్పశబ్దం తెలుగువారి పేర్లలో కూడా కన్పిస్తుంది దీని మూల శబ్దం త్రిపుర త్రిపురారి లేక త్రిపురాంతకుడు అంటే పరమేశ్వరుడు ఈ రెండు శబ్దాలలోని చివరి శబ్దాలు (అరి, అంతకుడు) లోపించి త్రిపురశబ్దం మాత్రమే మిగిలి, అది వ్యవహారంలో తిప్పశబ్దంగా స్థిరపడింది హరవిలాస కృతిని అంకితం పొందిన అవచి తిప్పయ్యశెట్టి సాహితీ విద్యార్థులకు పరిచితుడు త్రిపురాన, త్రిపురనేని, త్రిపురారి భట్లలోనిది కూడా ఇదే అయితే ఇక్కడ మూలశబ్దమే నిలిచింది

**తిప్పావఝుల:** తిప్ప త్రిపురాంతక శబ్దభవం ద్రాక్షారామ శాసనాల్లో ఒక తిప్పావఝుల ప్రస్తావన వుంది అప్పటివారి ఇంటిపేరు, ముష్టూరి వశిష్ట గోత్రం ఈయన కుమారుడు గౌతమజోశ్యులు

**తిప్పిరెడ్డి:** తిప్ప శబ్దం త్రిపురాంతక శబ్దభవం శా శ.1334 నాటి ఇంకొల్లు శాసనంలో ఒక తిప్పిరెడ్డి మాచెమరెడ్డి ప్రస్తావన గలదు

**తిమ్మావఝుల:** తిమ్మ తిరుమల శబ్ద భవం దానిపై వఝుల కోదండరామయ్య ప్రముఖులు

**తిరుమంజనం :** శా శ 1507 నాటి చిన్న అహోబిలం శాసనంలో తిరుమంజనం తెచ్చేవారి ప్రస్తావన వుంది. లక్ష్మీదేవి అమ్మవారి కోవిల నుండి తిరుమంజనం తెచ్చేవారి. తోమాలలు గట్టే వారి ప్రస్తావన కూడ వుంది. తిరుమంజనం స్నపన క్రియ

**తిరుమణి:** వైష్ణవులు పెట్టుకునే బొట్టును తిరుమణి అనడం కద్దు అయితే చెంగల్పట్టు తాలూకాలో ఈ పేరుతో ఒకగ్రామం వుంది

**తిరుమలనంబి:** దేవాలయానికి సంబంధించిన అన్ని పనులు నిర్వహించే అధికారిగా క్రీ శ. 1478కి చెందిన శాసనాలలో ఒక తిరుమలనంబి శ్రీరామయ్యగారు ప్రస్తావింపబడ్డారు. ఇక్కడ ఇది వ్యక్తినామం. అంటే శ్రీరామయ్యగారి తండ్రి తిరుమల ప్రసిద్ధ విష్ణుక్షేత్రంగా తెలిసిందే అయితే వ్యక్తినామాల్లో కూడ స్థలనామాలు చోటు చేసికున్నాయి. నంబి వైష్ణవసంప్రదాయానికి చెందిన బిరుదనామం నంబి అంటే, సాధారణ అర్థం శివార్చకుడు. అయితే భగవంతుడు, భక్తుడు, దైవదాసుడు అనే అర్థాలు కూడా వున్నాయి. ఇక్కడ దాసుడు, భక్తుడు అనే అర్థాలు గ్రహించాలి.

**తిరువీధుల:** ఉత్సవ సమయాల్లో దేవుడు ఊరేగి వచ్చి వెళ్ళే వీధులను తిరువీధులంటారు శా.శ. 1482 నాటి పెద్ద అహోబిలం శాసనంలో దేవుడు ఊరేగే వీధులను తిరువీధులుగా చెప్పడం జరిగింది "రమతో మహోన్నత రథమెక్కి తిరు వీధులెప్పుడేతెంతువో చెప్పుమయ్య' అంటాడు కాసుల పురుషోత్తమ కవి ఆంధ్ర నాయక శతకంలో. అయితే, విష్ణు సంబంధమైన ఊరేగింపులకే ఇది వర్తిస్తుంది. అలా ఊరేగింపు వచ్చే ఏ గ్రామపు తిరు వీధికో, ఈ కుటుంబాలవారు చెందివుంటారు. తిరువీధిపాడు అనే గ్రామం నెల్లూరు జిల్లా కోవూరు తాలూకాలో వుంది. తిరువీధి కుప్పం అనే గ్రామం చిత్తూరు తాలూకాలో వుంది.

**తీడ**: అనకాపల్లె తాలూకాలో వుంది

**తీర్పరి**: తీర్పు చెప్పువాడు కాగా సమర్దుడు, నిర్వాహకుడు అనే అర్థాలను కూడా గ్రహింపవచ్చు. శా శ 1321 సింహాచలం శాసనంలో ఒక తీర్పరి చింగమనేడు ప్రసక్తి వుంది

**తుడుం**: పార్వతీపురం తాలూకాగ్రామం

**తుపాకుల**: గ్రామనామ పూర్వపదం తుపాకుల వారి గుంట చంద్రగిరి తాలూకాలో వుంది

**తుమరాడ**: బొబ్బిలి తాలూకాగ్రామం.

**తుమ్మపాల**: విశాఖజిల్లా అనకాపల్లి తాలూకాగ్రామం.

**తుమ్మపూడి**: తెనాలి తాలూకాగ్రామం

**తురగా - తురకా**: తురగాపల్లె అనే గ్రామం తెలంగాణంలో వుంది అయితే ఇది తురక (Turk) శబ్దసంబంధికాదు

**తుర్లపాటి**: తుర్లపాడుకు ఔపవిభక్తకరూపం. ఈ గ్రామం బాపట్ల తాలూకాలో వుంది.

**తులసి**: గుణుపురం ఏజెన్సీగ్రామం.

**తూనుగుంట**: ప్రకాశంజిల్లా కందుకూరు తాలూకాగ్రామం

**తూమాటి - తూబాటి, తూము**: తూము ఈ ఇంటి పేరుతో ప్రసిద్ధులు తూమాటి దొణప్ప. తూమాడు అనే గ్రామం కందుకూరుతాలూకాలోను, తూబాడు అనే గ్రామం నరసరావుపేట తాలూకాలోను వున్నాయి వాటిఔపవిభక్తిక రూపాలు తూమాటి, తూబాటి అనేవి. తూము అనేది కూడ గృహనామంగా వుంది తూములూరు అనేగ్రామం కూడా వుంది తూము నీటిసరఫరాలో ఉపయోగించేది కాదు. ఇది ఒకరకం గడ్డి తూము నరసింహదాసు కీర్తనలు ప్రసిద్ధము తూమాటి గొల్లలు ఒక జాతి జనులు. తూమాటి దొణప్ప ప్రముఖులు

**తెన్నేటి**: తెన్నేరుకు ఔపవిభక్తికరూపం బెజవాడ తాలూకాగ్రామం. తెన్నేటి విశ్వనాధంగారు ప్రసిద్ధులు. లతగా పరిచయమైన ప్రముఖరచయిత్రి నిజనామం తెన్నేటి హేమలత.

**తెలికి - తెలికిచర్ల**: తెలికి అనేగ్రామం కడపజిల్లా పులివెందుల తాలూకాలో వుంది తెలికిచర్ల అనేగ్రామం, పశ్చిమగోదావరిజిల్లా, తాడేపల్లిగూడెం తాలూకాలో వుంది

**తెల్లాకుల**: ఇది వైశ్యులలో గృహనామంగా వుంది శా శ 1515 నాటి మంగళగిరి శాసనంలో కూడా తెల్లాకులవారు కోమట్లుగానే చెప్పబడ్డారు అర్థపరంగా తెల్లాకులు అంటే తమలపాకులలోని ఒక భేదం ఈ అర్ధంలో క్రీడాభిరామంలో వ్యవహరింపబడింది బహుశా, దీనికి సంబంధించిన టోకు వ్యాపారులను సూచించేదిగా, ఇది వ్యవహారంలోనికి వచ్చివుండవచ్చు. లేదా ప్రభువుకు, తమలపాకులను వాడికగా సరఫరా చేసేవారు కూడా కావచ్చును తెలంగాణంలోని మక్తల శాసనాల్లో వీటిని శ్వేతతాంబూల పర్ణములని చెప్పబడింది

**తేనీగల :** తేనీగల వాండ్లపల్లె మదనపల్లి తాలూకాలో వుంది

**తేళ్ల:** ఇది జంతుసూచి కాదు తేడ, త్యాడ అనేది ఒక చెట్టు దాని బహువచనం తేళ త్యాడ అనే రైలు స్టేషన్‌ను అరకు వెళ్లే మార్గంలో ఉంది త్యాళ్లూరు అనే గ్రామం గుంటూరు జిల్లాలో ఉంది

**తొట్టెంపూడి :** బాపట్ల తాలూకాగ్రామం.

**తొండ :** సరీసృపాలలోని పాకే జంతువుగా తొండ తెలిసిందే కాని గృహ నామానికి ఆకరమైన తొండకు దీనికి సంబంధం లేదు అలాగే ఏనుగుకు అవయవమైన తొండానికి కూడా సంబంధంలేదు తొండలం అనేది ఒకరకం కలుపుమొక్క తొండంగి అని కూడా అంటారు తొండలగూడ (రాయఘడ), తొండవాడ (చంద్రగిరి తాలూకా), తొండమనాడు (కాళహస్తి), తొండలదిన్నె (ప్రొద్దుటూరు), తొండంగి (తుని) గ్రామాల్లో కనిపించే తొండ గడ్డినే సూచిస్తుంది నిజానికి కాళహస్తి నుండి కంచి వరకుగల ప్రాంతాన్ని తొండమనాడు అంటారు. అన్నమయ్య కీర్తించిన తొండమాన్ చక్రవర్తి ఈ ప్రాంతాన్ని ఏలినవాడే ఈ ప్రాంతానికాపేరు రావడానికి కారణమైనది కూడా ఒక రకం మొక్క (Cephalandra indica)

**తొండెపు - తొండపి :** తొండపి అనేగ్రామం గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాగ్రామం తొండెపు అని కూడ గృహనామంగా వ్రాస్తున్నారు

**తొండమనాటి :** ప్రాంతనామం. కాళహస్తికి దిగువ కంచివరకు గల ప్రాంతం. తొండమనాడు. తొండమనాటి నారాయణరెడ్డి ఖంద్రిక తిరుత్తని తాలూకాలో వుంది

**తొలచి :** శ. 1114 నాటి ముఖలింగం శాసనాలలో ఒక తొలచి సోమినాయకుని ప్రస్తావన వుంది. తులసికి వికృతి. తులసి అనేగ్రామం మల్కనగిరి ఏజెన్సీలోవుంది.

**తోట :** గ్రామనామ పూర్వపదసూచి. తోటపల్లి అనే గ్రామముంది తోట తిమ్మయపల్లి తోటవారిపల్లె అనే గ్రామాలు. చంద్రగిరి తాలూకాలో వుంది. తోట నరసయ్య జండా వీరునిగా ప్రఖ్యాతి పొందారు.

**తోటకూర :** అర్థము స్పష్టము తోటకూరపాలెం ఎల్లవరం తాలూకాగ్రామం. మరోగ్రామం పెద్దాపురం తాలూకాలోవుంది

**తోటపల్లె :** గ్రామనామం. తోటపల్లె శాస్త్రులు ఖంద్రిక పుత్తూరు తాలూకాలో వుంది.

**తోడేళ్ల :** గ్రామనామ ప్రథమావయవం. తోడేండ్లపల్లి శిరువెళ్ల తాలూకాగ్రామం.

**తోలేరు - తోలేటి :** తోలు ఏరు కలయిక తోలేరు. దాని ఔపవిభక్తిక రూపం తోలేటి. తోలేరు భీమవరం తాలూకా గ్రామం. తోలుకోడు అనే గ్రామం కృష్ణాజిల్లాలో వుంది. రెండుచోట్లా తోలు శబ్దం ప్రవాహశబ్దాలపై చేరడం గమనార్హం. దీనిని బట్టి ఇది చర్మ సంబంధి అని చెప్పడం కుదరదు. చర్మ సంబంధమైన తోలు, సంస్కృత పదం త్వచ్,

త్వక్ శబ్దసంబంధి గ్రామ నామాల్లోని తోలు దేశీయశబ్దం. ఇది ఒక రకం గడ్డి. శా శ 1309 వాటి హిందుపురం తాలూకా మేడిరెడ్డి పల్లి శాసనాల్లో ఒక తోలేటి దేవోజు ప్రస్తావనవుంది

**త్రిపురనేని - తిపిర్నేని:** చూడు తిప్పాభట్ల త్రిపురనేని రామస్వామి చౌదరి ప్రముఖులు

**త్రిపురాన:** చూడు తిప్పాభట్ల

**త్రిపురారి భట్ల:** చూడు. తిప్పాభట్ల

**దగ్గుమిల్లి:** కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాలో వుంది.

**దగ్గుపల్లి:** ప్రకాశం జిల్లా గ్రామం.

**దగ్గుబాటి:** దగ్గుబాడుకు ఔపవిభక్తిక రూపం దగ్గుబాటి రామానాయుడు ప్రముఖ సినీదర్శకులు.

**దండమూడి:** గుంటూరు జిల్లా గ్రామనామం రాజగోపాలరావు ప్రముఖులు

**దండు:** దండువారిపల్లె అనేగ్రామం కదిరి తాలూకాలోవుంది

**దండు:** దండువారిపల్లె చిత్తూరుజిల్లా గ్రామం దండు శివరామరాజు రాజకీయ నాయకులు.

**దత్తి:** గజపతినగరం, శృంగవరపుకోట తాలూకాలలో ఈ పేరుతో గ్రామాలున్నాయి

**దద్దనాల:** మార్కాపురం తాలూకాగ్రామం కర్నూలుజిల్లా శిరువెళ్ల తాలూకాలో కూడా ఈ పేరుతో గ్రామముంది

**దంతికంటి:** దంతికల్లును ఔప విభక్తికరూపం శా శ 1496 నాటి శ్రీశైలం శాసనంలో ఒక దంతికంటి లింగపన్న ప్రస్తావన వుంది ఇతడు రామరాజయ్య దేవమహారాజుల కార్యకర్త

**దంతులూరి:** దంతలూరు అనే గ్రామం గుంటూరుజిల్లా తెనాలి తాలూకాలో వుంది వ్యవహారంలో దంతులూరి అని ఔపవిభక్తిక రూపాన్ని పొందింది దంతులూరి గన్నాభూపాలుడు అమరావతి నేలిన ప్రభువు

**దరిశి:** ఇది ప్రకాశం జిల్లా గ్రామం ఇంకా ఇసుక దర్శి అనే గ్రామం కూడ ఈ జిల్లాలో వుంది. దరిశిపర్రు అనే గ్రామం, పశ్చిమగోదావరి జిల్లా, తాడేపల్లిగూడెం తాలూకాలో వుంది గదర్ పార్టీ వ్యవస్థాపకులు దరిశి చెంచయ్య పరిచితులే

**దరువూరి:** దరువూరుపై ఔపవిభకిక రూపం. దరూరు అనేగ్రామం బళ్లారి జిల్లా శిరుగుప్ప తాలూకలో వుంది ఈ గృహనామంతో బాగా పరిచయమైనవారు, ప్రముఖ స్వాంతంత్ర్య సమర యోధులు దరువూరి వీరయ్యగారు.

**దర్ఫ - దర్భా:** రాయఘధ ఏజెన్సీ గ్రామం. దర్భావారి ఖండ్రిక అనేగ్రామం కాళహస్తి తాలూకాలో వుంది దర్భావారి అగ్రహారం అనే గ్రామం బద్వేలు తాలూకాలో వుంది.

**దళవాయి :** సైనిక అధికారశ్రేణిలో ఒకపదవి. దివితాలూకా శ్రీకాకుళం శాసనాల్లో, రాయసంకొండమరుసయ్యంగారి కార్యకర్త శింగరసుంగారి కుమారునిగా ఒక దళవాయి నాగరుసు ప్రస్తావింపబడ్డాడు. దళవాయిపల్లె చిత్తూరుజిల్లా గ్రామం.

**దశిక :** ఇది దశక శబ్దం నుండి వ్యుత్పన్నమైనది. పది, పది భాగాలు అని అర్థాలు. ఋగ్వేద ప్రాతిశాఖ్యలు, మనుధర్మశాస్త్రం, చంధఃశాస్త్ర సంబంధంగా ఈ ఇంటిపేరు స్థిరపడి వుండవచ్చును. కాశికావృత్తి, కామందక నీతి శాస్త్రాలకు చెంది యుండవచ్చు. అంటే ఆయా శాస్త్రాలతోటి వారికి గల సంబంధాన్ని తెలిపే దిశగా ఆ కుటుంబీకులకు గృహ నామం యుండవచ్చు. ఈ ఇంటిపేరు బ్రాహ్మణుల్లో కన్పించడం, పై అర్థాలకు స్ఫూర్తినిస్తుంది.

**దసవందం - దశబంధం - దశబంధాల :** ఇది నీటి నిర్వహణానికి సంబంధించినది. వెనుకటి కాలాల్లో చెరువుల నిర్వహణ మరమ్మతులు నిర్వహించడానికి గ్రామంలోని ఒకవ్యక్తిని నియోగించేవారు. ఆ చెరువు ఆయకట్టు క్రిందగల భూమిని దశబంధం చేసి, కొన్ని రకాల పన్నులు వేసేవారు. ఆ ఆదాయంతో వాటిని నిర్వహించేవారు. నిర్వహించే వ్యక్తికి పన్ను నుండి మినహాయింపు వుండేది. ఆ నిర్వహణంగావించే వారు దశబంధంవారుగా వ్యవహరింపబడినారు. శా.శ. 1319 నాటి హిందూపురం తాలూకా మేడిరెడ్డి పల్లె గ్రామ శాసనాలో ఒక దసవందము సింగయ ప్రస్తావనవుంది. శా.శ. 1300 నాటి సింహాచలం శాసనంలో ఒక దశబంధాల చలవు నంబ్యాళ ప్రస్తావన గలదు. అంతేగాక దశబంధానకు ఏర్పాటుచేసిన మాడలు 8 అని చెప్పబడింది.

**దాట్ల :** చూడు దాడి. దీని ఔపవిభక్తిక రూపం దాట్ల.

**దాడి :** శా.శ. 1132 నాటి అమరావతి శాసనంలో ఒక దాడి కొమ్మిరెడ్డి పేర్కొనబడ్డాడు. ఇతరులను ఎదుర్కోవడంగా దాడికి అర్థంవుంది. అయితే గృహనామపరంగా దీనిని ఆవిధంగా అనువర్తింపచేయలేము. కారణం, అరదాడి, కోదాడు మొదలైన గ్రామనామాలు అడ్డువస్తాయి. బహుశా దాడి ఒక గ్రామనామమేమో తెలియరాదు. దాడి వీరభద్రరావు మంత్రిగా పనిచేశారు.

**దాదెం :** వ్యక్తినామం. దాది, అమ్మల కలయిక దాదెమ్మ. దాది అంటే పిల్లలను సాకడం. కాని ఈ అర్థం ఇక్కడ పోసగరు. దామలూరు అనేగ్రామంవుంది. దాని పూర్వపదం గృహనామం అయింది. దాదినేనిపల్లె అనేగ్రామంవుంది. దాదెం వారి పల్లె అనే గ్రామం కదిరి తాలూకాలో వుంది.

**దానం :** ఈ పేరు గలగ్రామం దక్షిణ ఆర్కాడుజిల్లా తిరుక్కోయిలూరు తాలూకాలో వుంది.

**దామంచెర్ల:** రాజంపేట తాలూకా గ్రామం. దామంచెర్ల ఆంజనేయులు మంత్రిగాపని చేశారు.

**దామోదరం :** వ్యక్తినామం. కాగా గంజాం జిల్లాలో గ్రామనామం. దామోదరుడు విష్ణువు; దామోదరం సంజీవయ్య ముఖ్యమంత్రిగా పనిజేసారు.

**దారపురెడ్డి :** ఇదివ్యక్తినామం. శా.శ.1148 నాటి ద్రాక్షారామ శాసనంలో ఒక కొండిపర్తి దారపురెడ్డి పేర్కొనబడ్డాడు. శా.శ 1075 నాటి శాసనంలో పెరువంటి దారపరాజు పేర్కొనబడ్డాడు. దీనిని బట్టి దారప శబ్దం వ్యక్తినామాల్లో ఆనాడు విరివిగా చోటు చేసికుందని భావింపవచ్చును. ధార శబ్దం నుండి వ్యుత్పన్నము.

**దాలిపర్తి :** గ్రామనామం. దాలిపర్తి పిచ్చహరి నాదస్వర విద్వాంసులు.

**దావులూరి :** దావులూరి పేరుతో కృష్ణా గుంటూరు జిల్లాల్లో గ్రామాలున్నాయి. ఇది దాని ఔపవిభక్తిక రూపం. దావులూరి రామకోటయ్య నాగార్జున విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా పనిచేశారు.

**దాసరి :** దాసరి గంగిశెట్టిపల్లె చంద్రగిరి తాలూకాలో వుంది. దాసరి నారాయణరావు ప్రముఖ సినీ దర్శకులు.

**దాసి :** ఇది దాస సంబంధమైనది కాదు. ఇది ఒక చెట్టు పేరు. దాసిమాని పల్లె అనేగ్రామం కంగుంది డివిజన్‌లో వుంది.

**దాసినేని - దాసినాయని:** దాసిశబ్ద సంబంధి, శా.శ 1302 నాటి సింహాచల శాసనంలో ఒక దాసినాయని అనపోతనాయని ప్రస్తావన వుంది. కాగా దాసి ఒకగ్రామం కూడా.

**దిగవల్లి :** కృష్ణాజిల్లా నూజివీడు తాలూకాగ్రామం. దిగవల్లి వెంకట శివరావు ప్రముఖులు. దిగవల్లి వెంకట సుబ్బారావు తెలుగు విశ్వవిద్యాలయ రిజిస్ట్రారుగా పనిచేశారు.

**దిగుమర్తి :** దిగుమర్రుపై ఔపవిభక్తిక రూపం. ఈ పేరుగల గ్రామం పశ్చిమగోదావరి జిల్లా నరసాపురం తాలూకాలో వుంది.

**దిట్టకవి :** కవిత్వంలో దిట్టలైనవారు. అమరావతి శాసనాలలో దీని ప్రస్తావన వుంది. దిట్టకవి ప్రసిద్ధిగల తిక్కన సత్కవిసార్వభౌముండే, యెట్టనినంగ్గవిత్వమున నెవ్వరు వీనికి నీడుగామిన్'. శాసనకాలములేదు.

**దింటకుర్తి :** గుడివాడ తాలూకాలో దింటకుర్రు పేరుతో రెండు గ్రామాలున్నాయి.

**దిండి :** దిండినారి తాళ్లవలస భీమునిపట్నం తాలూకాగ్రామం. చూడు. దిండు.

**దిండు - దిండ్ల - దిడ్ల :** తలదిండు తెలిసిందే. కాని ఇంటి పేరులోని దిండుకు, తలదిండులోని దిండుకు ఏమీ సంబంధం లేదు. దీని పూర్వ రూపం దిండి. ఇదొక గ్రామ నామం. కృష్ణా జిల్లా దివి తాలూకాలో సముద్ర సబద్దై సమీపాన వుంది. ఈ దిండి, దిండు, రెండు శబ్దాలకు అర్థం ఎత్తైనది అని. బహువచనం చేరి దిండుల, దిండ్లగా కూడా మారి దిడ్లగా స్థిరపడి గృహనామంగా ప్రవర్తిస్తోంది. కలిదిండి అనేగ్రామం కూడా కృష్ణా జిల్లాలో వుంది.

**దివాకర్ల - దివాకరుని :** దివాకరుడు అంటే సూర్యుడు. గుంటూరుజిల్లా వలివేరు శాసనాల్లో ఒక దివాకరపెద్దేరి ప్రస్తావన వుంది. దివాకర్ల తిరుపతి శాస్త్రి ప్రముఖ కవి.

**దివ్యనాయక:** సింహాచలం శాసనం ఒకదానిలో ఒక దివ్యనాయక పెద్ది నాయని ప్రస్తావన గలదు.

**దివ్వెల:** దీపం, జ్యోతి అనే అర్థంలో దివ్వెకు వ్యవహారముంది. అయితే పెద్దాపురం తాలూకాలోని దివిల అనేగ్రామనామం దివ్వెలకావడానికి అవకాశముంది. అలాగే దిమిల అనే గ్రామం కూడా వుంది.

**దీపాల :** నరకచతుర్దశి మరునాడు రోజున దీపావళి పండుగ జరుపుకోవడం తెలిసిందే. గృహ నామానికి, పండుగకు ఏమీ సంబంధం లేదు. ఇదొక ఊరి పేరు. శ్రీకాకుళం జిల్లాలో వుంది. ఇక్కడ దీపశబ్దం 'జ్యోతి' సంబంధం కాదు. ఇదొక రకం గడ్డి. దీపాల ఇంటి పేరు, ఊరి పేరు నుంచి వచ్చిందే. దీపావళి పేరుతో రెండు గ్రామాలు శ్రీకాకుళం, గంజాం జిల్లాల్లో వున్నాయి. దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు ప్రముఖ రచయిత.

**దుగ్గినేని:** దుగ్గినేడి : వ్యక్తినామం. చూడు దుగ్గిరాల.

**దుగ్గిరాల:** ఈ పేరుతో గుంటూరుజిల్లా తెనాలి తాలూకా, పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు తాలూకాలో గ్రామాలున్నాయి. దుగ్గి, కి పూర్వరూపం దుర్గి. ఈ పేరుతో ఒక గ్రామం గుంటూరుజిల్లా పల్నాడు తలూకాలో ఉంది. అయితే, దేవతాసంబంధమైన దుర్గతోకాని కోట అనే భావనలోని దుర్గం శబ్దంతోకాని సంబంధమున్నది కాదు. ఇది ఒక రకం మొక్క, గుంటూరుజిల్లా దుగ్గిరాల, దుగ్గిరాలపూండిగా శాసనాల్లో ప్రస్తావితమైనది. అనగా రేలజాతి మొక్కల్లో ఇది ఒకటి. అది ఇక్కడ రాల అయింది. కొన్నిచోట్ల రేవులకు సంకేతంగా నిలచింది. రామదండు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు బాగాపరిచయస్థులు.

**దుద్దెపూడి:** గ్రామనామం. శా.శ 1180 నాటి పాలకొల్లు శాసనంలో ఒక దుద్దెపూడి కొమ్మనబోయని ప్రస్తావన వుంది.

**దుర్గం:** కోట కల్యాణ దుర్గం, రాయదుర్గం గ్రామాలున్నాయి. శా.శ. 1565నాటి కోయిల కుంట్ల శాసనంలో దుర్గం తిమ్మాజి పంతులు ప్రస్తావనవుంది.

**దుర్గి:** గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాగ్రామం.

**దుర్వాసుల:** పురాణ సాహిత్యంలో పరిచయమున్న వారికి దూర్వాస ముని పరిచయస్థుడే. ఆ మహర్షి సంప్రదాయానికి చెందిన వారుగా, ఈ గృహనామం కలిగిన వారిని భావించే అవకాశముంది. అయితే దూర్వేసి అనే గ్రామము కర్నూలు జిల్లా నంద్యాల తాలూకాలో వుంది. దానిపై బహువచన ప్రత్యయం చేరి ఇంటి పేరుగా స్థిరపడి యుండవచ్చు. దుర్వాస ఒక రకం గడ్డిగా తెలిసిందే.

**దువ్వినేని:** గ్రామనామ నాయకపరంగా వచ్చింది. దువ్వ అనే గ్రామం పశ్చిమగోదావరి జిల్లాలో వుంది.

**దూపాడు (టి) - దుప్పటి :** కర్నూలు తాలూకాగ్రామం. ఈ పేరుగల మరో గ్రామం ప్రకాశంజిల్లా మార్కాపురం తాలూకాలో వుంది ఈ ప్రాంతాన్ని దూపాటిసీమ అని వ్యవహరించేవారు. ఇదే వ్యవహారంలో దుప్పటి అయింది.

**దూల :** శ శ 1075 నాటి కాకినాడ తాలూకా భీమవరం శాసనంలో ఒక దూలసింగన ప్రస్తావన గలదు.

**దూశి :** శ్రీకాకుళంజిల్లా గ్రామం

**దేవ :** పశ్చిమగోదావరి జిల్లా నరసాపురం తాలూకాగ్రామం. ఇది దైవసంబంధమైన పదం కాదు దేవనుప్పలపాడు, దేవదొడ్డి, దేవసముద్రం దేవపట్ల అనే గ్రామాలు కూడ వున్నాయి. ఇది ఒకరకం మొక్క

**దేవకి :** శ్రీకృష్ణుని తల్లి. శా శ. 1338 నాటి సింహాచల శాసనంలో ఒక దేవకి పాపినాయని ప్రస్తావన గలదు దేవకి వాడ అనేగ్రామం రాజాంతాలూకాలోవుంది

**దేవభక్తుని :** శా శ 1475 నాటి చేబ్రోలు శాసనంలో దేవాభక్తుని కొండన ప్రసక్తి వుంది అతడు ఆ గ్రామాధిపతిగాను, అచ్చట కుమారస్వామిని ప్రతిష్ఠించినట్టుగాను చెప్పబడింది సామాన్యార్థం తెలిసిందే చోడబత్తిన వారున్నారు దానితో పోల్చినపుడు వీరు ప్రతాపరుద్రదేవుని కొలిచిన వారు కావచ్చును అమ్మంగదేవుడు కూడ ప్రభువు

**దేవరకొండ :** దేవరకొండ వాయల్పాడు తాలూకాలో వుంది శా శ 1329 నాటి సింహాచలం శాసనంలో గాయిగోపాలుడైన ఒక దేవరకొండ వేదగిరి నాయని ప్రస్తావన వుంది

**దేవర పల్లి :** తెలిదేవరపల్లె అనే గ్రామం విజయవాడ తాలూకాలో ఉంది

**దేవరసెట్టి :** శా శ 1338 నాటి సింహాచల శాసనంలో వైశ్యుడైన ఒక దేవరసెట్టి మంకయ ప్రస్తావన వుంది

**దేవాడ :** చీపురుపల్లె శృంగవరపుకోట తాలూకాలలో ఈ పేరుతో గ్రామాలున్నాయి.

**దేవినాయక :** వ్యక్తినామం శాశ 1313 నాటి సింహాచలం శాసనంలో ఒక దేవినాయక అల్లాడనాథనంబ్యాళ ప్రస్తావన వుంది

**దేవినేని :** వ్యక్తినామం. శా శ 1423 నాటి నందలూరు శాసనంలో ఒక దేవినేని ప్రస్తావన వుంది అతడు సన్నపనాయని దేవినేనిగా చెప్పబడ్డాడు ఇతని కుమారుడు పర్వతనాయడు

**దేవిశెట్టి :** దేవి శబ్దంపై శెట్టి చేరింది. వ్యక్తినామం. వైశ్యుల గృహనామం ద్రాక్షారామ శాసనాల్లో పేరూరి దేవిశెట్టి ప్రస్తావన గలదు శా శ. 1541 నాటి చిన్న అహోబిలం శాసనంలో దేవిశెట్టి మల్లశెట్టి ప్రస్తావన వుంది తెనాలి తాలూకా జంపని, (శా శ 1181 నాటి) శాసనంలో ఒక దేవిసెట్టి ప్రస్తావన వుంది. ఇతడు బలిజగా చెప్పబడ్డాడు

**దేవుదల :** రాజాంతాలూకాగ్రామం పాలకొండ తాలూకాలో మరోగ్రామం వుంది తెలంగాణంలో మరోగ్రామం వుంది.

**దేవులపల్లె :** దేవలపల్లె అనే గ్రామం వాయల్పాడు తాలూకాలో వుంది దేవులపల్లె రామిరెడ్డి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది దేవులపల్లి కృష్ణశాస్త్రి ప్రముఖులు.

**దేవోజు :** దేవ ఓజుల కలయికతో దేవోజు సిద్ధమైంది. ఓజు ఒజ్జ శబ్దనుండి ఉత్పన్నము. దానికి మూలం ఉపాధ్యాయపదం ఇది వఝగా కూడా పరిణమించింది ఓజు శబ్దం ముఖ్యంగా స్వర్ణకారుల కుటుంబాలలో కన్పిస్తుంది. నందిగామ తాలూకా నడిగూడెం (శా శ. 1222) శాసనంలో ఒక అగసాల దేవోజు ప్రస్తావనవుంది అగసాల అంటే స్వర్ణకారుడు.

**దేశపాత్రుని :** వ్యక్తినామం ఔప విభక్తిక రూపం దేశపాత్రుని పాలెం అనకాపల్లె తాలూకాలో వుంది

**దేశంశెట్టి - దేశట్టి - దేసటి :** వ్యక్తినామం కాకినాడ తాలూకా భీమవరం శాసనంలో ఒక దేశం శెట్టి పృధ్విశెట్టి ప్రస్తావన కలదు.

**దేశి - దేసు :** దేశీయుడు అని అర్థం. అయితే వ్యాపారులలో, సముద్రవ్యాపారులు, దేశి వ్యాపారులు సంచారవ్యాపారులు అనే వివక్ష వుండేది శా శ 1161 నాటి గుంటూరు శాసనాల్లో ఒక దేశి మారినాయుడు పేర్కొనబడ్డాడు

**దేశిభట్ల :** దేచయ అనేది వ్యక్తినామం.

**దేశిరాజు:** ఇది వ్యక్తి నామపదంగా వచ్చిన ఇంటిపేరు సంస్కృత శబ్దం 'దేశ' ఈ పదానికి ప్రాంతము, చోటు అనే అర్థాలున్నాయి దేశిక శబ్దానికి గురువు, ఉపాధ్యాయుడు ( ముఖ్యంగా ఆధ్యాత్మికోపదేశం గావించేవారు) అనే అర్థాలు వున్నాయి బ్రాహ్మణేతర కులాలకు సంబంధించిన పురోహితులకు కూడా దేశిక శబ్దం బిరుదు నామంగా చెల్లివస్తుంది. వ్యాపారికి, మఠాధిపతికి, యాత్రికునకు, విదేశీయునికి, వైష్ణవాచార్యునికి కూడా దేశిక శబ్దం వర్తిస్తుంది వైశ్యకులంలో దేసు ఇంటిపేరు గలవారు వున్నారు మహారాష్ట్ర బ్రాహ్మణుల్లో ఒక తెగకు దేశస్థ బ్రాహ్మణులని పేరు

ఇక తేజస్సు అనే సంస్కృత శబ్దం కూడా కన్నడంలో దేశి అయింది. ఈ శబ్దానికి, అందగాడు, విలాసవంతముగా జీవించేవారు (సుఖభోగి) అనే అర్థాలున్నాయి దేశిరాజులోని దేశి శబ్దం ఉపాధ్యాయుడు అనే అర్థంలోగాని, తేజస్సంబంధమైన కన్నడ శబ్దార్థంలోంచి వచ్చి యుండవచ్చు. దేశ శబ్దం వ్యవహారపరంగా శైవసాహిత్యంలో కన్పిస్తుంది దేచవరం అనే గ్రామం కూడా వుంది దేసింగ శబ్దం మాత్రం దేవసింగ నుండి ఉత్పన్నమైంది దేవతా శ్రేష్ఠుడు అని అర్థం శివునికి కన్నడంలో దేసింగరాయడనే వ్యవహారముంది

రాజు శబ్దం ప్రభువు, అధిపతి అనే అర్థాల్లో తెలిసిందే ఇంటి పేర్లలో కన్పించే రాజు, అధికారార్థ సంబంధి ముఖ్యంగా ఇలాంటి గృహనామాలు తెలుగునాట నియోగి బ్రాహ్మణుల్లో అధికం మరి-వారే నిన్న మొన్నటివరకు ప్రధానంగా గ్రామాధికారులు.

**దేసటి :** బైరానిపల్లి (నల్గొండజిల్లా) శాసనంలో ఒక దేచిటమల్లిరెడ్డి ప్రస్తావన వుంది

**ధైద** : గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా గ్రామం

**దొడ్డ** : దొడ్డమంచి అనేగ్రామం సేలంజిల్లా హోసూరు తాలూకాలో వుంది

**దొడ్డపనేని:** దొడ్డప, దొడ్డ అప్పల కలయిక, దొడ్డ ఆధిక్యము పెద్ద అనే అర్థాల్లో వర్తిస్తుంది పెద్ద తల్లిని దొడ్డమ్మ అనే వాడుక బ్రాహ్మణ కుటుంబాల్లో కనిపిస్తుంది అప్ప అంటే తండ్రి పూజ్యార్థకంలో కూడా వ్యవహారముంది రాయలసీమ జిల్లాల్లో వ్యక్తినామాంత్య పదంగా గోచరిస్తుంది ఈ ఇంటిపేరు గల కుటుంబాలకు దొడ్డపనాయుడు మూల పురుషుడు అప్పటికి అయన ఇంటిపేరు ఏదోవున్నా ఈతడు ప్రఖ్యాతి చెందినవాడు కావడాన, తరువాతి వారికి అతడు మూలపురుషుడై, అతని పేరే ఇంటిపేరయింది ఈ 'నేని' కుటుంబాలు కాకతీయుల కాలం నుండి ప్రసిద్ధిలోనికి వచ్చాయి. శాసనాల్లో (నాదిండ్ల) ఒక దొడ్డపనాయకుడు పేర్కొనబడ్డాడు అతడు పోతన సోమయాజి కుమారునిగా చెప్పబడ్డాడు. అయితే బ్రాహ్మణేతరుల్లోని దొడ్డపనేని వారికి ఇతడు ఆద్యుడుకాదు ఈ ఉదాహరణ కేవలం దొడ్డపనాయకుడు అనే పేరు వ్యాప్తిలో ఉన్నదని చెప్పడానికి సంకేతంగా గ్రహింపబడింది దొడ్డపనేని ఇందిర ప్రముఖులు

**దొడ్డిపెద్ది** : వ్యక్తినామం. దొడ్డశబ్ద దొడ్డిగా పరిణమించింది శా శ 1216 నాటి పాలకొల్లు శాసనంలో ఒక దొడ్డిపెద్దింగారి కామన కుప్పెన ప్రస్తావన వుంది అలా కాక దొడ్డి గ్రామనామ ద్వితీయావయవం కూడా దీనికి మూలం గావిచ్చు

**దొడ్డారెడ్డి** : దొడ్డ అంటే పెద్ద అని అర్థం గొప్ప అనికూడా ఇది వ్యక్తినామం 13వ శతాబ్దినాటి గుంటూరు జిల్లా కాజ శాసనంలో ఒక దొడ్డారెడ్డి వేమారెడ్డి ప్రస్తావింపబడ్డాడు

**దొడ్ల** : ఇది దొడ్డికి బహువచనం పశువులను మందవేసే స్థలాన్ని, ఇంటి వెనుకగల స్థలాన్ని, గడ్డి వాములు పెట్టే స్థలాన్ని, ఇలా ప్రత్యేకంగా కేటాయింపబడిన కొంత స్థలాన్ని దొడ్డి అని అంటాము అయితే ఒకరికి చెందిన ఏక ఖండపు భూభాగాన్ని కూడా దొడ్డి అనడం జరుగుతుంది గ్రామనామల్లో కూడా అబ్బేదొడ్డి, అబ్బిగాని దొడ్డి అనేవి వున్నాయి

శా శ 1489కి చెందిన ఒక కొండవీడు శాసనంలో దొడ్ల ఇంటిపేరుతో ఒక నరసయ్యపేర్కొన బడ్డాడు

**దొండపూడి** : గ్రామనామం శా శ 1324 నాటి పాలకొల్లు శాసనంలో ఒక దొండపూడి సింగన ప్రస్తావన వుంది

**దొన్ని** : దోని దొన్ని అనేవి గ్రామనామాంత్యపదాలుగా వున్నాయి. దొన్ని బొమ్మి రెడ్డి బయలు అనేగ్రామం పుత్తూరు తాలూకాలో వుంది.

**దొప్పలపూడి** : గుంటూరుజిల్లా బాపట్ల తాలూకాగ్రామం

**దొమ్మర** : ఒక జాతి జనులు దొమ్మర తిప్పనపల్లె కంగుంది డివిజన్‌లో వుంది దొమ్మర నంద్యాల అనే గ్రామం కూడా వుంది

**దొర :** ప్రభువును దొర అనడం కద్దు కాగా దొరలు ఒకజాతి జనులు దొరవారి పాలెం గూడూరు తాలూకాలో వుంది

**దోచిరాజు :** వ్యక్తినామం. గుంటూరుజిల్లా బొప్పూడి శాసనంలో దోచిరాజు గణపయ ప్రస్తావనవుంది బహుశా దేశ, దేచ, దోచగా మారి వుండవచ్చు

**దోరణాల - దోర్నాల :** మార్కాపురం తాలూకాగ్రామం.

**దోరపసెట్టి :** వ్యక్తినామం దోరపపెట్టి కేతసాని అనే ఆమె ప్రస్తావన సంహాచలం శాసనంలో వుంది ద్వారా అనే గ్రామ నామం దోరగా పరిణమించింది

**దోరమసెట్టి :** వ్యక్తినామం చూడు దోరపసెట్టి శా శ. 1326 నాటి సింహాచల శాసనంలో ఒక దోరమ సెట్టి సింగమరెడ్డి ప్రస్తావన వుంది

**ద్రోణంరాజు :** వ్యక్తినామం. ద్రోణాచార్య నుండి వచ్చివుండవచ్చు.

**ద్రోణాది :** శా శ. 1071 నాటి బాపట్లశాసనంలో ఒక ద్రోణాది వేమెనాయకుని ప్రస్తావన వుంది ద్రోణాదుల గ్రామనామం.

**ద్వాదశి:** శుక్ల, కృష్ణ పక్షాల్లో పన్నెండవ తిథిని ద్వాదశి అంటారు. ఇది ఇంటిపేరుగా గల బ్రాహ్మణ కుటుంబాలున్నాయి వ్రతాలలో ద్వాదశ వ్రతమొకటి. అది పాటించడం వలన వారికి ఆ పేరు ఇంటిపేరుగా వచ్చియుండవచ్చు. ద్వాదశ పత్రక అనేది ఒక యోగం. 12 రాశులతోను, 12 మాసాలతోను సంబంధం కలిగి 12 అక్షరాలున్న మంత్రం ఓం నమో భగవతే వాసుదేవాయ అనే మంత్రం. ద్వాదశ మహాకావ్య మనేది వేదాంత గ్రంథాల్లో ఒకటి ఉపనిషత్సంబంధమైన 12 పవిత్రోచ్చారణలకు (తత్త్వమసి, అహంబ్రహ్మాస్మి మొ వి ) ద్వాదశ మహావాక్యమని పేరు జైమినీ మీమాంసకు ద్వాదశాధ్యాయి అని పేరు వీటిలో దేనిపైనైనా అధికారం కలిగిన వారికి ద్వాదశి ఇంటిపేరుగా వచ్చివుండే అవకాశముంది.

**ద్విభాష్యం:** భాష్యం అంటే వివరించడమనేది సామాన్యార్థం కాగా శాస్త్రాదికాలకు చెప్పిన వ్యాఖ్యానం భాష్యమనేది విశిష్టార్థం. పాణినీయ సూత్రాలకు పతంజలి చేసిన వ్యాఖ్యానం మహాభాష్యం. ఇక్కడ ద్విభాష్య శబ్దం సామాన్యార్థంలోనే ప్రవర్తిస్తోంది అంటే రెండు విధాలైన వ్యాఖ్యానాలు చెప్పడంకాక, ఒకదానిని రెండవ దానిలోనికి అనూదితం చేయడం. సామాన్యార్థంలో చెప్పాలంటే అనువదించడం. ఈ పదమే జన వ్యవహారంలో దుబాసి అయింది అంగ్లేయ పాలకులవద్ద, వారికి తెలుగును, అంగ్లంలోనికి, వారు మాట్లాడిన అంగ్లాన్ని దేశీయులకు తెలుగులోనికి అనువాదం చేసే ఉద్యోగులుండేవారు. వారిని దుబాసీలనేవారు. నిజానికి ఈ దుబాసి (రెండు భాషలు మాట్లాడేవారు, ద్విభాషి) కి సంస్కృతీకరణమే ద్విభాష్యం. అంతే తప్ప రెండు విధాలైన భాష్యం చెప్పేవారని అర్థం చెప్తే అది ఉత్కర్ష కలిగింపక, అపకర్షనే కలిగిస్తుంది ఇక రెండింటికి వ్యాఖ్యానం చెప్పిన వారని చెప్పడం చెల్లిరాదు. కాంద్రేగుల జోగిపంతులు అంగ్లేయుల మనసు కెక్కిన (మచిలీపట్నం కౌన్సిల్) ద్విభాషి. ఇతను చేసిన సేవలకు ప్రతిఫలంగా దివిసీమను వీరి

కుటుంబానికివ్వడం జరిగింది అయితే ఈ పదవిని దుర్వినియోగం చేసినవారు లేకపోలేదు బుస్సీదొర దగ్గర కూడా ఒక దుబాసి వుండేవాడు ఇలాంటి అనువాదక కుటుంబాలకు అనంతర కాలంలో ద్విభాష్యం గృహనామమైంది నాదిండ్ల శాసనాల్లో ఒక దుబాసి పర్వతుడు పేర్కొనబడ్డాడు

**ధారా** : ధారపాలెం అనేగ్రామం గొలుగొండ తాలూకాల్లో వుంది ఈ యింటిపేరుకు ఇది మూలం కావచ్చును

**ధూళిపూడి** : గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాగ్రామం

**ధూళిపాళ్ల** : ఇది గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాగ్రామం ఈ గృహనామంతో సినీనటులు ఒకరున్నారు

**నక్క** : గ్రామనామ ప్రథమావయవంశా శ 1163 నాటి ఎనమలకుదురు శాసనంలో నక్కమల్లెబోయని ప్రస్తావన వుంది. నక్కవాని పల్లె వాయల్పాడు తాలూకాలో వుంది

**నంగినేని:** వ్యక్తినామం నంగనాచి అనే పదం వ్యవహారంలో వుంది తెలిసి కూడా తెలియనట్లు అమాయకత్వం ప్రదర్శించేవారిని అలా అనడం జరుగుతుంది. అలాగే అడిగినదానికి, తెలిసికూడ మాటదాటవేసి మాట్లాడటాన్ని నంగిగా మాట్లాడడం అంటారు నాచ్చి అనే తమిళశబ్దానికి స్త్రీ అని అర్థం నంగశబ్దంకూడా తమిళంనుండి వచ్చినదే నంగు అంటే ముందుచెప్పిన అర్థమే నంగనాచి ఇలా వచ్చింది అయితే నంగై పదానికర్థం విశేషప్రాధాన్యంగల స్త్రీ అని, కోడలు, వదిన అనే అర్థాలు వున్నాయి అయితే శ్రీనాథుడు నంగ శబ్దాన్ని స్త్రీపరంగా వ్యక్తి నామంగా హరవిలాసంలో ప్రయోగించాడు ప్రత్యేకతగల అనే అర్థంలో తెలుగులోనికి ముఖ్యంగా వ్యక్తినామాల్లో ప్రవర్తించి యుండవచ్చును నేని నాయక శబ్దభావం

**నడకుదుటి** : నడకుదురు పై ఔపవిభక్తికరూపం ఈ పేరుతో తూర్పుగోదావరిజిల్లా కాకినాడ తాలూకాలోను, కృష్ణాజల్లా దివి తాలూకాలోను గ్రామాలున్నాయి రెండు ప్రవాహాలు కలిసే చోటు కుదురు

**నడిగడ్డ** : గ్రామనామం నడిగడ్డ తిమ్మనపల్లె మదనపల్లి తాలూకాలో వుంది

**నడిపినేని - నడిపినాయుని** : వ్యక్తినామం నడిపినాయని చీనేపల్లె కంగుంది డివిజన్‌లో వుంది నడిమి శబ్దపుజీపవిభక్తి కరూపం నడిమి. నడింపల్లె పేరులో గ్రామాలూన్నాయి ఆగ్రామపు నాయకుడు అనే భావనలో వచ్చియుండవచ్చును

**నడిమింటి** : నడుమ ఇల్లు ఔపవిభక్తిక రూపం. ఒకే ఇంటిపేరుగల కుటుంబాలు వరుసగా మూడు వుండడం వల్ల వచ్చిందేమో తెలియరాదు. సర్వమంగళశాస్త్రి ప్రముఖులు

**నడింపల్లి** : గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా గ్రామం. నడింపల్లి నరసింహారావు పంతులు గారు ప్రసిద్ధులు. నడింపల్లి వారి ఖండ్రిక దరిశి తాలూకాలో వుంది.

**నడుపూరు (రి)** : విజయనగరం తాలూకాగ్రామం

**నంద :** సాలూరు తాలూకాగ్రామం

**నందమూరి:** ఇది మన ముఖ్యమంత్రిగా వ్యవహరించిన తారకరామారావు గారి ఇంటిపేరుగా అందరికీ తెలిసిందే నందమూరు పేరుతో కృష్ణాజిల్లాలో రెండు గ్రామాలున్నాయి ఒకటి గుడివాడ తాలూకాలో, రెండవది గన్నవరం తాలూకాలో ఇందులో ఏ గ్రామం నుండైనా ఈ ఇంటి పేరుగల కుటుంబాలవారు ఇతర గ్రామాలకు వలస వెళ్ళియుంటారు.

నంద అనేది ఒక రకం గడ్డి ఈ నంద శబ్దంతో ఇంకా చాలా గ్రామాలున్నాయి. నందలూరు, నందలపూడి మొదలైనవి ఇలా గ్రామ నామం తోనే గాక వ్యస్తంగా 'నందం' అనేది కూడా ఇంటి పేరుగా కన్పిస్తుంది. అంటే మొదట నందం అనేదే ఊరు పేరుగా వుండి, తరువాత ఆ గడ్డి అధికంగా గల చోట్ల, స్థానిక నైసర్గిక కారణలవలన మరి ఇతర కారణాలవలన పూడి, పల్లి, ఊరు అనేవి చేరి గ్రామనామాలేర్పడ్డాయి ఇలాంటిదే ఆకిరి ఇది కూడా ఇంటిపేరుగా కన్పిస్తుంది

**నందవరపు :** నందవరం గ్రామనామపు ఔపవిభక్తిక రూపం. శా శ 1386 నాటి శాయింపేట శాసనంలో శ్రీవత్సగోత్ర నందవరపు వీరాయొఝుల ప్రస్తావన వుంది

**నందిగామ - నందిగం :** కృష్ణాజిల్లా రెండుగ్రామాలున్నాయి. నందిగం అనేగ్రామం కూడ వుంది.

**నందిపాటి :** నందిపాడు అనేగ్రామం ప్రకాశంజిల్లాలో వుంది

**నంద్యాల :** కర్నూలు జిల్లాగ్రామం. శా.శ 1465 నాటి కోయిలకుంట్ల శాసనంలో ఒక నంద్యేల నరసింగయ్య దేవమహారాజుల ప్రస్తావన వుంది ఇతడు సోమవంశోద్భవునిగా, అత్రేయసగోత్రజునిగా చెప్పడం జరిగింది.

**నన్నపనేని:** నేని, నాయక శబ్దం నుండి వ్యుత్పన్నము, ఈ 'నేని' అంతమందు గలవన్నీ వ్యక్తి నామాలని, వారంతా కాకతీయులవద్ద ఉద్యోగులుగా పనిచేశారని ముందు చెప్పడం జరిగింది నన్నప్ప, నన్న అప్పలకలయిక, అట్లే నన్నయ నన్న అయ్య, ఆంధ్ర మహాభారతకర్త నన్నయ తెలుగువారికి ప్రాతః స్మరణీయుడు ఈ నన్న శబ్దానికి తెలుగులో కుఱచ, పొట్టి అనే అర్థాలు కన్పిస్తాయి కన్నడంలో ప్రేమ, ఆదరణ, అనుబంధము, చక్కనైన అనే అర్థాలు, తమిళంలో నణి శబ్దానికి, దగ్గర, చేరిక, నణియావ్ అంటే దగ్గరివాడు అనేఅర్థాలు కన్పిస్తాయి. మొత్తం మీద గారాబము, ప్రేమ, కూరిమి, అందము అనే అర్థాలు ఈ శబ్దాని కున్నట్లు బోధపడుతుంది. ననుపుకాడు అనేపదం ప్రియుడు, స్నేహితుడు, కావలసినవారు అనే అర్థాల్లో సాహిత్యంలో కన్పిస్తుంది చిన్నపిల్లను తల్లిదండ్రులు, ఆత్మీయులైనవారు, ముద్దుగా నాని అని పిలవడం తెలిసిందేగదా 'నాని' ఏ భావనలో ఉపయోగపడుతోందో అదేభావనలో నన్న శబ్దం ఉపయోగపడుతోంది. దీనితో దగ్గర సామ్యం గల పదం నాన్న. ఇది నా, అన్నపదాల కలయిక. ఈ శబ్దం కూడ తండ్రి అనే అర్థంతోపాటు, ముద్దు, ప్రియము, కూర్మి అనే అర్థాల్లో ఉపయోగపడుతోంది గదా!

ఫలితార్థం, ముద్దు గొలిపేవారు, అందగాడు, ఇష్టమైన వారు అనే అర్థాల్లో ఇది వ్యక్తినామంగా, స్థిరపడిందని భావింపవచ్చు

**నమశ్శివాయ :** శా శ 1440 నాటి చేజెర్లశాసనంలో నమశ్శివాయవారు అనిచెప్పబడింది నమశ్శివాయపురం దరిశితాలూకాలోవుంది.

**నంబి :** శా శ. 1482 నాటి పలమనేరుతాలూకా కురుమావి శాసనంలో వైఖానససూత్రం యజుశ్శాఖాధ్యాయియైన ఒకనంబి తిమ్మయ ప్రస్తావన వుంది

**నంబూరి :** నంబూరు అనే గ్రామం గుంటూరు తాలూకా గ్రామం దాని ఔపవిభభక్తిక రూపం నంబూరి.

**నరవ - నరువ :** కొండ నడుమ భాగాన్ని, అంచును నరవ అంటారు. శా శ 1335 నాటి సింహాచలం శాసనంలో ఒక నరువ పెదియక్క ప్రస్తావన గలదు విశాఖ, విజయనగరం తాలూకాలలో ఈ పేరుతో గ్రామాలున్నాయి.

**నరసి :** శా శ 1342 నాటి సింహాచల శాసనంలో ఒక నరశి అప్పయ్య ప్రస్తావన వుంది

**నరహరిభట్ల :** వ్యక్తినామం. నరహరి నృసింహమూర్తి దానిపై భట్ల చేరింది

**నరుకుళ్ల :** ఇది గ్రామనామప్రథమావయవం నరుమళ్లపాడు అనేగ్రామం సత్తెనపల్లి, తిరువూరు తూలూకాల్లోవుంది

**నర్రా :** నర్రవాడ అనేగ్రామం నెల్లూరుజిల్లా ఉదయగిరి తాలూకాలో వుంది ఈ ఇంటిపేరుకు, గ్రామనామంలోని నర్ర కారణం కావచ్చు

**నలజాల :** గ్రామనామం

**నలపోతు - నలమోతు :** వ్యక్తినామం నల్ల, పోతు, పోతు పోతరాజు శబ్దంనుండి వచ్చింది నలపోతుల వారి పాలెం దరిశి తాలూకాలో వుంది

**నల్ల :** వర్ణవిశేషం శా శ 1221 నాటి అలంపురం శాసనంలో నల్ల గెస్సెట్టి ప్రస్తావన వుంది నల్లవెంగనపల్లె పుత్తూరు తాలూకాలో వుంది శా శ 1073 నాటి బాపట్ల శాసనంలో నల్లబప్పన ప్రస్తావన గలదు

**నల్లగట్ల :** గ్రామనామం. శిరివెళ్ల తాలూకాగ్రామం

**నల్లపనేని :** వ్యక్తినామం. నల్ల అప్ప నల్లప్ప నల్ల వర్ణసూచిగా వుంది కాగా నల్ల శబ్దానికి తమిళంగా బాగు, మేలైన అనే అర్థాలున్నాయి వ్యక్తినామంగా ఈ అర్థాన్నే సంయోజించడం సమంజసమని భావింపవచ్చును అప్ప తెలిసిందే.

**నల్లపరెడ్డి :** వ్యక్తినామం. నల్లప్పరెడ్డిగారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది

**నల్లూరి :** నల్లూరు పేరుతో చాలగ్రామాలున్నాయి అందొకటి గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాలో వుంది దాని ఔపవిభక్తిక రూపం నల్లూరి నల్లూరు పెరుమాళ్రాజు ఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది

**నవులూరు (రి)** గుంటూరుజిల్లా మంగళగిరి తాలూకా గ్రామం

**నాటకశాల** :నాటకశాలవారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది

**నాగండ్ల, - నాగళ్ల** : రెండురూపాల్లోను వ్యవహారముంది ఇదిబాపట్ల తాలూకా గ్రామం

**నాగంభొట్ల** : వ్యక్తినామం. నాగం నాగశబ్ద భవం భొట్ల - భట్లకు మారురూపం నాగంభొట్ల పాలెం దరిశితాలూకాలో వుంది.

**నాగభైరవ** : నాగశబ్దంపై భైరవ నాగభైరవ కోటేశ్వరరావు ప్రముఖ కవి, రచయిత

**నాదిండ్ల** : శాసనరూపం నాదెండ్ల ఇది నరసరావుపేట తాలూకాగ్రామం. శా శ 1443 నాటి గుంటూరుజిల్లా వేలూరు శాసనంలో నాదిండ్ల గోపమంత్రి ప్రస్తావన వుంది నాదెళ్లవారి ఖండ్రిక సూళూరు పేట తాలూకాగ్రామం.

**నామినేని** : నామనాయకుడు అనే వ్యక్తి నామంనుండి ఉత్పన్నము నామం అంటే పేరు అనేది సామాన్యార్థం. కాగా వైష్ణవ భక్తులు నుదుట పెట్టుకునే బొట్టును నామాలనడం విశేషార్థం. శ్రీ వేంకటేశ్వరస్వామిని నామాల దేవుడనడం కద్దు. వాటిని పెట్టుకోడంలో నామం ఉపయోగం వలన వాటికి ఆపేరు వచ్చి యుండవచ్చు. వ్యక్తినామాల్లోని నామశబ్దం భక్తి నేపథ్యంలోనే వచ్చింది. అలాంటి నామ నాయకుడు అనే పేరు నామినేనిగా రూపుదిద్దుకుంది. గుంటూరుజిల్లా మందపాడు గ్రామ శాసనంలో ఒక మందడినామి నాయకుని ప్రస్తావన వుంది. నామదేవుడు గొప్ప భక్తుడు.

**నామిరెడ్డి** : వ్యక్తినామం. శా శ. 1578 కల్యాణదుర్గం తాలూకా గంగవరం శాసనంలో ఒక నాగిరెడ్డి నాగిరెడ్డి ప్రస్తావన వుంది.

**నాయకంటి** : నాయకల్లుకు ఔపవిభక్తిక రూపం. కర్నూలు తాలూకాగ్రామం. నాయకంటి శంకరరెడ్డి ఈ గృహనామంతో ప్రముఖులు.

**నాయినేని** : వ్యక్తినామం. నాయి శబ్దం నాయకశబ్దపు సంక్షిప్తరూపం.

**నాయుడు - నాయుడి - నాయని - నాయిని** : నాయకుడు అనే శబ్దం నాయడుగా మారింది. దాని ఔపవిభక్తిక రూపాలు నాయుడి, నాయని, నాయిని అయింది కొన్ని సందర్భాలో నాయడు నీడిగాను, నీని, నేనిగాను రూపొందింది అని ముందు చెప్పడం జరిగింది. అయితే నాయడు అని వ్రాయడమే సరియైనది నాయుడు అని వ్రాయడం తప్పు తెలుగునాట ఇది ఒక వర్గం వారికి పేరుగా రూపొందింది. నెల్లూరు, చిత్తూరు, తమిళనాడుల్లో కమ్మవారు ఈ శబ్దంతో గుర్తింపబడుతుండగా, కోస్తా జిల్లాల్లో కాపువారికి ఇది వర్తిస్తోంది చిత్తూరు జిల్లాల్లో తిరిగి ఈ రెండు వర్గాల వారిలో వివక్ష కొరకు కమ్మనాయుడు, బలిజనాయుడు అని వ్యవహరింపబడుతోంది. ఉత్తరాంధ్రశాసనాల్లో, బ్రాహ్మణులతో సహా, ప్రముఖులైన వారందరిని నాయక శబ్దంతో సంభావించిన వైనం వుంది.

**నారణ:** నారాయణ శబ్దభవం శా శ1339 నాటి సింహాచల శాసనంలో ఒక నారణ గోమంతు నాయని ప్రస్తావన వుంది

**నారా:** వ్యక్తినామం నారాయణ శబ్ద సంక్షిప్త రూపం నారా ఈ గృహనామంతో చిత్తూరు జిల్లాలో నారావారిపల్లె అనేగ్రామంవుంది ఇది ఇప్పటి మన ముఖ్యమంత్రి చంద్రబాబు నాయనింగారి గృహనామం.

**నారిపెద్ది:** నారాయణశబ్ద భవం నారి. శా శ 1255 నాటి సింహాచల శాసనంలో ఒక నారిపెద్ది నరసింహ నాయకుని ప్రసక్తి వుంది ఇతడు నారి గ్రామపుపెద్ది గావచ్చును నారిగొచ్చ అనేగ్రామం గుంసూరుతాలూకాలోవుంది

**నారుమంచి:** గ్రామనామం

**నార్ని:** వ్యక్తినామం నారినకు సంక్షిప్తరూపమిది దీనికిమూలం నారినాయకుడు.

**నార్ల:** తెలంగాణంలో ఒకగ్రామం పేరు. కృష్ణా, గుంటూరుజిల్లాల్లో ఈ గృహనామంగల వారున్నారు. నార్ల ఇంటిపేరుగల వారి కుటుంబాలతో ఏర్పడిన గ్రామం నార్ల వారి ఖండ్రిక చిత్తూరుజిల్లాలో వుంది. నార్లవెంకటేశ్వరరావు ప్రముఖ పత్రికా సంపాదకులు.

**నాపూరు (రి):** నెల్లూరుజిల్లా ఆత్మకూరు తాలూకాగ్రామం

**నిడమర్తి - నిడుమర్తి:** వీనికి ఆకరమైనది నిడమర్రు అనేగ్రామం ఈ పేరుతో గ్రామాలు గుంటూరు జిల్లాలో ఒకటి, పశ్చిమగోదావరిజిల్లాలో మరొకటి వున్నాయి శాసనాలలో నిడుంబర్రుగా చెప్పబడింది.

**నిడిగంటి:** నిడిగల్లు అనే గ్రామం బొబ్బిలితాలూకాలో వుంది

**నిడుముక్కల:** ఈ గ్రామం గుంటూరుజిల్లాలో వుంది

**నిప్పాణి:** గ్రామనామం ప్రముఖ సినీనటి జమున గృహనామం ఇదే

**నిభానుపూడి:** కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా గ్రామం

**నిమ్మగడ్డ:** కృష్ణాజిల్లా దివితాలూకా గ్రామం. గొలుగొండ ఏజెన్సీలో మరో గ్రామం వుంది. నిమ్మగడ్డ రామమోహనరావు శాసన సభ్యులుగా పనిచేశారు.

**నిశ్శంక - నిశ్శంకర - నిశ్శంకరరావు:** శంకలేనివాడు నిశ్శంక అసమాన శౌర్యధైర్యములు కల వానిని, దానమునందు వెనుదీయని వానిని, చిత్తశుద్ధి గలవానిని నిశ్శంకగా చెప్పవచ్చును. నిశ్శంక కొమ్మన సాహితీలోకానికి పరిచయమైన చారిత్రక వ్యక్తి. అది నిశ్శంకర. ఆపై రావు చేరడం అనంతర కాలాన జరిగినవేమో తెలియరాదు శా.శ. 1386 నాటి సింహాచలం శాసనంలో ఒక నిసంక భాను దేవరాజు ప్రస్తావన వుంది. మరోశాసనంలో నిసంక భానుదేవ గజాధీశునిగా ప్రస్తావన కలదు.

**నీరుకట్టి:** ఇది వృత్తిపరంగా వచ్చిన ఇంటిపేరు. నీటిని పంపకం చేసే అధికారి. గ్రామాధికారి పర్యవేక్షణలో భూములకు, ఎక్కువ తక్కువలు కాకుండా పంపిణీ చేయడం ఇతని పని. చెరువు తూముల వద్ద గల ఇసుక మేటలు, చేరిన గడ్డీగాదం తీసి నీటి సరఫరాకు అడ్డంకి లేకుండా చేయడం ఇతని బాధ్యత. ఈ పనిచేసినందుకు ఇచ్చే మాన్యం నీరు కట్టు మాన్యం.

**నీరుకొండ :** గుంటూరుజిల్లా మంగళగిరి తాలూకాగ్రామం. నీరుకొండ రామారావు మంత్రిగా పనిచేశారు.

**నీలనేని :** అసలు పేరు నీలినాయకుడు. నీలము నవరత్నాల్లో ఒకటి. దివితాలూకా గణపేశ్వరం శాసనాల్లో ఒక పెదనీలి నాయకుడు. ప్రస్తావింపబడ్డాడు. ఇతడు కాకతీయుల శ్రీవాకిటి అంగరక్ష. వెలనాటిపై నాయంకరము గలవాడు.

**నీలం :** నీలం సంజీవరెడ్డి రాష్ట్రపతిగా పని చేశారు. వర్ణసూచి. లేదా గ్రామనామ ప్రథమావయవం గావచ్చును.

**నీలంరాజు :** వ్యక్తినామం. నీలం గ్రామనామ ప్రథమావయవం. నీలంరాజు వెంకట శేషయ్య పత్రికా సంపాదకులు.

**మున్న:** విజయవాడ తాలూకాగ్రామం.

**మున్నపర్తి :** సర్వసిద్ధి తాలూకాగ్రామం.

**ములక :** చోడవరం తాలూకాగ్రామం.

**నూకల :** నూకలపాలెం సూళూరు పేట తాలూకాగ్రామం కాగా నూకలవారి పాలెం దివితాలూకాలో వుంది. నూకల సత్యనారాయణ సంగీత విద్వాంసులు.

**నూతక్కి :** గుంటూరుజిల్లా మంగళగిరి తాలూకాగ్రామం. శాసనాల్లో నూదంకి, నూదెంకి గా ప్రస్తావితమైనాయి. నూతక్కి రామశేషయ్య ప్రముఖులు.

**నూతులపాటి :** నూతలపాడు అనే గ్రామం బాపట్ల తాలూకాలో వుంది. దానిపై ఔపవిభక్తిక రూపం నూతలపాటి. వ్యవహారంలో నూతులపాటి. ఇందలి నూయి బావి అనే అర్థంలో కాదు. నూతి అనే ఒక రకం గడ్డిమొక్క ఇందులో రకాలు ఉప్పు నూతుల, రావి నూతుల మొదలైనవి. ఈ పేరుతో కూడా గ్రామాలున్నాయి. అయితే సంతనూతలపాడు లోని సంత, గడ్డికాదు. అది సంత జరిగే గ్రామం కనుక ఆ పేరువచ్చింది.

**నెక్కంటి :** ఇది నెక్కల్లుపై ఔపవిభక్తికరూపం. దీని పూర్వరూపం నెక్కలం. అడవి నెక్కలం, జక్కులనెక్కలం అనేగ్రామాలు కృష్ణాజిల్లాలోను, నెక్కల్లు అనేగ్రామం గుంటూరుజిల్లాలోను వున్నాయి.

**నెన్నూరి :** నెర్నూరు, నెన్నూరుగా పరిణమించింది. నెర్నూరు రావూరు తాలూకాలోవుంది. నెన్నూరి వారిపల్లె చంద్రగిరితాలూకాలో వుంది.

**నెమలి - నెమలికంటి :** నెమలి పక్షులను పెంచడం వల్ల ఈ గృహనామం వచ్చిందనుకుంటే పొరపాటవుతుంది. నెమలి అనేగ్రామం కృష్ణాజిల్లాలో, శ్రీకాకుళం జిల్లాలో ఇంకా ఇతరచోట్ల వున్నాయి. అంతేగాక నెమలికల్లు, నెమళ్ల దిన్నె అనే గ్రామాలుకూడ

వున్నాయి. నెమలి కంటి అనేది నెమలి కల్లుకు ఔపవిభక్తక రూపం. గ్రామనామాల్లోని నెమలి, వృక్షసూచకం.

**నెమళ్లదిన్నె:** ఇందలి నెమళ్లు పక్షులు కావు. చెట్టుపేరు దిన్నె ఎత్తైనభూమి జమ్మలమడుగు తాలూకాగ్రామం

**నెల్లిగుండ్ల:** గ్రామనామం. నెల్లిగుండ్లవారి పల్లె చంద్రగిరితాలూకాలో వుంది

**నేతి:** నేయి (ఘృతము) కి ఔప విభక్తిక రూపంగా భావించి, దానిని ఎక్కువగా వినియోగించే వారికి ఈ ఇంటి పేరు స్థిరపడిందని చెప్పడం కలదు... తత్త్వ నిరూపణలో న + ఇతి అంటే ఇది కాదు, ఇది కాదు అని చెప్పే పద్ధతి ఒకటి వుంది. దానిని నేతి, నేతి వాద మంటారు అలా తత్త్వ నిరూపణం గావించేవారి కుటుంబాలకు ఇది గృహనామంగా స్థిరపడిందని చెప్పడం కూడా వుంది ఇది బ్రాహ్మణ కుటుంబాలలో కన్పించే గృహనామం. కనుక పై రెండూ సమంజసమైనవిగానే కన్పిస్తాయి కాని నేతి అనేది ఒక విధమైన ప్రాయశ్చిత ప్రక్రియ కూడా దారాన్ని ముక్కుగుండా జొనిపి నోటి ద్వారా లాగడం అనేది ఈ క్రియ. ఇది చేసేవారికి లేదా చేయించేవారికి ఈ గృహ నామం స్థిరపడిన అవకాశముంది ప్రకాశం జిల్లాలో నేతివారిపాలెం అనే గ్రామం కూడా కలదు అయితే నేతులూరు అనేగ్రామం భద్రాచలం ప్రాంతంలో వుంది అయినపుడు నేతి అనేది ఒకగడ్డి అవుతుంది శా శ 1197 నాటి గుంటూరుజిల్లా ఎనమదల గ్రామశాసనంలో ఒక నేతిమంచన ప్రస్తావన వుంది నేతేరు అనే గ్రామం. చీపురుపల్లి తాలూకాగ్రామం.

**నేదునూరు:** దీని ఔపవిభక్తికరూపం నేదునూరి ఈ పేరుగల గ్రామం తూర్పుగోదావరి జిల్లా చోడవరం తాలూకాలో వుంది జానపద సాహిత్యాన్ని పదిలపరచిన గంగాధరంగారు నేదునూరివారు

**నేమాన - నేమాని:** నియమ అనే సంస్కృత పదం నేమగా పరిణమించిందనే సంగతి తెలిసిందే ఈ నియమ శబ్దం కట్టడి అనుసరింపదగిన పద్ధతి విధి విధానము ఇలాంటి అర్థాల్లో ప్రవర్తిస్తుంది పదం సంస్కృతమే అయినా గృహనామమైన నేమాన మాత్రం తమిళం నుండి సంక్రమించింది నేమాన్ అంటే ఆదర్శప్రాయమైన ప్రవర్తన గలవాడని అర్థం. అది తెలుగులో నేమానగా రూపొందింది ఔపవిభక్తిక రూపం దాల్చి నేమాని అయింది ఈ గృహ నామం ప్రచురంగా బ్రాహ్మణ కుటుంబాల్లో కన్పిస్తుంది ఇతరుల్లో కూడా వుందేమో తెలియదు

**నేలటూరు(రి):** దీని ఔపవిభక్తిక రూపం నేలటూరి రెండు విధాలుగాను వ్యవహరించే వారున్నారు. ఈ పేరుతో నెల్లూరుజిల్లాలో గ్రామముంది కాగా ఎగువనేలటూరు, దిగువ నేలటూరు నేలటూరు అనే గ్రామాలు కడపజిల్లాలో వున్నాయి సాధారణంగా దీనిని నేల + ఊరు గా చెప్పి, మధ్యలో 'టు' గాగమం వచ్చిందని చెప్పడం కద్దు కాని నిజానికి అది నేల+టుర్రు మాత్రమే వ్యవహారంలో నేలటూరు అయింది నేల అనే శబ్దంతో నేలపాడు, నేలకొండపల్లి, అనే గ్రామాలు కూడా వున్నాయి నేల అంటే భూమి అని సామాన్యార్థం. కాగా గ్రామనామాల్లోని నేల అనేది ఒక మొక్కకు సంకేతం. నేలవేము, నేల చింతలతో పోల్చి చూడండి నేలటూరి వెంకట రమణయ్యగారు ప్రసిద్ధ పరిశోధకులు.

**పగడాల - పగిడాల :** పగిద్యాల నందికొట్కూరు తాలూకాగ్రామం

**పచ్చవ- పచ్చా :** ప్రకాశంజిల్లా కందుకూరు తాలూకాగ్రామం

**పచ్చిపులుసు:** వ్యంజన సూచి వేడిమితో పచనం చేయనవసరం లేని వ్యంజనం బెల్లం, చింతపండు పులుసు, ఉల్లిముక్కలు, ఎండుమిర్చితో తయారుచేస్తారు వేసవికాలంలో ఇది ప్రత్యేకత పొందుతుంది ఒకప్పటి వాతావరణ స్థితిలో కూరగాయలు దొరకని వేళ ఇది ప్రాధాన్యంవహించింది కుటుంబనామంగా వ్యవహారంలోనికి రావడానికి కారణాలు తెలియరావడం లేదు అంతేగాక ఇది ఏదో ఒక వర్గానికి మాత్రమే పరిమితంగా లేదు తెలిసినంతలో కమ్మవారిలో, వైశ్యులలో ఇది కన్పిస్తోంది మరి ఇతరులలో కూడ వుందేమో తెలియదు

**పచ్చర్ల -:** నంద్యాల తాలూకాగ్రామం

**పంచాగ్నుల :** ఇది బ్రాహ్మణ కుటుంబాలలో అందునా, వైదిక కుటుంబాలకు పరిమితమైన గృహనామం. అన్వాహార్యపచన లేక దక్షిణ, గార్హపత్య, అహవనీయ అనే మూడు అగ్నులనుత్రేతాగ్నులని, వాటితో సభ్య, ఆవస్థ్య అనే రెండింటిని చేర్చి పంచాగ్నులని సంకేతింపబడ్డాయి ఈ అయిదు అగ్నులను యధావిధిగా సంపూజించే వారు పంచాగ్నుల వారని చెప్పడం ఒక పద్ధతి పంచాగ్నులనే మాటను పంచ తపస్సులని వ్యవహరించడం కూడా ఉంది. ఈ అగ్నులు లేక తపస్సుల మానవదేహంలోనే వున్నాయని భావన ఈ అయిదు అగ్నుల (మానవదేహంలోని) ను గూర్చిన సిద్ధాంత జ్ఞానం కూడా పంచతపస్సు శబ్దంతో సంభావిస్తారు కనుక పంచాగ్నులను విధి విహితంగా వ్రేల్చే వారిని, లేదా వాటిని గూర్చిన సంపూర్ణజ్ఞానం కలిగిన వారిని గాని పంచాగ్నుల వారిగా సంభావించవచ్చు. పంచాగ్నుల మధ్య చేసే తపస్సును కూడా పంచతపస్సు అంటారు ఆ సందర్భంలో నాలుగు అగ్నులు నాలుగు దిశలలోను స్థాపించి, అయిదవ దానిని పై భాగాన (సూర్య) వున్నట్టు భావిస్తారు ఈగృహనామంతో ప్రసిద్ధి చెందిన వారు ఆదినారాయణశాస్త్రిగారు

**పంచాది :** గ్రామనామం. శా శ 1393 నాటి శ్రీకూర్మం శాసనాలలో ఒక పంచాది నారద నాయకుని ప్రసక్తి వుంది.

**పటువర్ధనం :** రాజాం, పాలకొండ తాలూకాలో ఈ పేరుతో గ్రామాలున్నవి.

**పట్టపు :** పట్టశబ్దం ప్రధానము, ముఖ్యము, ఎత్తు అనే అర్థాల్లో సంభావింపబడుతుంది. విజయవాడ సమీపంలోని పటమట గ్రామ నిజనామం పట్టమెట్ట అగ్నికులక్షత్రియుల్లో తమిళనాడు ప్రాంతంనుండి ఆంధ్ర తీరానికి తరలివచ్చిన వారిని పట్టపు వారు అనడం కద్దు అయితే ఈ గృహనామం శా.శ 1058నాటికే నమోదు అయింది. ద్రాక్షారామ శాసనంలో ఒక పట్టపు మల్లిసెట్టి పేర్కొనబడ్డాడు.

**పట్టమెట్ట :** గ్రామనామం. విజయవాడలోని పటమట నిజనామం పట్టమెట్ట.

**పట్టుచీర :** భద్రాచలం తాలూకాగ్రామం

**పట్నం :** గ్రామనామం, పెద్ద బస్తీని పట్నం అని వ్యవహరించడం జరుగుతుంది. కాని పట్నం శబ్దానికి నియమితమైన అర్థం వుంది సముద్రతీరాన రేవులు గల ఆవాసాలనే పట్నాలనాలి అయితే నదులతీరాన, పెద్ద జలాశయాల తీరాన గల వాటిని గూడ పట్న శబ్దంతో సంభావింపబడ్డాయి కళింగపట్నం, మచిలీపట్నం, నిజాంపట్నం సముద్రతీరాన గల వాటికి ఉదాహరణలు. పురుషోత్తమ పట్నం, శ్రీరంగపట్నాలు (మొదటిది చిలకలూరి పేట సమీపంలో వోగేరు నది ఒడ్డున వుంది. రెండవది తమిళనాడు కర్ణాటక రాష్ట్రాల్లో కావేరీనదీ తీరాన ఉన్నాయి) నదీ తీరాన గలవి మరో పురుషోత్తమపట్నం, విజయవాడకు సమీపాన ముస్తాబాదు పరిసరాల్లో పెద్దజలాశయం తీరాన వుంది పట్నం శేషయ్య ఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది

**పడకండ్ల - పడకంటి :** శిరివెళ్ల ఆత్మకూరు తాలూకాలలో పడకండ్ల పేరుతో గ్రామాలున్నాయి

**పడాల :** ఈ గ్రామం పశ్చిమగోదావరిజిల్లా తాడేపల్లి గూడెం తాలూకాలో వుంది

**పడిహారి - ఫడిహారం** పడిహారి అనేది రాజోద్యోగం దేవాలయానికి సంబంధించినది కూడా శా శ 1003 నాటి ద్రాక్షారామశాసనంలో భీమేశ్వర మహాదేవర పడిహారిగా దేవాంసు వామయ కుమారునిగా ఒక రుద్రయ పేర్కొనబడ్డాడు

**పణిదెం :** చేనేత వస్త్రాలకు ప్రసిద్ధిచెందిన ఈ గ్రామం గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలో వుంది

**పంటల :** పల్లపు వ్యవసాయవృత్తి సూచి నిజానికి పంట అనేది మెట్ట, మాగాణి రెంటికీ చెందినదే అయినా, మాగాణి ముఖ్యంగా వరిపంటకు పరిమితమయింది ఈ మేరకు జన వ్యవహారముంది రెడ్లలో పంటరెడ్లు ఒక తెగ ఇది ప్రధానంగా నెల్లూరుజిల్లా తీరప్రాంతానికి చెందినవారిని అనగా మాగాణి (వరిపంట) వ్యవసాయం చేసేవారికి పరిమితమైంది సమీపంలోని అల్లూరు పేరుగల రెండు గ్రామాలను ఆకుల అల్లూరు, పంటల అల్లూరుగా వ్యవహరిస్తున్నారు

**పండరంగి - పండ్రంగి :** రాజంపేట తాలూకా పొత్తపి శాసనంలో ఒక పండరంగి అనంతయ్య ప్రస్తావన వుంది ఆయన గ్రామకరణంగా చెప్పబడింది కోయిలకుంట్లలోని దేవుని, పండరంగ విరలేశ్వరునిగా కొలిచే వారు అని శాసనస్థ సాక్ష్యముంది పండ్రంగం అనేగ్రామం గూడూరు తాలూకాలోవుంది పాండ్రంగి అనేగ్రామం భీమునిపట్నం తాలూకాలోవుంది

**పండితారాధ్యుల :** తెలుగుసాహిత్యంతో పరిచయమున్నవారికి పాల్కురికి సోమన పండితారాధ్య చరితం బాగా తెలిసిందే పండిత ఆరాధ్యుల అనే పదాల కలయికతో ఇది ఏర్పడింది పండితుడంటే తెలిసిందే ఆరాధ్యుల అనేది శైవులకు చెల్లివచ్చే పౌరుషనామం పైవి ఆ శబ్దాల అర్థాలు మాత్రమే

పండిత అనే పేరుతో శైవధర్మాన్ని బోధించిన వారు ముప్పురు ప్రముఖ చారిత్రక వ్యక్తులున్నారు ఒకరు శ్రీపతి పండితారాధ్యులు. కాగా రెండవ వారు మల్లికార్జున పండితులు మూడవవారు శివలెంక మంచన పండితులు వీరు ముప్పురూ ఆరాధ్యులే వీరికి శ్రీశైల మల్లికార్జునస్వామి ఇష్టదైవం

ప్రముఖ తెలుగు సినీ గాయకులు S P. బాలసుబ్రహ్మణ్యంగారు శ్రీపతి పండితారాధ్యుల వంశానికి చెందినవారు కాగా, కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి అల్లుడు. శంభుప్రసాద్‌గారి ఇంటిపేరు శివలెంక మల్లికార్జున పండితారాధ్యుల వంశానికి చెందిన వారు మైసూరు ప్రాంతంలో వున్నారు

**పతివాడ :** భీమునిపట్నం తాలూకాగ్రామం

**పత్తికొండ :** కర్నూలు జిల్లాలో తాలూకా కేంద్రగ్రామం

**ప్రత్తిపాటి - పత్తిపాటి :** ప్రత్తిపాడు అనేగ్రామం గుంటూరుజిల్లాలో వుంది.

**పద్మనాభం :** భీమునిపట్నం తాలూకాగ్రామం.

**పనప్పాకం :** వైష్ణవుల్లో ఇది ఇంటిపేరుగా కన్పిస్తుంది. ఈ పేరుతో చిత్తూరు జిల్లా, చంద్రగిరి తాలూకాలో ఒక గ్రామం తిరుత్తని డివిజన్‌లో మరో గ్రామం వున్నాయి.

**పంతంగి :** సోంపేట తాలూకాగ్రామం

**పంతం :** గ్రామనామ ప్రథమావయవం. పంతం పద్మనాభం రాజకీయ నాయకులు.

**పందలపాక :** తూర్పుగోదావరి జిల్లా రామచంద్రాపురం తాలూకాగ్రామం వస్త్రపరిశ్రమకు,పేరు. శా శ 1034 నాటి ద్రాక్షారామ శాసనాల్లో ఒక పందల పాక భీమయ పేర్కొనబడ్డాడు.

**పత్రి :** గ్రామనామం. ఈ ఇంటిపేరు మధ్య బ్రాహ్మణ కుటుంబాలలో గలదు ఇతరులు కూడ వున్నారేమో తెలియదు పత్ర శబ్ద సంబంధిగా, పూజాదికాలలో ఉపయోగించే పత్రి తెలిసిందే. కాని ఈ ఇంటిపేరు పై విధంగా వచ్చి వుంటుందని భావించడం కష్టం. పత్రి అనే పేరుతో గ్రామం మహారాష్ట్రలోని మన్మాడ్‌కు చేరువలో వుంది. మధ్వ బ్రాహ్మణ కుటుంబాలు, కర్నాటకలోని ఉడుపి ప్రాంతం (మలనాడు) నుండి మహారాష్ట్రకు చేరి, ఆంధ్రదేశంలోనికి ప్రవేశించాయి. పత్రి పేరుతో మరో గ్రామం గంజాం జిల్లాలో వుంది.

**పప్పు :** గ్రామనామ ప్రథమావయవం పప్పూరు అనే గ్రామం అనంతపురం జిల్లాలో వుంది. పప్పుల వారిపల్లె ఉదయగిరి తాలూకాలో వుంది శా శ 1382 నాటి కడపజిల్లా చిలమకూరి గ్రామ శాసనంలో ఒక పప్పూరి గంగసాని ప్రస్తావనవుంది.

**పంపాది :** గ్రామనామం కాకినాడ తాలూక భీమవరం శాసనంలో ఒక పంపాది వీరపనాయకుని ప్రస్తావన కలదు

**పరవస్తు :** పర వస్తుల కలయిక పరవస్తు. పరవస్తు అంటే ఇహలోక సంబంధిమైనది కాక పరలోక సంబంధమైనది. పరశబ్దానికి అన్యము. దూరము అనేఅర్థాలతోపాటు ఉత్తమము, ఉన్నతము అసాధారణము, అనే అర్థాలున్నాయి.పరవస్తువును సాధించదమంటే ముక్తిని సాధించుట. పరవస్తు ఒక మఠంపేరు. కాగా పరవస్తు పేరుతో ఒక సంస్కృత కవియున్నాడు. బాలవ్యాకర్త పరవస్తు చిన్నయసూరి సాహిత్యలోకానికి బాగా తెలిసినవాడు. వీరి తండ్రి వెంకట రామనుజాచార్యులు 17వ శతాబ్దంలో ఉత్తరాది పరవస్తుమఠం నుండి తరలి మద్రాసుకు చేరుకున్నారు. అప్పటినుండి వారికి అగృహనామం స్థిరమైందని ఒక సమాచారం. పరవస్తురామన్న పేట అనేగ్రామం పాలకొండ తాలూకాలోవుంది.

**పరవాడ :** విశాఖజిల్లా అనకాపల్లి తాలూకాగ్రామం.

**పరాంకుశం:** పౌరుషనామం. శా.శ. 1488నాటి మార్కాపురం శాసనంలో హారితగోత్ర అపస్తంభ సూత్ర యజుశ్శాఖాధ్యాయిమైన ఒక పరాంకుశం రంగయ్య ప్రస్తావన వుంది.శత్రువులకు అంకుశం వంటివాడు అని అర్థం.

**పరిటాల :** ఇది గ్రామనామం. కృష్ణాజిల్లా నందిగామతాలూకాలో వుంది. వెనుకటి నాళ్ళలో వజ్రాల త్రవ్వకం జరిగేది. ఇప్పటికీ వర్షాకాలంలో వజ్రాలు దొరుకుతున్నాయని చెపుతారు. అల అనే పదం చివర కలిగివుండడం వలన పరిట అనేది ఒక మొక్కగా వచ్చును.

**పరిమెళ్ల - పరిమళం :** పరిమెళ్ల అనేగ్రామం పశ్చిమగోదావరిజిల్లా తాడేపల్లిగూడెం తాలూకాలో వుంది.

**పరింపూడి :** పోలవరం తాలూకాగ్రామం. పరింపూడి నారాయణపురం అనేగ్రామం ఇదే తాలూకాలో వుంది.

**పరుచూరి :** పరుచూరు అనేగ్రామం బాపట్ల తాలూకా లోనిది. దాని ఔపవిభక్తిక రూపం పరుచూరి. పరచూరి అని కూడ వ్యవహరిస్తారు.

**పర్ణశాల :** వైష్ణవుల్లో ఈ గృహనామం కన్పిస్తుంది. ఈ పేరుతో భద్రాచలం తాలూకాలో గ్రామముంది. శ్రీరామచంద్రుడు ఇక్కడే అరణ్యవాన సందర్భంలో అవాసాన్ని నిర్మించుకున్నాడని చెపుతారు.

**పర్వతనేని :** ఇది వ్యక్తినామం. ఇందలి పర్వతశబ్దం, శ్రీశైలానికి సంకేతం. పర్వతనాయకులు కాకతి రుద్రదేవ మహారాజుల అంగరక్షకులుగా పనిచేశారు. ఈ మేరకు శా.శ.1191నాటి గుంటూరుజిల్లా రాయపూడి శాసనాల్లో సమాచారం వుంది.

**పయ్యావులు :** జంతుసూచి. బహుశా దీనికి మూలం పెయ్యావుల కావచ్చు. జన్యావుల, నద్రావుల, కళ్ళి అవుల అనేవి కూడ ఇంటి పేర్లుగా వున్నాయి.ఆవులు అనేది సాధారణంగా గోవులను సూచించినా, నిజానికి గోజాతి పశువులనన్నింటిని సూచిస్తుంది.

అలా అయినపుడు పెయ్య అంటే కేవలం గోవులకు పరిమితమవుతుంది. పెయ్య అనేది సాధారణంగా గో, మహిషజాతి పశువుల్లో ఆడుదానిని సూచిస్తుంది. కాగా నర్రావుల ఎడ్లను,జన్యావుల ప్రత్యుత్పత్తికి ఉపయోగపడే అబోతులను సూచిస్తుంది.

**పలత :** పార్వతీపురం ఏజెన్సీగ్రామం

**పలివెల :** పెద్దాపురం తాలూకాగ్రామం.

**పలుకూరు :** గ్రామనామం. పలుకూరు సుబ్బరాయుడు ఖంద్రిక పుత్తూరు తాలూకాలో వుంది.

**పల్ల - పల్లా:** గ్రామనామ ప్రథమావయవం. శా.శ. 1350 నాటి సింహాచలం శాసనంలో ఒక పల్ల ఎర్రబోయని ప్రసక్తిగలదు.

**పల్లపోతు :** వ్యక్తినామం.

**పల్లమి :** గ్రామనామం. శా.శ 1205 నాటి సింహాచలం శాసనంలో ఒక పల్లమి వారి పల్లబోయని ప్రస్తావన వుంది.

**పల్లికొండ :** గ్రామనామం. నార్త్ ఆర్కాడుజిల్లా వెల్లూరు తాలూకాగ్రామం.

**పవని :** దీనిని పవనంగా భావించి, వాయువు అని అర్థం చెపుతారు. నిజానికి 'పవని' అనేది ప్రకాశం జిల్లాలో ఒక ఊరిపేరు. ఇదొక మొక్క పేరు. పవని వారి ఖంద్రిక కాళహస్తి తాలూకాలోవుంది.

**పసల :** గ్రామనామ పూర్వపదం. పసలపూడి అనే గ్రామం రామచంద్రపురం తాలూకాలో వుంది. పసలవాండ్లపల్లె అనేగ్రామం వాయల్పాడు తాలూకాలో వుంది.

**పసుపుల :** ఇది మనం సాధారణంగా వాడుకునే పసుపుకాదు. ఈ పేరుగల గ్రామం వలన గృహనామం ఏర్పడింది. పెద్దపసుపుల, చిన్నపసుపుల పేరుతో కడపజిల్లా జమ్మలమడుగు తాలూకాలో, పసుపుల అనేగ్రామం కర్నూలుజిల్లాలో వున్నాయి.

**పసుపులేటి :** పసుపులేరుపై ఔపవిభక్తిక రూపం. పత్రహరితాన్ని ఆకుపచ్చ అనడం తెలిసిందే. ఇలా వివక్షించడానికి కారణం మరొక పచ్చ, పసుప్పచ్చ. పచ్చి, పసి (వాడు) పదాలు, పక్వముకానిది, లేత, చిన్న అర్థాల్లో వాడుకలో వున్నాయి. అలాగే పచ్చి బాలింతరాలు, పచ్చినిజం శబ్దాలు, పసిబిడ్డ తల్లి, తిరుగులేని వాస్తవం అనే అర్థాల్లో వ్యవహృతమవుతున్నాయి. పసుపు సాధారణంగా హరీతకి (పసుపు కొమ్ముల నుండి వచ్చినది) హరిద్ర అనే అర్థాల్లో రూఢం.

పసుపులేరు పేరుతో ఒక ప్రవాహం నెల్లూరుజిల్లాలో వుంది. కాగా కావేరీ నదికి హరిద్రానది అని సంకేతనామం. దాని తెలుగు రూపం పసుపులేరు. దేవమన్నారుగుడి (తమిళనాడు) లోని జలాశయానికి హరిద్రానది అని పేరు. అప్రాంతపు తపాలా ఆఫీసుకు

కూడా అదే పేరు నెల్లూరుజిల్లా నుండి తంజావూరు ప్రాంతానికి వెళ్లిన వారికిగాని, లేక అటునుండి ఇటు వచ్చినవారికిగాని ఈ ఇంటిపేరు స్థిరపడింది ప్రసిద్ధ కవయిత్రి రంగాజమ్మ, సినిమానటి కన్నాంబల ఇంటిపేరు ఇదే

**పసుమర్తి :** పసుమర్రుపై ఔపవిభక్తిక రూపం పసుమర్రు పేరుతో ఒకటి గుంటూరుజిల్లాలోను, మరొకటి కృష్ణాజిల్లాలోను గ్రామాలు వున్నాయి

**పాకల :** ప్రకాశంజిల్లా కందుకూరు తాలూకాగ్రామం, శ్రీనాధకవిసార్వభౌముని స్వగ్రామమిది

**పాకదాసు :** వ్యక్తినామం. శా శ 1214 నాటి సింహాచలం శాసనంలో ఒక శ్రీపాకదాసుల పురాయినాయకుని ప్రస్తావన గలదు

**పాకనాటి :** దేశవిశేషం ఒంగోలుకు దిగువ నెల్లూరు వరకు గల తీరాంధ్రభూమి పాకనాడు. శ్రీనాథుడు పాకనాటివాడు శా శ 1221 నాటి ఆలంపురం శాసనంలో పాకనాటి ప్రోలిసెట్టి ప్రస్తావన ఉంది

**పాకాల :** గ్రామనామం. పాకాల నారాయణరెడ్డి ఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది

**పాగోలు :** కృష్ణాజిల్లా దివి తాలూకా గ్రామం శా శ 1718 నాటి పెదకళ్లేపల్లి శాసనంలో ప్రాంగోలి కళ్యాణనాయుడు ప్రస్తావనవుంది

**పాచకుల - పాచకుని :** వంట చేయువాడు అని యౌగికార్థం. కాగా దేవాలయ నియోగాల్లో ఒకటి శా శ 1299 సింహాచలం శాసనంలో ఒక పొట్నూరి మహేశ్వర పాచకుని ప్రస్తావన వుంది

**పాంచజన్యం :** శ్రీకృష్ణుని శంఖము వైష్ణవుల్లో గృహనామం శా శ 1464 ప్రొద్దటూరు తాలూకా గోపవరం శాసనంలో పాంచజన్యం అన్నయ ప్రస్తావన వుంది ఇతడు కాశ్యపగోత్రుడు, ఆపస్తంభ సూత్రుడు, యజుశ్శాఖాధ్యాయి

**పాంచాళ :** సాలూరు తాలూకాగ్రామం

**పాటిబండ్ల :** ఈ గ్రామం గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలో వుంది గృహనామంగా పాటిబండ్ల అని వ్యవహారం

**పాటూరు (రి) :** నెల్లూరుజిల్లా కోవూరు తాలూకాగ్రామం పాటూరి రామయ్య కమ్యూనిష్టు నాయకులు

**పొదర్తి :** ప్రకాశం జిల్లాగ్రామం

**పాటలి :** వందవాశి తాలూకాగ్రామం.

**పానకం - పానకపు :** ఇది పానీయ సంబంధమైనది గాదు ఈ పేరుగల గ్రామం చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకాలో వుంది

**పాపినేని :** పాపశబ్దంపై ఔపవిభక్తికరూపం. పాప అంటే చిన్న ముఖ్యంగా ఆడపిల్లలను పిలిచే ముద్దుపేరు కాగా సర్ప శబ్దార్థంలో కూడ చెల్లివస్తుంది ఆంగ్లంలో తండ్రిని పాప అనడం వుంది హిందీ భాషలోని బాప కూడా తండ్రినే సూచిస్తుంది. తెలుగులో నాయనమ్మకు మారుగా వున్న బొమ్మ, బాప్ సంబంధిపదం. శా శ. 1467 నాటి పల్నాడు తాలూకా తంగెడ శాసనంలో ఒక పాపినేని ప్రస్తావన వుంది. ఇతడు నంద్యాల అవుభళదేవ మహారాయల కార్యకర్తగా చెప్పబడ్డాడు. పాపినాయకనహళ్లి అనేగ్రామం.హోస్పేట తాలూకాలో వుంది చూడు పాపసాని

**పాపసాని :** వ్యక్తినామం పాపయ్య సాహిణికి సంక్షిప్తరూపం. పాపశబ్దం, పుణ్యపాపాల్లోని పాపాన్ని, పామును, ముద్దుగా పిలిచేపాప శబ్దాన్ని సూచిస్తుంది ఆంధ్రులు ప్రాయికంగా నాగజాతి వారని చెప్పడం కలదు వ్యక్తి నామాల్లో నాగ శబ్దం కనిపిస్తుంది దానికి ప్రత్యామ్నాయంగా పాపశబ్దం వ్యవహారంలోకి వచ్చి యుండవచ్చు. ముద్దుగా చిన్న పిల్లలను ముఖ్యంగా ఆడపిల్లలను పాప అని వ్యవహరించడం వుంది. కనుక పురుష వ్యక్తినామాల్లో దీనికి ప్రస్తావన వుండే అవకాశం లేదు పిల్లలు పుట్టి వెంటవెంటనే మరణిస్తున్న సందర్భంలో, నీచార్థాన్ని బోధించే పేర్లను (పెంటయ్య, కుప్పయ్య, భిక్షాలు, సన్యాసి) పెట్టుకునే ఆచారముంది అలాంటి సందర్భంగా కూడ పాప శబ్దం (పాప పుణ్యాలలోని పాపం) వ్యక్తినామాల్లోకి వచ్చే అవకాశం లేకపోలేదు.

**పామర్తి :** పామర్రు పేరుతో తూర్పుగోదావరి జిల్లా రామచంద్రాపురం, కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాలో గ్రామాలున్నాయి. శా శ 1072 నాటి శాసనంలో ఒక ప్రాంబర్తి ప్రోలయప్రస్తావనవుంది

**పాములపాటి - పామిడి - పమ్మి :** పాములపాడుపై ఔపవిభక్తకరూపం. ఈ పేరుతో చాలా గ్రామాలున్నాయి. గుంటూరుజిల్లాలో ఒకటి వుంది. ఇందలి పాము సర్ప సంబంధకాదు. ఇది ఒక రకం మొక్క ఒకరకం గడ్డికూడ. పామిడి అనేగ్రామం అనంతపురం జిల్లాలో వుంది. పమ్మి అనేగ్రామం ఖమ్మంజిల్లాలో వుంది పమ్మిచెడి పది వూళ్లు అయిందని సామెత. పాములపాటి బుచ్చినాయుడు ప్రముఖులు

**పాయసము - పాశం :** క్షీరాన్నాన్ని పాయసం అనడం తెలిసిందే పయస్ శబ్దానికి పాలు అని అర్థం. 12వ శతాబ్దంనాటికే ఈ ఇంటి పేరు వ్యాప్తిలోనున్నట్లు అమరావతి శాసనం వలన తెలుస్తోంది. అందులో పాయసము కాటిబోయుడు అనే వ్యక్తి పేర్కొనబడ్డాడు. పాయసం పాశం అయింది పాశంవారిపల్లె చంద్రగిరి తాలూకాలో వుంది.

**పారనంది :** గ్రామనామం.

**పారాది :** విశాఖజిల్లా బొబ్బిలి తాలూకాగ్రామం.

**పారుపల్లి - పారేపల్లి :** పారుపల్లి అనే గ్రామం గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలో వుంది రెండు విధాలా దీనికి వ్యవహారముంది పారుపల్లి రామకృష్ణయ్య ప్రసిద్ధ సంగీతజ్ఞులు.

**పాలకురికి** : పాల్కురికి సోమన, తెలుగు సాహిత్యంతో పరిచయమున్నవారికి తెలిసినవాడే. ఈ పాలకురికి గ్రామం, సేలం జిల్లా కృష్ణగిరి తాలూకాలో వుంది. ఇది తెలియక పాలకురికిని, పాలకుర్తితో ముడిపెట్టి, సోమన పాలకుర్తివాడని చెప్పడం జరిగింది. పాల వృక్ష సంబంధి. కురికి పేరుతో చీకలకురికి అనే గ్రామం కూడా ఉంది. కన్నడంలో అంటే చిన్న గ్రామం. పాలకురికి వ్యవహారంలో పాల్కురికి అయింది.

**పాలకోడేరు (టి)** : ఇలారెండు విధాలుగాను వ్యవహరింపబడుతుంది. ఇదిపశ్చిమ గోదావరి జిల్లాలోని గ్రామం. కోడేరుపై పాలచేరడానికి కారణ, కోడేరు పేరుతో సమీపంలో మరో గ్రామం వుండడం. అది విస్సాకోడేరు. కోడేరు కూడా కోడు ఏరుల కలయిక. నిజానికి రెండూ ప్రవాహసూచకాలే. అయితే కోడు, అనడానికి కారణం అది పెద్ద నది కాదని, పరిమాణంలో చిన్నదని చెప్పడం. మురుగుకోడు అంటున్నాము గదా! ఇక పాల, క్షీరసంబంధమైనది కాదు. మొక్కమాత్రమే. పాల చెట్లు, తెలుసుకదా! అందులో చాలరకాలున్నాయి. తుమ్మపాల, గుడిపాల అలాంటివే. ఇవి కూడ గ్రామనామాలుగా వున్నాయి. నిజానికి పాలకొలనులోని పాలకూడా ఇదే. పండితులు దానిని సంస్కృతీకరించి క్షీరచేసి, మొత్తంమీద దానిని క్షీరారామం చేశారు.

**పాలగుమ్మి** : తూర్పుగోదావరి జిల్లా రాజోలు తాలూకాగ్రామం. పాలగుమ్మి పద్మరాజు రచయిత.

**పాలంకి** : భీమునిపట్నం తాలూకాగ్రామం.

**పాలడుగు** : గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా గ్రామం. పాలడుగు అనేది ఒకచెట్టుపేరు. కూర్మరాజీయకర్త పాలడుగు శేషాచలవర్మ. పాలడుగు వెంకటరావు ప్రముఖులు.

**పాలపర్తి** : పాలపర్రుపై ఔపవిభక్తిక రూపం. ఈ గ్రామం బాపట్ల తాలూకాలో ఉంది.

**పాలవేకరి** : గ్రామనామం. పాలవేకరి కదరీపతి శుకసప్తతి కావ్యకర్త.

**పాలువాయి - పాల్వాయి** : పాలువాయి అనే గ్రామం పల్నాడు తాలూకాలో వుంది. ప్రసిద్ధ సినీనటి భానుమతి గృహనామం, పాలువాయి.

**పాలూరి** : గ్రామనామం శా.శ. 1416 నాటి కాకినాడ తాలూకా భీమవరం శాసనంలో పులుకంటి గోత్రజుడైన పాలూరి వీరమనాయని ప్రస్తావన గలదు. టెక్కలి తాలూకలోవుంది.

**పాలెం** : చోడవరం తాలూకాగ్రామం. ఇంకా చాలా వున్నాయి.

**పాలేటి** : పాలేరుపై ఔపవిభక్తిక రూపం. జీతగానిని పాలేరు అనడం తెలుసు. అయితే ఇంటిపేరుకు ఆకరమైనది గ్రామనామం. ఈపేరుగల గ్రామం చిత్తూరుజిల్లా చిత్తూరు తాలూకాలో వుంది. పాలేరు పేరుగల ప్రవాహం ఒంగోలు జిల్లాలో వుంది. కాటమరాజుకు మనుమసిద్ధికి జరిగిన యుద్ధం, పాలేటి నది ఒడ్డున గల పంచలింగాల వద్ద జరిగింది.

**పావడ**: శృంగవరపు కోట తాలూకాగ్రామం శా శ 1564 నాటి చిన్నకంచి శాసనంలో పావడ చినకృష్ణప్పనాయని ప్రస్తావన వుంది

**పావులూరి**: ఈ పేరుతో కృష్ణా ప్రకాశం జిల్లాల్లో గ్రామాలున్నాయి పావులూరి మల్లన గణితశాస్త్రాన్ని రచించాడు

**పింగళ - పింగళి**: పల్నాడు తాలూకాలో నేటి పిన్నెల్లిగ్రామం శా శ 1218నాటి ఆ గ్రామశాసనాల్లో పింగలిగా చెప్పబడింది కళాపూర్ణోదయ కర్త సూరన గృహనామం పింగళి ఈ ఇంటిపేరు తో ప్రసిద్ధులైన మరొకరు పింగళి లక్ష్మీకాంతంగారు.

**పించము**: శా శ 1162 నాటి గుడివాడ శాసనంలో మిరితికుల గోత్రుడైన ఒక పించము అన్నిసెట్టి ప్రస్తావన గలదు

**పిడతల**: గ్రామనామం ఇది ఒక రకం గడ్డి పిడతల వీరాయపల్లె శిద్దవటం తాలూకా. ఈ గృహనామం గలవారిలో పిడతల రంగారెడ్డి ప్రముఖులు పిడతలపూడి తిక్కవరం గూడూరు తాలూకాలో వుంది

**పిడపర్తి**: పిడపఱ్రు అనేగ్రామం తెనాలి తాలూకాలో వుంది దాని ఔపవిభక్తిక రూపం పిడపర్తి పిడ అనేది ఒక రకం గడ్డి పిడతాపోలూరు అనే గ్రామం నెల్లూరు జిల్లాలోవుంది పిడతల కూడ గృహనామం.

**పినిసెట్టి**: ఇందలి పిని, పిన్నశబ్దంనుండి వ్యుత్పన్నము శా శ 1192 నాటి పెదగంజాము శాసనాల్లో ఒక పిన్నిసెట్టి ప్రస్తావన వుంది ఇతని కుమారుడు శ్రీరంగశెట్టి ఇతని తమ్ముడు (పేరు శిథిలమైనది) పెదగంజామున పెన్నేశ్వర దేవరను ప్రతిష్ఠించినట్టు చెప్పబడింది.

**పిన్నమనేని**: వ్యక్తినామం పిన్న అంటే చిన్న. పిన్నమనాయకుడు అసలుపేరు దివితాలూకా శ్రీకాకుళం శాసనాల్లో కాకతి గణపతి దేవమహారాజు గజసాహిణి యైన భాస్కరదేవుని వద్ద ఒక పిన్నమనాయుండు ప్రధానిగా పనిచేసినట్టు పేర్కొనబడింది. శా.శ. 1338 నాటి పాలకొల్లు శాసనంలో ఒక పిన్నమనేని నరహరినేని ప్రస్తావన వుంది అప్పటి వారి ఇంటిపేరు మంచెళ్ల ఇతడు అల్లాడరెడ్డికి పుణ్యముగా దానము చేశాడు పిన్నమనేని క్ష్మాప సుపుత్ర అని నరహరినేని చెప్పబడ్డాడు కనుక వీరు పాలక వంశానికి చెందినవారుగా చెప్పవచ్చును. పిన్నమనేని కోటేశ్వరరావు రాజకీయ నాయకులు

**పిన్నబోయిన - పిన్నిబోయిన**: వ్యక్తినామం శాశ 1334 నాటి సర్పవరం శాసనంలో ఒక పినబోయిన మాదాశి ప్రస్తావన కలదు

**పిన్నింటి**: గ్రామముఖ్యులుగా పిన్నపెద్ద వుండేవారు. పిన్నింటి పమిడేశ్వరరావు ప్రముఖులు.

**పిప్పర**: తాడేపల్లి గూడెం తాలూకాగ్రామం.

**పిరిడి**: బొబ్బిలి తాలూకాగ్రామం

**పిరియాండి**: ఇది తమిళపెరియాండికి మారురూపం దేవత, అని అర్థం శా శ 1383 నాటి సింహాచలం శాసనంలో ఒక పిరి అండి కృష్ణమహా సేనాపతి ప్రస్తావన గలదు

**పిలుక - పిలకా :** పిలక అనేగ్రామం నవరంగపురం ఏజెన్సీలోవుంది శా శ 1300 నాటి సింహాచల శాసనంలో ఒక పిలుక కూనపల్లి ప్రస్తావన వుంది పిలకా గణపతిశాస్త్రి ప్రముఖ రచయిత

**పిల్ల :** పాలకొల్లు శాసనంలో ఒక పిల్లి ప్రోలి బోయని ప్రస్తావన వుంది

**పిల్లలమఱ్ఱి :** గ్రామనామం. శా శ 1446నాటి ప్రొద్దటూరు తాలూకా ఉప్పారపల్లె శాసనంలో ఒక పిల్లలమఱ్ఱి రామరాజు పేర్కొనబడ్డాడు శృంగారశాకుంతల కర్త పిల్లలమఱ్రి పినవీరభద్రుడు

**పిల్లి :** పిల్లివారిపల్లె కమలాపురం తాలూకాలో వుంది గొట్టిపిల్లి అనేగ్రామం పర్లాకిమిడి తాలూకాలో వుంది

**పిల్లుట్ల :** గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా గ్రామం

**పిళ్ల :** తమిళపదం ఒక జాతి జనులు పిళ్లారి అంటే గణపతి శా శ 1314 నాటి సింహాచల శాసనంలో ఒక పిళ్ల కూచెన ప్రస్తావన వుంది

**పీసపాటి :** గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా గ్రామం పీసపాడుకు ఇది ఔపవిభక్తిక రూపం. పీసపాటి నరసింహారావు ప్రసిద్ధ రంగస్థల నటులు.

**పుచ్చలపల్లి :** గూడూరు తాలూకాగ్రామం. పుచ్చలపల్లి సుందరయ్య ప్రముఖ కమ్యూనిష్టు నాయకులు.

**పుట్టగుంట - పుట్టకుంట :** పుట్టగుంట కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాలోను పుట్టకుంట అనే గ్రామం ఆదోని తాలూకాలోను వున్నాయి. ఇందలి పుట్ట చీమలపుట్ట, పాముపుట్టల లోని పుట్ట అర్థంలోకాదు ఇది ఒకరకం చెట్టు పుట్టమాను తెలిసి వుంటుంది

**పుట్టంరాజు :** వ్యక్తినామం. పుట్టంరాజువారి ఖండ్రిక గూడూరు తాలూకాలో వుంది

**పుట్టా :** గ్రామనామపూర్వపదం పుట్టావారిపల్లె చిత్తూరుజిల్లా గ్రామం

**పుంట :** శా శ 1456 నాటి సింహాచలం శాసనంలో పుంట తిమ్మిశెట్టి ప్రస్తావన వుంది

**పుతుంబాక :** గ్రామనామం. పుతుంబాక వెంకటపతి కమ్యూనిష్టు నాయకులు.

**పుదూరు - పుదూరి :** ఆర్కోణం తాలూకా గ్రామం. ఇంకా కూడా వున్నాయి ద్రావిడబ్రాహ్మణుల్లో పుదూరి వారు ఒక తెగ.

**పునుగోడు(డి) :** ప్రకాశంజిల్లా కనిగిరి తాలూకాగ్రామం మరో గ్రామం తమిళనాడులోని వాలాజా పేటతాలూకాలో ఉంది

**పురాణ పండ :** పురాణ అంటే ప్రాచీనము అని అర్థం. గ్రామం కావచ్చు. పురాణాలు తెలుసు. పండ ఒరియా బ్రాహ్మణులకు పట్టపు పేరు. పురాణపండ రంగనాథ్ ప్రముఖ జర్నలిస్టు

**పురాణం :** శా శ 1489 శాసనంలో పరాంకుశం లక్ష్మణయ్య మార్కాపురం చెన్నరాయల సంనిధి పురాణం విన్నపం చేస్తున్నట్లు చెప్పబడింది పురాణం సుబ్రహ్మణ్యశర్మ రచయిత

**పురిపండా :** పూరీకి చెందిన పండా అని అర్థం పురిపండా అప్పలస్వామి ప్రసిద్ధ రచయిత

**పులవరసు :** హోసూరు తాలూకాలో వుంది

**పులపర్తి :** సర్వసిద్ధి తాలూకాగ్రామం

**పులికంటి :** పులికల్లుకు ఔపవిభక్తిక రూపం చిత్తూరు తాలూకాలోని గ్రామం పులికంటి కృష్ణారెడ్డి ప్రసిద్ధ కధారచయిత

**పులిగడ్డ :** కృష్ణాజిల్లా దివితాలూకా గ్రామం

**పులిదిండి :** రాజోలు తాలూకాగ్రామం

**పులిపాటి :** పులపాడుకు ఔపవిభక్తిక రూపం. గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలో వుంది. ఇతరచోట్ల కూడా వుండే అవకాశముంది పులిపాటి వెంకటేశ్వర్లు ప్రసిద్ధ రంగస్థల నటులు

**పుల్లూరి :** పుల్లూరు అనేగ్రామం చిత్తూరు తాలూకాలో వుంది.

**పువ్వాడ :** గుంటూరుజిల్లా వినుకొండ తాలూకాగ్రామం పువ్వాడ శేషగిరిరావుగారు కవి

**పుష్పగిరి :** కడపజిల్లాగ్రామం ఈ పేరుతో మరోగ్రామం ఉత్తర ఆర్కాడు జిల్లాలో కూడా వుంది.

**పుసులూరు (రి) :** కర్నూలు, గుంటూరు జిల్లాల్లో ఈ పేరుతో గ్రామాలున్నాయి.

**పూజారి :** వృత్తినామం. శా శ 1000 నాటి ముఖలింగం శాసనంలో ఒక పూజారి మాధవభట్టు ప్రస్తావన వుంది. పూండ్ల రామకృష్ణయ్య సాహితీలోకానికి పరిచితులు.

**పూడి పూండ్ల - పూళ్ల :** పూడి అనేపేరుతో చిత్తూరుజిల్లా పుత్తూరుతాలూకాలోను, కాళహస్తి తాలూకా లోను గ్రామాలున్నాయి. పూడిపై బహువచనం పూళ్ల ఈ పేరుగల గ్రామం పశ్చిమగోదావరిజిల్లా ఏలూరు తాలూకాలో వుంది పూండ్ల అనేగ్రామం బాపట్ల తాలూకాలో వుంది

**పూడి పెద్ది :** వ్యక్తినామం పూడి, పూండి అనే పేరుతో గ్రామలున్నాయి. పెద్ది అనేది ఒకపదవి పూడి గ్రామానికి పెద్ది అనే అర్థంలో ఇది వర్తించింది

**పూడికుడక :** సర్వసిద్ధి తాలూకాగ్రామం

**పూడివాడ :** ఈ గ్రామం గుంటూరుజిల్లా రేపల్లెతాలూకాలో వుంది.

**పూదోట :** ఎల్లవరంతాలూకాగ్రామం

**పూనాటి** : ప్రాంత విశేషం. పూగినాడుకు సంక్షిప్త రూపం పూనాడు స్థూలంగా ఒంగోలు, దర్శి తాలూకాల ప్రాంతం. దాని ఔపవిభక్తిక రూపం పూనాటి

**పూషడపు - పూసడపు** : పూషడం అనే గ్రామం కృష్ణాజిల్లా దివితాలూకాలో వుంది

**పూసపాటి - పూసల** : విజయనగర రాజ కుటుంబపు ఇంటిపేరుగా ఇది ప్రసిద్ధము గ్రామనామం గనుక ఇతరులకు ఉండవచ్చును. పూసపాడు అనే గ్రామం బాపట్ల తాలూకాలో వుంది.దాని ఔపవిభక్తిక రూపం పూసపాటి నల్లపూసలు తెలుసు. అయితే గ్రామనామంలోని పూస అదికాదు ఇది గడ్డిపేరు పూసల అనేగ్రామం కూడ వుంది

**పృధువరాజు** : వ్యక్తినామం శా శ 1202 నాటి సింహాచలం శాసనంలో ఒక పృధువరాజు చిత్రమనాయకుని ప్రస్తావన వుంది మరో శాననంలో కూడా ఈ గృహనామం ప్రస్తావింపబడింది.

**పెగ్గడ** : శా శ 950 నాటి కూడలి సంగమేశ్వర శాసనంలో పెగ్గడ జోగిభట్టు ప్రస్తావన కలదు పెగ్గడ రాజోద్యోగం కాగా వెంట్రప్రగడ, అల్లప్రగడ, కేవల ప్రగడ అనే గ్రామాలు కూడా వున్నాయి.

**పెడకంటి** : గ్రామనామం కల్యాణదుర్గం శాసనంలో పెడకంటిసిద్దయ ప్రస్థావనవుంది

**పెండేకల్లు - పెండేకంటి** : పత్తికొండ తాలూకాగ్రామం పెండేకంటి వెంకటసుబ్బయ్య కేంద్రమంత్రిగా పనిచేశారు.

**పెండ్యాల** : కృష్ణాజిల్లా నందిగామ తాలూకా గ్రామం పెండ్యాల లక్ష్మీదేవిపేట అనేగ్రామం పాలకొండ తాలూకాలోవుంది పెండ్యాల నాగేంద్రరావు సంగీత దర్శకులు గా ప్రసిద్ధి చెందినవారు. పెంట్యాలగా కూడా వ్యవహారం

**పెదప్రోలు** : కృష్ణాజిల్లా దివితాలూకా గ్రామం

**పెదమల్లం** : మల్లం అనేది గ్రామనామం. వివక్ష కొరకు పెద చేరింది శా శ 1221 నాటి అలంపురం శాసనంలో పెద్దమల్లం మలిదేవరాజు ప్రస్తావన వుంది. గుడిమల్లం అనే గ్రామం చిత్తూరు జిల్లాలోవుంది మల్లాది అనే పేరుతో కూడ గ్రామముంది

**పెదసింగు** : ఇది వ్యక్తి నామం పరంగా వచ్చిన గృహనామం సింగు సింహశబ్ద భావం

**పెద్దనేని - పెద్దినేని** : వ్యక్తినామం పెద్దినేని వారి పల్లె చంద్రగిరితాలూకాలో వుంది చూడు పెద్ది.

**పెద్దాడ** : ఇది కాకినాడ తాలూకాగ్రామం

**పెద్ది** : పెద్ది పెద్ద శబ్దం నుండి వుత్పన్నమైంది కాగా పెద్ది ఒక అధికారపదవి కూడా గ్రామలకు పిన్నపెద్ద అనే అధికారులు వుండేవారు శాసనల్లో చాల మంది పెద్ది నామాంత్యపదంగా గలవారు కన్పిస్తారు.

**పెద్దింట :** చూడు పిన్నింటి

**పెద్దిభట్ల :** పెద్ది వివరణ ముందు ఇవ్వబడింది దానిపై భట్ల చేరింది శా శ 1332 నాటి అహోబిలం శాసనాల్లో ఒక పెద్దిభట్లవారి మారిమండని ప్రసక్తివుంది పెద్దిభట్ల సుబ్బరామయ్య కథారచయిత

**పెనమలూరి :** విజయవాడ సమీపగ్రామమైన పెనమలూరుకు ఇది ఔపవిభక్తక రూపం. ఇప్పటి వ్యవహారం ఇదే అయినా, దీని అసలుపేరు పినమల్లూరు ఈ మేరకు శాసనస్థసాక్ష్యముంది. శా శ 1175 నాటిశాసనంలో ఒక పినమల్లూరి ముత్తిరెడ్డి పేర్కొనబడ్డాడు

**పెనుబాల :** గ్రామనామం. పెనుబాలవాండ్లపల్లె చంద్రగిరితాలూకాలో వుంది

**పెనుమూడి :** గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాగ్రామం.

**పెన్నేటి :** పెన్నేరుకు ఔపవిభక్తిక రూపం. పెన్నేరు అంటే పెన్నానది అనంతపురం జిల్లాలో పెన్ననంటి వున్న భూభాగాన్ని పెన్నంబడి సీమగా శాసనాల్లో వ్యవహరించారు.

**పెన్మచ్చ :** దీనిని పెన్మత్సగా వ్రాయడం కలదు దీనిని పెనుమచ్చగా అంటే దేహం మీది పెద్ద మచ్చగా భావించి, అలా పెద్ద మచ్చగలవాడు పూర్వుల్లో ఒకరుండగా, అప్పటి నుంచి ఆ వ్యక్తి కుటుంబీకులు పెనుమచ్చ పెన్మత్సవారుగా పరిగణింపబడ్డారని చెప్పడం జరిగింది కాని ఇది పొరపాటు పెన్మత్స లేక పెనుమచ్చ అనేది కృష్ణా జిల్లాలో ఒక ఊరిపేరు. నిజానికది పెనుమచ్చ కూడా కాదు, పెనుముచ్చ. బహుశా ఇది పెగ్గుమ్మడి వలె ఒక మొక్క కావచ్చును. ఈ ముచ్చ చివర గలిగిన కొన్ని ఇతర గ్రామాలున్నాయి.

**పెమ్మరాజు :** వ్యక్తినామం. తమిళ పెరుమ శబ్దం పెమ్మగా మారింది పెద్ద అని అర్థం. కాగా పెరుమాళ్ళు దైవానికి సంకేతం పెమ్మరాజు పోలవరం నరసాపురం తాలూకాగ్రామం

**పెమ్మసాని :** గండికోట పాలకులు పెమ్మసాని వారు పెమ్మయ సాహిణి అనేది వ్యవహారం. శా శ 1592 నాటి తిరువల్లూరుతాలూకా కూవంగ్రామ శాసనాలో ఒక పెమ్మసాని కుమార తిమ్మనాయని ప్రస్తావనవుంది శా శ 1551 నాటి చిన్నకోట్ల శాసనంలో ఒక పెమ్మసాని ఇమ్మడి తిమ్మనాయని ప్రస్తావన వుంది కాగా పెమ్మయ సింగధీమణి అనే మకుటంతో ఒక శతకముంది

**పెయ్యేటి :** పేయ్యేరు అనేగ్రామం గుడివాడ తాలూకాలో వుంది. ఇది దాని ఔపవిభక్తిక రూపం.

**పెరవలి :** గుంటూరు, కర్నూలు జిల్లాల్లో ఈ పేరుతో గ్రామాలున్నాయి

**పెరంగూరి :** గ్రామనామం. శా శ 1466 నాటి మార్కాపురం శాసనాల్లో పెరంగూరి వెంగలయ్య ప్రస్తావింపబడ్డారు.

**పెల్లకూరు (రి) :** గూడూరు తాలూకాగ్రామం.

**పెళ్లూరి :** పెళ్లూరుకు ఔపవిభక్తిక రూపం. ఒంగోలు తాలూకా గ్రామం.

**పేకేటి :** ఇది పేకేరుకు ఔప విభక్తిక రూపం ఇది కూడా ఊరి పేరు సమీపంలో ఈ పేరుతో గల ప్రవాహం వలన ఈ జనావాసానికీ పేరు వచ్చింది ఈ పేరుతో రెండు గ్రామాలు, ఒకటి భీముని పట్నం తాలూకాలోను, మరొకటి తూర్పు గోదావరి జిల్లా రామచంద్రాపురం తాలూకాలోను వున్నాయి ప్రముఖ సినీనటుడు శివరాంగారి ఇంటిపేరు పేకేటి

**పేట :** పర్లాకిమిడి తాలూకాగ్రామం.

**పేరం :** పేరంవారిపల్లె చంద్రగిరితాలూకాలో వుంది

**పేరాల :** ఇది. చీరాలకు సమీప గ్రామం బాపట్ల తాలూకాలోనిది.

**పేర్వారం :** గ్రామనామం ఈ గృహనామంతో ప్రసిద్ధులు పేర్వారం జగన్నాధంగారు తెలుగువిశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా పనిచేశారు

**పైడా :** గ్రామనామ ప్రధమావయవం. పైడావారి జగన్నాధపురం తాలూకాగ్రామం.

**పైడిపాల (ళ్ల) :** గొలుగొండ తాలూకాగ్రామం, ఇంకా ఇతరచోట్ల కూడ వుండవచ్చును.

**పొట్నూరి :** విశాఖజిల్లా గ్రామనామం. కృష్ణదేవరాయలు విజయస్థంభం ఎత్తించిన దిక్కదే శాశ1299 నాటి సింహాచలం శాసనంలో ఒక పొట్నూరి మహేశ్వరపాచకుని ప్రస్తావన వుంది.

**పొట్లూరు :** పొట్లూరు పై ఔపవిభక్తిక రూపం పొట్లూరి ఈ పేరుతో రెండు గ్రామాలున్నాయి ఒకటి వినుకొండ తాలూకాలో, మరొకటి కనిగిరి తాలూకాలో వున్నాయి

**పొత్తూరు - పొత్తూరి :** ఇది గుంటూరుజిల్లా గ్రామం.

**పొదెల :** పొదిలి గ్రామనామ రూపాంతరం శా శ 1419 నాటి చాగిదొన శాసనంలో పొదెల ఇంద్రరాజయ దేవమహారాజుల ప్రస్తావన వుంది

**పొందూరి :** పొందూరుకు ఔపవిభక్తిక రూపం. శా శ 1344 నాటి పాలకొల్లు శాసనంలో ఒక పొందూరి నాగరాజు ప్రస్తావన వుంది. పొందూరు శ్రీకాకుళం జిల్లా గ్రామం.

**పొన్నం - పొన్నా :** గ్రామనామ పూర్వపద సూచి. పొన్నపల్లె, పొన్నమాకుల పల్లె అనే గ్రామాలున్నాయి.

**పొన్నాడ :** చీపురుపల్లి తాలూకాగ్రామం.

**పొన్నలూరు (రి) :** ప్రకాశంజిల్లా కందుకూరు తాలూకాగ్రామం. పొన్నలూరి బ్రదర్సు సినీనిర్మాతలు

**పొయిగారం :** దేవాలయ ఉద్యోగం. గుంటూరుశాసనాల్లో ఒక కెందామర కన్నోజు అను వ్యక్తి పొయిగారపని వానిగా చెప్పబడ్డాడు.

**పోకల :** పోకలవారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది. వక్కలను పోకల అంటారు అయితే పోకల గ్రామనామం కూడా కావచ్చును.

**పోకూరు (రి) :** ప్రకాశంజిల్లా కందుకూరు తాలూకాగ్రామం

**పోచిరాజు :** వ్యక్తినామం పోచయ్య, పోచమ్మ అనే పేర్లు వ్యక్తి నామాలుగా తెలంగాణంలో ప్రముఖంగా కన్పిస్తాయి ఇది పోషణ శబ్దనుండి ఉత్పన్నమైనదిగా చెప్పడం కలదు కీ శ 1218 నాటి త్రిపురాంతక శాసనంలో ఒక పోచిరాజు పెద్దిరాజు ప్రస్తావన వుంది ఇతడు కాకతీయ ప్రతాప రుద్రదేవమహారాజుల మహాప్రధానిగా సర్వాధికారిగా చెప్పబడ్డాడు. శా శ 1479 నాటి చాగిదొన శాసనంలో మండలేశ్వరుడైన ఒక పోచిరాజు చెన్నమరాజయ్య ప్రస్తావన వుంది

**పోణంగి - పోనంగి :** పశ్చిమగోదావరిజిల్లా ఏలూరు తాలూకా గ్రామం. పోణంగి శ్రీరామఅప్పారావు సాహితీలోకానికి పరిచితులు.

**పోతబోయిన - పూతబోయిన :** వ్యక్తినామం పోతశబ్దం తెలసిందే దానిపై బోయదు చేరి, బోయనగా స్థిరపడింది శా.శ 1162 నాటి వేల్పూరు శాసనాల్లో ఒక పోతబోయని ప్రసక్తి వుంది అప్పటి అతని ఇంటిపేరు గంగుల

**పోతా :** పోతావారిపల్లె అనేగ్రామం వాయల్పాడు తాలూకాలో వుంది పోతు శబ్దపు ఔపవిభక్తిక రూపం

**పోతినేని :** పోతనాయకుడు అసలుపేరు. పోతురాజు, పోతిరెడ్డి - ఇలా ఇప్పటికి వ్యక్తినామాల్లో వున్నాయి పోతుశబ్దం జంతువుల్లో మగదానిని సూచించేపదం. కాగా, గ్రామదేవతల నూరుగురి కనిష్ఠసోదరునిగా పోతరాజును సంభావిస్తారు. వ్యక్తి నామాల్లోని పోతుశబ్దం శ్రేష్ఠతావాచకం సారవంతమైన భూమిని పోతుగడ్డ అనడం కూడ వుంది. శా శ 1077నాటి ద్రాక్షారామ శాసనంలో కులోత్తుంగ చోడ గొంకరాజుల ప్రెగ్గడ అయిన ఒక పోతినాయకుడు పేర్కొనబడ్డారు అప్పటి ఆయన ఇంటిపేరు మోరమపూండి. మోరంపూడి గుంటూరుజిల్లాలో దుగ్గిరాలకు సమీపంలో వుంది

**పోతినేని :** పోతనాయడు అనే వ్యక్తినామపరంగా వచ్చింది.

**పోతిరెడ్డి :** పోతిరెడ్డి ఎఱ్ఱమ ప్రస్తావన శా శ. 1307 నాటి కాకినాడ తాలూకా భీమవరం శాసనంలో వుంది.

**పోతుల :** పోతు శబ్దంపై బహువచనం. ఔపవిభక్తికరూపం. పోతు శబ్దం తెలిసిందే

**పోపూరు - పోపూరి :** కృష్ణాజిల్లా నందిగామ తాలూకా గ్రామం.

**పోరుమామిళ్ళ :** కడపజిల్లా బద్వేలు తాలూకాగ్రామం. పోరుమామిళ్ల అనేది ఒక మొక్క శా శ. 1448 నాటి బద్వేలు తాలూకా కత్తెరగండ్ల శాసనంలో ఒక పోరుమామిళ్ల ఓబులోజు ప్రస్తావన వుంది

**పోలవరపు :** పోలవరం కు ఔపవిభక్తిక రూపం. కృష్ణాజిల్లా బందరు తాలూకా గ్రామం. గోదావరిజిల్లాలో కూడా వుంది

**పోలా:** ప్రోల శబ్దపు వికృతి శా.శ. 1541 నాటి చిన్న అహోబిలం శాసనంలో పోలా మల్లయ ప్రస్తావనవుంది.

**పోలినేని:** వ్యక్తినామం. ప్రోలయశబ్దం పోలిగా పరిణమించింది నేని నాయకశబ్దభవం

**పోలిశెట్టి:** ఇందలి పోలి, పోలి (ప్రొలయ) శబ్దభవం ఇతడు వైశ్యకులానికి చెందినవాడుగా శా శ 1337 కొండవీటి శాసనాల్లో చెప్పబడ్డాడు అయితే పోల, ప్రోల, పోలి అనేది వ్యక్తినామంగా అన్ని వర్గాల్లోను కన్పిస్తోంది ప్రోలు అనేది కోశాగారముండే స్థలం ధనవంతుడు అనే అర్థంలో ఈ పేరు వచ్చియుండవచ్చు.

**పోలెపెద్ది:** శా శ. 1170 కొణిదెన శాసనంలో ఒక పోలెపెద్ది ప్రస్తావన ఉంది.

**పోశం:** పోచశబ్ద పరిణామరూపం పోశంవారిపల్లె చంద్రగిరితాలూకాలో వుంది

**ప్రగడ, ప్రెగడ:** ఇది ఒక అధికార పదవి శా శ 1071 నాటి ద్రాక్షారామ శాసనంలో, కమ్మనాటి త్రిభువనమల్లదేవరాజు పెగ్గడగా ఒక అరియపెగ్గడ పేర్కొనబడ్డాడు కర్ణాటకలోని హెగ్డేకూడా ఇదే

**ప్రజ్ఞం:** ఇది బుద్ధి సంబంధమైన విశేషం కాదు ఇదొక ఊరిపేరు గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాలో వుంది.

**ప్రతాప:** ప్రతాపము శౌర్యము. శా శ. 1221 నాటి సింహాచల శాసనంలో ఒక ప్రతాప పెద్దినాయకుని ప్రస్తావన వుంది. ప్రతాపగిరి అనే గృహనామం కూడా వుంది

**ప్రయాగ:** శ్రీకాకుళం జిల్లాగ్రామం. శా శ 1203 నాటి సింహాచల శాసనంలో హారితగోత్రునికి చెందిన ఒక ప్రయాగ మంచన ప్రస్తావన కలదు.

**ప్రళయకాలం:** యుగాంత సమయం శా శ 1478నాటి గుత్తి తాలూకా చిన హోతూరు శాసనంలో కాశ్యపగోత్రం అసస్తంబ సూత్ర యజుశ్శాఖాధ్యాయియైన ప్రళయకాల గోవిందయ్య ప్రస్తావన వుంది. ఇంటిపేరుగా దీని ప్రతిపత్తి తెలియరాలేదు ప్రళయకావేరి వుంది సత్యకాల అనే గృహనామం కూడా వుంది

**ప్రాసంగుల పాటి:** బాపట్ల తాలూకా గ్రామనామం ప్రాసంగులు అంటే వరిధాన్యం దీని రూపాంతరమే బసంగి.

**ప్రోలాప్రగడ:** వ్యక్తినామం. శా శ 1209నాటి సింహాచల శాసనంలో భరద్వాజ గోత్రజులైన ఒక ప్రాలె పెగ్గడ ప్రస్తావన వుంది ఇతడు ఒడ్డాది మంత్రిగా చెప్పబడ్డాడు

**బంగాని - బనగాని:** బనగాని పల్లెలోని పూర్వపదం. బనగాడు పై ఔపవిభక్తికరూపం బనగాని బంగాని వారిపల్లె చంద్రగిరి తాలూకాలో వుంది బనగాని పల్లె తాలూకా కేంద్రం

**బచ్చు:** బచ్చు అనగావైశ్యుడు ఈ మేరకు సాహిత్యాధారాలు, శాసనస్థాధారాలు వున్నాయి శా శ 1200 నాటి వినుకొండ తాలూకా ఈపూరు గ్రామశాసనంలో ఒక బచ్చు నారెపసెట్టి ప్రస్తావనవుంది

**బట్టల :** ఇది వస్త్ర సంబంధికాదు ఇది ఊరిపేరు ఈ పేరుగల గ్రామం బిస్సం కటాక ఏజెన్సీలో వుంది

**బడవర :** ఆలంపురం శాసనంలో (శా శ 1221) బడవర బెలిదేవశెట్టి ప్రస్తావన గలదు బడవర అంటే పడిహారి పన్నువసూలుచేయువాడు బడిహారి అంటే కన్నడంలో గొప్పవాడు

**బండారు : భండారు :** దీని అసలు రూపం భండారము. భాండాగారము అనేది సంక్షిప్త రూపం భండాగారమంటే వివిధ వస్తు సంచయాన్ని ఉంచేచోటు అయితే దీనికి కోశాగారమనే వ్యవహారం కూడ వుంది. ఈ విధంగా భాండాగార అధ్యక్షులకు, కోశాగార అధ్యక్షులకు, బండారు లేక భండారు అనేది కుటుంబనామమైంది

వీరశైవ మత ప్రచారోద్యమకర్త బసవన్న బండారు బసవన్నగా చెప్పబడ్డారు నిజానికి ఇక్కడ బండారు అనేది ఆయన ఇంటిపేరుగాదు. ఆయన ఇంటిపేరు. మండెగ ఇలా భావించడానికి కారణం ఆయన తండ్రిని మండెగ మాదిరాజుగా చెప్పడం జరిగింది అయితే బసవన్న, బండారు పేరుతో గుర్తింపబడడానికి కారణం ఆయన బిజ్జలుని వద్ద భండాగారాధ్యక్షునిగా పనిచేయడం ఈ గృహనామంతో ఆంధ్రదేశానికి బాగా పరిచయమైన వారు బండారు అచ్చమాంబగారు

**బండి - బళ్ల :** బండిపై బహువచనం చేరితే బళ్లు అయి, దాని ఔపవిభక్తిక రూపం బళ్లగా రూపొందుతుంది బండి ఇంటిపేరుగా గల వారున్నారు బండి వాహనంగా తెలిసిందే కాని ఇంటిపేరు ఆ అర్థంలో వచ్చినది కాకపోవచ్చు దీనికి అవకాశం ఇస్తున్నది బళ్ల అనే పేరుతో గల గ్రామం ఇది కంగుంది డివిజన్‌లో వుంది బండి పై బహువచనమే గాక బండపై బహువచనం కూడ బండ్ల, బళ్ల కావచ్చును బండి (వాహనం) అనే అర్థంలో కూడ అలాంటి బహువచన రూప వ్యవహారం లేకపోలేదు ఉదా ఎడ్లబళ్లు అయితే గ్రామనామంలోనిది వాహనం సంబంధికాదు ఇది ఒక రకం మొక్క బండ్లమోటు అనే గ్రామం దీనిని పట్టి ఇస్తోంది ఈ గ్రామం గుంటూరుజిల్లాలో కృష్ణానది సమీపంలో వుంది బండ అనేగ్రామం తూర్పుగోదావరి జిల్లాలో ఉంది. బండి కూడ ఇంటిపేరుగా వుంది. బండివారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది

**బండ్లమూడి :** ప్రకాశంజిల్లా గ్రామం.

**బత్తల :** చిత్తూరు జిల్లాలో ఒక జాతిజనులు బత్తలచంగమనాయుడు ఖంద్రిక తిరుత్తని తాలూకాలో వుంది

**బత్తినేని :** భక్త శబ్దం ఇచ్చట బత్తిగా పరిణమించింది శా శ 1381 నాటి విజయవాడ శాసనాలో ఒక బత్తినేని పెరారి కొడుకు శ్రీగిరిభక్తుడు పేర్కొనబడ్డాడు. అంతేగాక ఆ, పెరారి బోగం బత్తినేనిగా పేర్కొనబడ్డాడు దీనిని బట్టి నేని అనే కుటుంబాలవారు అనేక వర్గాల్లో ఉన్నట్లు, గృహనామాలకు చెందిన వ్యక్తినామాలు కూడా అనేక వర్గాల్లో ఉన్నట్లు

స్పష్టమవుతుంది ఈ వివరణకు కారణం, బత్తినేని వారు కమ్మ కులంలో కూడ వున్నారు అయితే భోగి శబ్దానికి గ్రామాధికారి అనే అర్థంకూడ వుంది.

**బద్దిసెట్టి :** వ్యక్తినామం ఇందలి బద్దిశబ్దం భద్రనుండి ఉత్పన్నమైంది శా శ 1213నాటి బాపట్ల శాసనంలో ఒక బద్దిసెట్టి మరెబోయుని ప్రస్తావనవుంది అయితే బద్దిపూడి, బద్దిపోలు అనేగ్రామాలు కూడా వున్నాయి. కనుక ఆగ్రామాల ప్రథమావయవం కూడా కావచ్చు అలా వచ్చిన వ్యక్తి నామాలుకూడా వున్నాయి

**బల్లిసెట్టి :** వ్యక్తినామం కొలనుపాక శాసనాల్లో ఒక బల్లిసెట్టి మైలిసెట్టి ప్రస్తావన వుంది

**బద్దెపూడి :** ప్రకాశంజిల్ల కందుకూరు తాలూకాగ్రామం

**బందా:** బంద అనే గ్రామం బిస్సంకటాకు ఏజెన్సీగ్రామం బందాకనక లింగేశ్వరరావు ప్రసిద్ధనటులు.

**బంధనీడి :** వ్యక్తినామం బంధము తెలిసిందే. అయితే ఇది ఆ అర్థంలోనిది కాదు గ్రామనామ సంబంధమైనపదం. బోరుబంద, బందంరావూరు వంటిగ్రామాలున్నాయి గ్రామంలో కొంతభాగాన్ని అగ్రహారం చేయడం, తెలిసిందే అలాగే కొంత భాగాన్ని విడదీసి దానిని ఎవరికైనా ఇచ్చినపుడు ఆ భాగాన్ని వరం అనడం వుంది బంద కూడా అలాంటిదే కేవలం బంధ అనే గ్రామం కూడా వుంది దీనికి మూలం మళ్లీ బంధమే అలా విడదీసి ఆ భాగాన్ని దేవాలయాలకు ఇవ్వడం వుంది దానిపై అధికార్లు బందంవారు బందాఅనేవారు అనే వ్యవహారం వుంది ఇక్కడ బంధశబ్దం అలావచ్చింది దానిపై నాయకసంబంధి నీడి చేరింది.

**బమ్మరాజు:** వ్యక్తినామం బమ్మ, బ్రహ్మశబ్దభవం. శా శ1355 నాటి రాజంపేట తాలూకా నందలూరు శాసనంలో తంగటూరి గ్రామకరణం బమ్మరాజు వరదన్న ప్రస్తావన గలదు

**బలగ :** శ్రీకాకుళంజిల్లా గ్రామం. శా.శ. 1130 నాటి ముఖలింగం శాసనాలలో ఒక బలగ సూరపనాయకుని ప్రస్తావన వుంది బలగ అనేగ్రామం శ్రీకాకుళం తాలూకాలోవుంది

**బలభద్ర పాత్రుని :** విజయనగర పాలకులైన గజపతులకు విశ్వాసపాత్రులైన మండలపాలకులు పాత్రులుగా వ్యవహరింపబడ్డారు ఇందులో అధికులు మహాపాత్రులుగా సంభావింపబడ్డారు. ఇక్కడ బలభద్ర అనేది వ్యక్తినామం కాదు. గ్రామనామం మాత్రమే అంటే ఆ గ్రామంకేంద్రంగా గల ప్రాంతానికి అధికారి. బలభద్రగ్రామం గొలుగొండ ఏజెన్సీ లో వుంది.

**బలిజేపల్లి :** ఈ గ్రామం గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలోనిది ఇది సమాజంలోని ఒక వర్గం పేరుమీదుగా ఏర్పడింది. బలిజ అనేపదం వణిజ శబ్దం నుండి ఉత్పన్నమైనది

**బలివాడ :** శ్రీకాకుళంజిల్లాగ్రామం. బలివాడ కాంతారావు నవలారచయిత

**బలుసు - బులుసు :** ప్రత్యేకంగా ఈ శబ్దంతో గ్రామాలు లేవు కాని బలుసుమూడి, బలుసుపల్లి బలుసుపాడు అనేగ్రామాలు ఉన్నాయి. ఈ బలుసు ను బులుసు అని కూడా కొందరు వ్రాస్తారు బులుసు ఒక రకం తీగెమొక్క బ్రతుకుంటే బలుసు ఆకుతిని బ్రతుకవచ్చు అనే సామెత విని వుంటారు కపిలేశ్వరపురం జమీందారులు బలుసువారు.

**బలసాని - బల్లసాని :** వ్యక్తినామం శా శ. 1143 నాటి కొణిదెన శాసనంలో కొణిదెన రాజైన బల్లాసాని ప్రస్తావన వుంది.

**బల్లెం :** ఆయుధవిశేషం ఇక్కడ పౌరుషనామంగా వర్తించింది శా శ. 1491 నాటి దోన్ తాలూకా గుండాల శాసనంలో ఒక బల్లెం తిరుమలయ్య ప్రస్తావన వుంది.

**బసివిరెడ్డి - బసిరెడ్డి :** వ్యక్తినామం బసవశబ్దం నుండి వ్యుత్పన్నమైనది బసి బసిరెడ్డిపాలెం కందుకూరు తాలూకాలో వుంది బసవశబ్దానికి మూలం వృషభ శివుని వాహనం

**బాదాల :** ఈ పేరు గల గ్రామం గజపతినగరం తాలూకాలో వుంది బాదాల రామయ్య సాహితీలోకానికి పరిచితులు.

**బాణాల :** బాణములపై బహువచన బాణాల అవుతుంది శా శ. 1453 నాటి గుంటూరుజిల్లా ఎనమదల శాసనంలో, బాణాలవీరయ అనే వ్యక్తి పేర్కొనబడ్డాడు బాణాం అనే గ్రామంచీపురుపల్లె తాలూకాలో వుంది

**బాలా, బాల :** బాళ అనేగ్రామం కర్నాటకలోని మంగుళూరు తాలూకాలో వుంది అయితే బాల ఇంటిపేరుకు ఇది ఆకరమగునో కాదో చెప్పలేము.

**బాలనేని :** వ్యక్తినామం. బాలనాయని పల్లె సేలంజిల్లా కృష్ణగిరి తాలూకాలో వుంది.

**బాలాంత్రపు :** ఇది బాలాంత్రంపై ఔపవిభక్తకరూపం. బాలాంత్రం అనే గ్రామం తూర్పుగోదావరి జిల్లా రామచంద్రాపురం తాలూకాలో వుంది బాలాంత్రపు రజనీకాంతరావు ప్రముఖులు.

**బాలినేని :** వ్యక్తినామం. బాలశబ్దనుండి బాలిశబ్దం వ్యుత్పన్నమైంది. బాలయ్య, బాలమ్మ అనేపేర్లు తెలిసినవే దానిపై నేని చేరింది.

**బాలిరెడ్డి:** బాలశబ్దం బాలిగామారి, రెడ్డితో కూడి వ్యక్తినామమైనది. బాలిరెడ్డి కొండిరెడ్డిపల్లి అనేగ్రామం చంద్రగిరి తాలూకాలో వుంది

**బాస - బాచి :** బాచిగొండ హళ్లి హడగల్లి తాలూకాగ్రామం. అందలిపూర్వపదం గృహనామం అయివుండవచ్చు.

**బాసంగి :** పార్వతీపురం తాలూకాగ్రామం.

**బిక్కసాని :** వ్యక్తినామం. బిక్క భిక్ష శబ్దభావం కాగా అల్పము అనే అర్థాన్ని కూడ ఇస్తుంది. బిక్కసాని వెంగమనాయుడు ఖండ్రిక తిరుత్తని తాలూకాగ్రామం.

**బిట్రా :** గ్రామనామ పూర్వపదం. బిట్రగుంట.

**బిసాళి :** శా.శ. 1316 నాటి సింహాచలం శాసనంలో ఒక బిసాళిపెద్ది ప్రస్తావన వుంది. మరొక శాసనంలో బిసాళిభీమన ప్రస్తావన వుంది. బిసణిగా కూడ చెప్పబడింది. మరొకశాసనంలో బిసువళి అని కలదు. బిసాళి అనేగ్రామం జయపురం ఏజెన్సీలోవుంది.

**బిసుపల్లి :** గ్రామనామం శా.శ. 1383 నాటి సింహాచలం శాసనంలో ఒక బిసుపల్లియ బసవన ప్రస్తావింపడ్డాడు. సాలూరుతాలూకా గ్రామం.

**బీరం :** ఇది ఒక మొక్క. బీరంగి అనేగ్రామం చిత్తూరుజిల్లాలోను, బీరం అనే పేరుతో రెండుగ్రామాలు పాడువా ఏజెన్సీలోను వున్నాయి. బీరం సుందరరావు రచయిత.

**బీర్నీడి :** వ్యక్తినామం. బీర, నీడు బీర్నీడు అయింది. ఇది వీర శబ్దం కావచ్చు. అలా కాక గ్రామనామ ప్రథమావయవం కూడకావచ్చు. బీరం పేరుతో శ్రీకాకుళం జిల్లాలో గ్రామాలున్నాయి.

**బుదాయి :** గ్రామనామం. శాశ 1348 నాటి సింహాచల శాసనంలో ఒక బుదాయి జీయన ప్రస్తావన గలదు.

**బుదుమూరి :** గ్రామనామం. ఔపవిభక్తికరూపం. శా.శ 1076 నాటి ముఖలింగం శాసనాలలో అత్రేయ గోత్రుడైన ఒక బుదుమూరి దామినాయకుని ప్రస్తావన వుంది.

**బుద్ధా -బుద్ధిరాజు :** ఇది వ్యక్తి నామసంబంధి. గుంటూరుజిల్లా నాదిండ్లకు చెందిన శాసనాల్లో ఒక బుద్ధ మండలికుని పేర్కొనడం జరిగింది. ఇతడు గిరిపశ్చిమ సీమకు అధిపతి. అనగా కొండవీడుకు పడమటిప్రాంతం. బుద్ధుని స్మరిస్తూ వ్యక్తినామాలు ఉంచడం ఆంధ్రదేశంలో నేటికీ వుంది. బుద్ధవరం గన్నవరం తాలూకాగ్రామం. బుద్ధిరాజు వారు నియోగి బ్రాహ్మణుల్లో వున్నారు.

**బురదగుంట :** ఈ పేరుతో రెండు గ్రామాలు పాడువా ఏజెన్సీలో వున్నాయి.

**బుర్రా:** బుర్రావారి గొల్లలవలస చీపురుపల్లి తాలూకాగ్రామం.

**బూదవాడ :** ప్రకాశం జిల్లా గ్రామం.

**బూదరాజు :** వ్యక్తినామం. బూద (వాడ) గ్రామానికి చెందిన గ్రామాధికారి అనే అర్థంలో వచ్చి వుండవచ్చును. బూద శబ్దంతో చాల గ్రామాలున్నాయి. బూదరాజు రాధాకృష్ణ భాషావేత్త.

**బూరాడ :** రాజాంతాలూకాగ్రామం.

**బూరెల :** బూరెలు భక్ష్యవిశేషం. కాగా బూర్లెండి అనేగ్రామం. గుణపురం ఏజెన్సీలో వుంది.

**బూర్గుల:** బూరుగుల అనేగ్రామం ప్రకాశం జిల్లా కంభంతాలూకాలో వుంది. బూర్గుల రామకృష్ణరావు గవర్నరుగా పనిచేశారు.

**బృందావనం :** వైష్ణవుల్లో ఇది ఇంటి పేరుగా కన్పిస్తుంది. బృందావన శబ్దాన్ని బృందారణ్యంగా కూడా సంభావిస్తారు. సంస్కృతీయులు బృందావనంగా సంభావిస్తారు. బృంద శబ్దానికి అధిక్యము, గుంపు, మంద అనే అర్థాలున్నాయి. ఈ అర్థంలోనే వాద్య బృందం, నాటక బృందం లాంటి పదాలు వ్యవహారంలోకి వచ్చాయి. అయితే బృందావనం శబ్దం, రాధాదేవి ఉద్యానవనమనే అర్థంలో రూఢ్యం. అల కాపరి గోపాలుని విహారభూమి. యమునానది వామ పార్శ్వానగల గోకులపట్నానికి సమీపానగల అడవిని బృందావనంగా భావిస్తారు. బృంద లేక వృంద శబ్దానికి తులసి మొక్క అనే అర్థం వుంది. వైష్ణవస్వాములకు అత్యంతము పూజనీయమైనది గదా తులసి. కనుక వైష్ణవ సంబంధిగా అ పేరు వచ్చియుండవచ్చునని భావించడంలో తప్పులేదు. అయితే నిజానికిది గ్రామ నామం. పైన వివరించిన మధుర జిల్లాలోని యమునానది ఒడ్డున కల గ్రామం కాదు. అంధ్రదేశంలోనే టెక్కలి, దరిశి, కనిగిరి తాలూకాలలో ఈ పేరుతో గ్రామాలున్నాయి. గంజాం జిల్లాలో నాలుగు గ్రామాలున్నాయి. అంధ్రదేశంలో ఈ ఇంటి పేరు గల వారికి అకరమైనవి అంధ్రదేశంలోని గ్రామ నామాలనడంలో సందేహంలేదు. అయితే అ పేరుతో గ్రామాలేర్పడడానికి కారణం ఉత్తరభారతంలోని బృందావనమే. ఉత్తర భారతంలోని కొన్ని గ్రామాల పేర్లు, శ్రీకాకుళం జిల్లాలో కన్పిస్తున్నాయి. దీనికి కారణం క్రీస్తు పూర్వం 3వ శతాబ్దం నుండి క్రీస్తు శకం మూడవ శతాబ్ది వరకూ దక్షిణాదికి సాగిన వలస. శా.శ. 1323 నాటి సర్పవరం శాసనంలో ఒక బ్రిందావనము శ్రీలక్ష్మణయ్య ప్రస్తావన కలదు.

**బెజవాడ :** విజయవాడ శాసనాల్లో ఒకదానిలో పెచ్చవాడ అని వ్రాయబడింది. అయితే దీనిని బెజ్జవాడగానే చదవాలి. 15వ శతాబ్దవరకు సరళాలకు బదులు పరుషాలు వ్రాయడంవుంది. బెజవాడ గోపాలరెడ్డి ముఖ్యమంత్రిగా పనిచేశారు.

**బెల్లం:** ఖాద్య పదార్థంగా బెల్లం తెలిసిందే. ఇలా వ్యస్తంగా కాకుండా, బెల్లంపల్లి, బెల్లంకొండ అనే గ్రామాలున్నాయి. అ గ్రామ నామాలు గృహ నామాలుగా గలవారు ఉన్నారు. బెల్లం ప్రధానంగా వ్యాపారం చేసినవారికి ఈ గృహ నామం వర్తించి యుండవచ్చును. లేక గ్రామనామాల్లోని బెల్లం శబ్దపరంగా కూడా వచ్చియుండవచ్చును. అంటే కొండ, పల్లె అనే వివక్షకు పూర్వం, అ రెండు గ్రామాలకు బెల్లం పేరు గావచ్చును. బెల్లాం అనేగ్రామం అనకాపల్లి తాలూకాలోవుంది ఇంటి పేర్లలో ఇలా వ్యస్తంగా చాల కన్పిస్తున్నాయి. ఉదా: ఎడ్ల, ఎడ్లపల్లి, ఎడ్లపాడు, అకిరి, అకరిపల్లి, గార, గార్లపాడు, గుత్తి, గుత్తికొండ, గోళ్ళ, గోళ్ళమూడి. అయితే గుత్తి, గోళ్ల అనే పేరుగల గ్రామాలు అనంతపురం జిల్లాలో వున్నాయి. ఈ సందర్భంలో బెల్లం మొక్క పేరు. స్త్రీల వ్యవహారంలో పురుషాంగానికి పర్యాయపదం బెల్లం. ఈ మేరకు కవి (ముద్దుపళని) ప్రయోగం కూడ వుంది. ఇక్కడ ఖాద్యపదార్థానికి గల భావనే వర్తిస్తుంది. ఇంతకూ ఇది బేల నుండి వ్యుత్పన్నమైనది. బేలపరచునది బెల్లం.

**బెల్లంకొండ :** గ్రామనామం. బెల్లంకొండ వారిపాలెం దర్శి తాలూకాలోవుంది.

**బేడి :** శా శ 1327 నాటి సింహాచలం శాసనంలో ఒక బేడి నరసింహ నాయకుని ప్రస్తావన వుంది. మరికొన్ని శాసనాలలో కూడ ఈ గృహానామం కన్పించింది అంజనేయస్వామిని బేడి అంజనేయస్వామిగా అర్చించడం కలదు బేడింగి అనే గ్రామం రామగిరి తాలూకానావుంది.

**బేతవోలు :** కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాగ్రామం జగ్గయ్యపేట పూర్వనామం కూడా బేతవోలు. బేతవోలు రామబ్రహ్మం తెలుగు విశ్వవిద్యాలయ ఆచార్యులు.

**బొక్కసం :** 'దేవాలయానికి సంబంధించిన పనిపాటల్లో నిమగ్నమైన వారుగా శాసనాల్లో ప్రస్తావింపబడ్డారు 'ఈ గ్రామాలపారుపత్యం చేసి స్వయంపాకులను తిరువారాధకులను పరిచారకులను బొక్కస భండారాలువుగ్రాణము మొదలైన పనులకు' అనేవిధంగా కీ శ 1478 నాటి శాసనంలో చెప్పబడింది.' బొక్కసం అంటే దేవాలయకోశాగారం. ప్రభుకోశాగారం కూడా శా శ పులివెందల తాలూకా ముటుకూరు శాసనంలో ఒక బొక్కసం తిమ్మానాయని ప్రస్తావన వుంది. శాశ 1496నాటి సత్తెనపల్లి తాలూకా అమీనాబాదు శాసనంలో ఒక బొక్కసం కొండమనాయని ప్రస్తావన వుంది ఇతడు చతుర్థ గోత్ర పవిత్రునిగా చెప్పబడ్డాడు

**బొజ్జ :** వ్యవహారంలో బొజ్జా అయింది. శరీరావయవంగా బొజ్జ తెలిసిందే అయితే గృహనామానికి ఆకరమైనది గ్రామనామం. బొజ్జనత్తం అనే గ్రామం చిత్తూరుజిల్లా పుంగనూరు తాలూకాలో వుంది.

**బొట్టు :** దివితాలూకా శ్రీకాకుళం శాసనాల్లో ఒక బొట్టు శ్రీరామభద్రుడు పేర్కొనబడ్డాడు అయితే ఇప్పుడు ఈ ఇంటి పేరుందో లేదో తెలియదు. బొడ్డు ఇంటిపేరుగా వుంది శాసన సంవత్సరం భాగం శిథిలమైపోయింది అయితే 15వ శతాబ్దం వరకు సరళాక్షరాలకు బదులు పరుషాక్షరాలు వ్రాయడంకూడా వుంది అయినపుడు అది బొడ్డు అవుతుంది బొడ్డుపల్లె అనే గ్రామం కృష్ణానదీ గర్భంలో కలసిపోయింది బొడ్డు చెర్ల అనేగ్రామముంది

**బొడ్డుచెర్ల :** మార్కాపురం తాలూకాగ్రామం. ఇది తొండమారెగుళ్ల సీమలోనిదిగా శాసనాల్లో చెప్పబడింది.

**బొడ్డేపల్లి :** గొలుగొండ తాలూకాగ్రామం. బొడ్డుపల్లి కూడా గ్రామనామం బొడ్డుపల్లి పురుషోత్తం సాహితీ లోకానికి పరిచితులు.

**బొంతల :** గ్రామనామం శా శ. 1546 నాటి నందికొట్కూరు తాలూకా నాగలూటి శాసనంలో విచ్చుపాకుల గోత్రజుడు, వైశ్యుడునైన ఒక బొంతల నాగిశెట్టి ప్రస్తావన గలదు

**బొంతు :** పర్లాకిమిడి తాలూకా గ్రామం

**బొందలపాటి :** మార్కాపురం తాలూకాగ్రామం ఇది తొండమారెగుళ్ళ సీమలోనిదిగా శాసనాల్లో చెప్పబడింది

**బొప్పన :** ఇది వ్యక్తినామమైన బొప్పనాయకుని నుండిగాని బొప్పదేవని నుండి గాని ఉత్పన్నమై వుంటుంది. బొప్ప అంటే కన్నడంలో తండ్రి అనే అర్థముంది. బోయపశబ్దంకూడ బొప్ప అవుతుంది. దానికి మూలం భోజశబ్దం. ఇది భోక్త అనే అర్థాన్నిస్తుంది. బోయ శబ్దం దేవాలయంపై అధికారిని సూచిస్తుంది. శా.శ.1347 నాటి పులివెందల తాలూకా మోపూరు శాసనంలో బుక్కరాయల నిజభృత్యునిగా ఒక బొప్పదేవని విరుపణ్ణ ప్రస్తావింపబడ్డాడు.

**బమ్మరాజు:** వ్యక్తినామం. బమ్మ, బ్రహ్మశబ్దభవం. శా.శ1355 నాటి రాజంపేట తాలూకా నందలూరు శాసనంలో తంగటూరి గ్రామకరణం బమ్మరాజు వరదన్న ప్రస్తావన గలదు.

**బొమ్మారెడ్డి - బొమ్మిరెడ్డి:** వ్యక్తినామం. బ్రహ్మశబ్దభవం. శా.శ.1446 నాటి మదనపల్లి తాలూకా కమ్మేపల్లి శాసనంలో ఒక బొమ్మిరెడ్డి తిప్పన ప్రస్తావన వుంది.

**బొమ్మిడి - బొమ్మిడాల :** ఈ రెండు గ్రామనామాలే. బొమ్మిడి అనే గ్రామం పశ్చిమగోదావరి జిల్లా తాడేపల్లిగూడెం తాలూకాలోవేంది, బొమ్మిడాల అనేగ్రామం కూడా వుంది.

**బొమ్మ - బొమ్మా:** బ్రహ్మశబ్ద వికృతి. బొమ్మవానిపాలెం తెనాలి తాలూకాగ్రామం.

**బొమ్మూరు :** రాజమండ్రి తాలూకాగ్రామం.

**బొలిశెట్టి:** వ్యక్తినామం శా.శ. 1718 నాటి పెదకళ్లేపల్లి శాసనంలో బొల్లిశెట్టి తిమ్మశెట్టి ప్రస్వావనవుంది. బుల్లి బొల్లగా పరిణమించింది.

**బొల్లినేని :** ఇది వ్యక్తినామపరంగా వచ్చినది. బొల్లి అనేది చర్మసంబంధమైన వ్యాధి. అయితే ఇది దానికి సంబంధించినది కాదు. బుల్లి అంటే చిన్న అని అర్థం. బుల్లెమ్మ, బుల్లోడు అనడం తెలిసిందే. గుంటూరు జిల్లాలో బొల్లయ్య అనేవిధంగా పేర్లు విన్పిస్తాయి. శా.శ 1191 నాటి గుంటూరుజిల్లా కాజ గ్రామశాసనంలో, కాకతీయ రుద్రదేవమహారాజుల చప్పరమువాకిట అంగరక్షకుడైన ఒక బొల్లి నాయకుని ప్రస్తావన వుంది. శా.శ.1200 నాటి వినుకొండ తాలూకా ఈవూరు శాసనంలో కాకతీయరుద్ర దేవమహారాజుల అంగరక్ష అయిన ఒక బొల్నాయిని ప్రసక్తి కలదు. దాని సంక్షిప్త రూపం బొల్లా.

**బ్రహ్మసాని :** వ్యక్తినామం. బ్రహ్మశబ్దంపై సాని చేరివ్యక్తినామమై అనంతరకాలంలో అతడు మూలపురుషుడుగాగల కుటుంబాలకు గృహనామమైంది.

**భట్ట - భట్టు :** బిరుదనామం. శా.శ. 950 నాటి కూడలి సంగమేశ్వర శాసనంలో భట్టచెన్నరాయని ప్రస్తావన వుంది.

**భట్టరు - భట్టరి :** బిరుదనామం. శా.శ 1284 నాటి సింహాచలం శాసనంలో ఒక భట్టరి పురాయిభట్టు ప్రస్తావన వుంది.

**భట్లపెనుమర్తి :** భట్లపెనుమర్రు అనేగ్రామం కృష్ణాజిల్లా దివితాలూకాలో వుంది. ఇది దాని ఔప విభక్తిక రూపం.వల్లభాభ్యుదయకర్త భట్లపెనుమర్తి కోందండరామకవి.

**భండారు:** 'దేవాలయానికి సంబంధించిన పనిపాటల్లో నిమగ్నమైన వారుగా శాసనాల్లో ప్రస్తావింపబడ్డారు. ' ఈ గ్రామాలపారుపత్యం చేసి స్వయంపాకులను తిరువారాధకులను పరిచారకులను బొక్కస భండారాలువుగ్రాణము మొదలైన పనులకు' అనేవిధంగా కీ.శ 1478 నాటి శాసనంలో చెప్పబడింది.' భండారము అంటే వస్తువులు దాచివుంచే చోటు, దేవాలయం, రాజగృహసంబంధి.

**భండు:** శా.శ. 1313 నాటి నాటి సింహాచలం శాసనంలో ఒక భండు సాహసమల్లుని ప్రస్తావన కలదు. ఇది బంటుకావచ్చును.

**భద్రరాజు - భద్రిరాజు:** భద్రశబ్దంపై రాజు. భద్రరాజు ఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది. భద్రిరాజు కృష్ణమూర్తి ప్రముఖ భాషాశాస్త్రవేత్త.

**భద్రి :** పర్లాకిమిడి తాలూకాగ్రామం.

**భమిడిపాటి :** భమిడిపాడుకు ఔప విభక్తిక రూపం. నిజానికి దీని పూర్వరూపం పమిడిపాడు. పమిడి లేక పైడి అనేది ఒక మొక్క, పత్తిలో ఒక రకాన్ని పమిడి పత్తి అనడం తెలిసిందే. పైడిపాల, పైడిముక్కల (పమిడిముక్కల) కూడా వేర్వేరు మొక్కలు. ఈ భమిడిపాడు ఇంటిపేరు సాధారణంగా బ్రాహ్మణ కుటుంబాల్లో కన్పిస్తుంది. ఉచ్చారణలో పకారం బకారమైంది. భ కారంగా స్థిరపడింది. భమిడిపాటి కామేశ్వరరావు రచయిత.

**భవన :** శా.శ. 1314 నాటి సింహాచలం శాసనంలో ఒక భవన నరసింహన్న ప్రస్తావన వుంది. భవనం వారు కూడా వున్నారు. భవనం వెంకట్రాం ప్రముఖులు.

**భసిలి :** గ్రామనామం. శా.శ. 1335 నాటి సింహాచల శాసనంలో ఒక భసిలి వీరయ ప్రస్తావన వుంది.

**భాగవతుల:** భగవత్ సంబంధమైనది భాగవతం. ఆ భాగవతం తోడి అధిక పరిచయంగల అంటే దానిని వ్యాఖ్యానించే కుటుంబాలకు ఈ పేరు వచ్చి వుండవచ్చు. మరొక పద్ధతిలో భగవత్ కథలను దృశ్యరూపంగా ప్రచారం చేసే కుటుంబాలకు ఇది ఇంటి పేరుగా స్థిరపడి యుండవచ్చు. నాట్యంలో కూచిపూడి సంప్రదాయం తెలిసిందే. ఆ గ్రామంలోని బ్రాహ్మణ కుటుంబాలు ఈ సంప్రదాయానికి మీదు కట్టిన వారు. వారిని కూచిపూడి భాగవతులుగా సంభావించడం కలదు. వెనుకటి తరాలలో ఆయా వర్గాల వారు నాటకాలు ప్రదర్శించడం, దానినే వృత్తిగా స్వీకరించడం కూడా జరిగింది. ఆ వర్గాల పేరుతో యానాది భాగవతులు, గొల్ల భాగవతులని సంభావించడం కూడా కలదు. అయితే భాగవతుల అనే ఇంటి పేరు బ్రాహ్మణ కుటుంబాలకే పరిమితమైనది. ప్రముఖ రచయిత ఆరుద్రగారి గృహనామం ఇదే. శా.శ. 1495 నాటి బాపట్ల తాలూకా వల్లూరు శాసనంలో శ్రీరంగదేవ మహారాయ కార్యకర్త అదప నాగప్పనాయనింగారు ఆత్రేయ గోత్రజుడైన భాగవతుల

రంగమంగారికి కొంత భూమి ఇచ్చినట్లు సమాచారం. శా.శ. 1316 నాటి శాసనంలో ఒక భాగవత నరసన్న ప్రస్తావన వుంది. శా.శ. 1272నాటి సింహాచలంగానంలో పురుషసూత్రం చదివే కేశవభాగవతుని ప్రస్తావనవుంది. భాగవత పట్టాభిరామపురం తిరుత్తని తాలూకాలో వుంది.

**భారతుల:** మహాభారతం తెలిసిందే. భారత శబ్దంపై బహువచనం చేరి భారతుల ఏర్పడుతుంది. అంటే భారతం చదివి వ్యాఖ్యానం చెప్పే కుటుంబాలకు ఇది ఇంటి పేరుగా స్థిరపడిందని చెప్పడం సులభమే. లేక భారతదేశపు వారు అని కూడా చెప్పవచ్చు. భరత సంబంధమైన గాథ భారతం. మనదేశం భారతదేశం. దీనికా పేరు భరతుని (భారత కథా సంబంధం) వలన వచ్చిందని భావించడం కద్దు. రామాయణంలో కూడా భరతుడున్నాడు. భరత శబ్దానికి, అగ్ని, రుద్ర, పార్వతీయుడు, ఒక నది ఇలా చాలా అర్థాలున్నాయి. ఒక మనువు కూడా. మేరు పర్వతానికి దక్షిణాన ప్రకాశించే సూర్యుని భారత అని సంభావించడం కలదు. ఆ కాంతి పడినంత మేర భారతదేశమని ఒక భావన.

పై విధంగా భారత శబ్దంపై బహువచనం చేరి కూడా భారతుల అవుతుంది. సరస్వతి, శబ్దం, వాగ్ధార, సాహిత్య ప్రక్రియ, నాటక కళ ఇలాంటి అర్థాలు భారతి శబ్దానికున్నాయి. నాటకంలో నటుడు చేసే సంస్కృత భాషణానికి కూడా భారతి పేరు. శంకరాచార్య శిష్యపరంపరలో గల దశవిధ స్థాయులలో ఒక స్థాయిని భారతి శబ్దంతో సంభావించడం కద్దు. అట్టి వారి పేరు చివర భారతి అనేది బిరుదు నామంగా చెల్లివస్తుంది. బహుశా ఆ సంప్రదాయానికి చెందిన బ్రాహ్మణ కుటుంబాలకు ఇది ఇంటిపేరుగా పరిణమించి యుండాలి.

**భాష్యం :** భాష్యం అంటే ఏదైనా శాస్త్రగ్రంథాన్ని వ్యాఖ్యానించడం అని సామాన్యార్థం. నిజానికి బ్రహ్మసూత్రాలకు గల వ్యాఖ్యానం భాష్యం. శా.శ. 1569నాటి శ్రీకూర్మం శాసనాలలో ఒక భాష్యం అప్పలాచార్యుల ప్రస్తావన వుంది. ఇతడు కౌండిన్యగోత్రజుడు. వీరు శ్రీకూర్మక్షేత్ర స్థాపనాచార్యులుగా చెప్పబడింది.

**భాస్కరభట్ల :** వ్యక్తినామం. పెద్దాపురం తాలూకా తిరుపతి శాసనంలో భాస్కరభట్ల వారిప్రస్తావన గలదు.

**భీమవరపు :** భీమవరం పేరుతో చాలగ్రామాలున్నాయి. కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాల్లో గలవి ఉదాహరణలు. దానిపై ఔపవిభక్తిక రూపం భీమవరపు.

**భువనగిరి :** నల్గొండజిల్లాగ్రామం. ఇతరచోట్ల కూడా వున్నాయి.భువనగిరి వారి ఖండ్రిక కందుకూరుతాలూకా గ్రామం.

**భూతనాథుని :** భూతనాథుడు శివుడు. వ్యక్తినామం శా.శ1458 నాటి మార్కాపురం శాసనంలో ఒక భూతనాథుని రామాభట్లు ప్రస్తావింపబడ్డాడు.

**భూదారం :** శా.శ. 1448 నాటి అలంపురం శాసనంలో భూధారం పెద్దినాయని ప్రస్తావన గలదు. భూదరం అనగా పర్వతం. బహుశా కొండకు ఇది సంస్కృతీకరణం గావచ్చు

**భూమి :** శా.శ 1285 నాటి సింహాచలం శాసనంలో భూమి పెరుమాండి ప్రస్తావన వుంది ఈ ఇంటి పేరుగల వారి ప్రస్తావన ఇంకాకొన్ని శాసనాల్లో కూడ వుంది భూములలంక నూగూరు తాలూకాగ్రామం.

**భూమిరెడ్డి :** భూమయ అనేది వ్యక్తినామం. శా శ 1456నాటి ధర్మవరం తాలూకా కనగానిపల్లె శాసనంలో భూమిరెడ్డి చెన్నమరెడ్డి ప్రస్తావన గలదు ఇతడు ఆ గ్రామానికి రెడ్డిగా చెప్పబడింది

**భూసురపల్లి :** ప్రకాశంజిల్లా గ్రామం ఇందలి భూసుర బ్రాహ్మణ అనే అర్థంలో కాదు నిజానికది బూసర. ఇది ఒక రకం గడ్డి భూసురపల్లి వెంకటేశ్వర్లు రచయిత ప్రముఖ డోలు వాద్య విద్వాంసులు

**భోగరాజు :** వ్యక్తినామం భోగ పేరుతో గ్రామాలున్నాయి ఆ గ్రామాధికారులు అనే అర్థంలో వచ్చి, వ్యక్తినామమై గృహనామమై వుండవచ్చు భోగరాజు పట్టాభిసీతారామయ్య ప్రముఖ కాంగ్రెసు నాయకులు

**భోగవతి :** కృష్ణానది సాగర సంగమంచేసేచోట చీలిన పాయల్లో భోగవతిఒకటి పెన్న, కావేరి, వంటివి ఆపేరుతో గ్రామాలు లేకపోయినా గృహనామాలైనాయి ఇది కూడ అలాంటిదికావచ్చును లేక అమరావతి వలె భోగవతి గ్రామ నామం కావచ్చు

**భోగవోలి :** శా శ. 1316 నాటి సర్పవరం శాసనాల్లో ఒక భోగ్రవోలి కామరాజు ప్రస్తావన వుంది బహుశా బాగోలుకు రూపాంతరం కావచ్చు.

**భోగాది :** విశాఖజిల్లా గ్రామనామం. ఈ ఇంటిపేరుగల వారు నేటి కృష్ణాజిల్లా దివి తాలూకాలో వున్నారు. శాసనాల్లో రెడ్లుగా కన్పిస్తున్నారు ప్రస్తుతం కాపు కులస్థులుగానున్నారు శా శ 1693 నాటి గణపేశ్వర శాసనంలో ఈ ఇంటిపేరుగల తిప్పనరెడ్డి ముదిమనుమడు, మూర్తిరెడ్డికి మనుమడు, నాగిరెడ్డి కుమారుడు అయిన సుబ్బన్న గణపేశ్వర ఆలయంలో గణపేశ్వర మహాదేవలింగమును శాశ్వత ధర్మప్రతిష్ఠగావించినట్టు చెప్పబడింది అక్కడే గల మరొక శాసనంలో ఈ సుబ్బన ఆ ప్రాంతం ప్రభువుగా చెప్పబడ్డారు. అతని కుమారుడు జగ్గయ, గాణాపత్యలింగాన్ని ప్రతిష్ఠచేశాడు కనుక ఇచ్చటి రెడ్డిపదం పాలకవర్గాన్ని సూచించేపదంగా అర్థంచేసి కోవడం సమంజసమవుతుంది కాకినాడ తాలూక భీమవరం శాసనంలో ఒక భోగాది పోతిబోయని ప్రస్తావన వుంది

**భోగాపురం :** ఏలూరుతాలూకాగ్రామం విశాఖజిల్లాలో మరో భోగాపురం వుంది.

**భోజనపల్లి :** భోజనం అనేగ్రామం నంద్యాల తాలూకాలో వుంది.

**మక్కువ :** సాలూరు తాలూకా గ్రామం

**మంగళంపల్లి :** ఇది గ్రామనామమని తెలుస్తూనే వుంది. మంగళం అనే గ్రామం చిత్తూరుజిల్లా పుంగనూరు తాలూకాలో, తిరుత్తని డివిజన్‌లో వున్నాయి. ఇలా కేవలం మంగళం అని మాత్రమేకాక చతుర్వేది మంగళం అనేపేరుతో కూడా తమిళనాడులో గ్రామాలున్నాయి. సత్రముగల గ్రామాన్ని మంగళమంటారట. బ్రాహ్మణులు కూడా వుంటే చతుర్వేది మంగళమంటారు. నందిమంగలం పాలమంగలం అనే గ్రామాలు పుత్తూరు తాలూకాలో వున్నాయి. మంగళంపల్లి బాలమురళీకృష్ణ ప్రసిద్ధగాయకులు.

**మంగిపూడి:** గ్రామనామం. శా.శ. 1304 నాటి సింహాచలం శాసనంలో ఒక మంగిపూడి ముమ్మడి నాయని ప్రస్తావన వుంది.

**మంగొర్తి :** మంగొర్రు గ్రామనామంపై ఔపవిభక్తిక రూపం. శా.శ. 1386 నాటి శాయింపేట శాసనంలో భరద్వాజ గోత్రుడైన మంగొర్తి పిన ఔబళయ్య ప్రస్తావన వుంది.

**మంగొల్లి:** మంగొల్లు గ్రామనామంపై ఔపవిభక్తిక రూపం. శా.శ 1386 నాటి శాయింపేట శాసనంలో భరద్వాజ గోత్ర మంగొల్లి నారాణయ్య ప్రస్తావన వుంది.

**మచ్చెర్ల :** గ్రామనామం. శా.శ. 1389 నాటి శాయింపేట శాసనంలో మచ్చెర్ల తిరువెంగళనాథుని ప్రస్తావన వుంది.

**మంచికంటి :** పల్నాడు తాలూకా గ్రామం మంచికల్లుకు ఇది ఔపవిభక్తిక రూపం.

**మంచినీళ్ల :** త్రాగునీరు. కొన్ని గ్రామాల్లో మంచినీళ్ల బావులు అత్యల్పంగా వుంటాయి. ఒక్కొక్కప్పుడు అది స్వంత బావికూడకావచ్చును. అది కలిగిన కుటుంబానికి, వ్యవహారంలో ఇది గృహనామంగావచ్చును.

**మజ్జి :** దేవాలయ రాజ ఉద్యోగాల్లో ఒకటి. మజ్జిగోపాలపురం టెక్కలి తాలూకాలోవుంది. ఈ గృహనామంలో ప్రముఖులు మజ్జి తులసీదాసు. మజ్జివలస విశాఖజిల్లా గ్రామం.

**మంచెళ్ల :** గ్రామనామం. శా.శ. 1338 నాటి పాలకొల్లు శాసనంలో ఒక మంచెళ్ల పిన్నమనేని ప్రస్తావన వుంది. మంచెళ్ల వాసుదేవకవి ప్రముఖుడు.

**మంజేటి:** మంజేరుకు ఔపవిభక్తిక రూపం. శా.శ.1065 నాటి ద్రాక్షారామ శాసనంలో ఒక మంజేటి గంగిరెడ్డి పేర్కొనబడ్డాడు. మాజేరు మంజేరుగా వ్యవహరింపబడింది.

**మట్ల :** రాజంపేట తాలూకా పొత్తపి శాసనంలో మండలేశ్వరులైన మట్ల వరదయ్యదేవ చోడ మహారాజుల ప్రస్తావన వుంది. మట్ల గ్రామం చోడవరంతాలూకాలోవుంది.

**మఠం :** మత సంబంధమైన పీఠాలను, స్థానాలను మఠం అని వ్యవహరిస్తారు. మఠం అనే గ్రామం కంగుంది డివిజన్‌లో వుంది. బ్రహ్మగారి మఠం తెలిసిందే.

**మడకల:** గ్రామనామ ద్వితీయపదం. అరుమడకల, జమ్మలమడక - మడకల వారిపల్లె బద్వేలు తాలూకాలో వుంది.

**మడికి :** తూర్పుగోదావరి జిల్లా రామచంద్రాపురం తాలూకా గ్రామం. కవియైన మడికి సింగన తెలిసినవాడే.

**మడిచెర్ల :** గ్రామనామం

**మడుగు :** వ్యస్తంగా జలాశయసూచి అయితే జమ్ములమడుగు, మునిమడుగు గ్రామాల్లో నామాంత పదంగా చోటుచేసికుంది జమ్ముల, ముని అనేది మడుగును వివక్షించడానికి చేరినవి నిజానికి అవి మొదట మడుగుతోనే సంభావింప బడ్డాయన్నమాట మడుగు వారి గొంది అనేగ్రామం కదిరి తాలూకాలో వుంది

**మండ :** పార్వతీపురం ఏజెన్సీగ్రామం

**మండపం :** పెద్దాపురం తాలూకాగ్రామం

**మండల :** శా శ 1130 నాటి శ్రీకూర్మంశాసనంలో ఒక మండల తమ్మన్న ప్రస్తావన వుంది

**మండలి :** పెద్దమండలి, చిన్నమండలి పేరుతో రెండు గ్రామాలు చిత్తూరుజిల్లాలో వున్నాయి శాసనాలలో మండలికి చెందిన వ్యవసాయదారులు అనే అర్థంలో మండలి కాంపులు అనేవిధంగా ప్రస్తావింపబడ్డారు ఈ ఇంటిపేరుగల వారిలో కొందరు శ్రౌత సంబంధమైన కార్యకలాపాల వల్ల ఏర్పడిన ఇబ్బందుల వలన మండల అనే విధంగా వ్యవహరిస్తున్నారు ఈ గృహనామంతో బాగాపరిచయమైనవారు మండలి వెంకట కృష్ణారావుగారు

**మండవ :** గుంటూరుజిల్లా గ్రామం మండవ వెంకటేశ్వరరావు మంత్రిగా వున్నారు

**మండాది :** గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా గ్రామం

**మండెల :** శా శ 1482 నాటి మార్కాపురం శాసనంలో ఒక మండెల బయ్యన ప్రస్తావన వుంది

**మతుకుమల్లి :** ఈ పేరుతో గుంటూరు, తూర్పుగోదావరి జిల్లాల్లో గ్రామాలున్నాయి

**మత్తి :** ఇంటిపేరుగా దీనికి వ్యవహారముంది మత్తిగిరి అనేగ్రామం కారణంగా ఇది వచ్చియుండవచ్చు ఇది ఒకరకం గడ్డి కావచ్చును

**మదుపాడ :** శృంగవరపు కోట విజయనగరం తాలూకాల్లో ఈపేరుతో గ్రామాలున్నాయి

**మద్దాల :** శా శ. 1298 నాటి సింహాచలం శాసనంలో ఒక మద్దాల మల్లిశెట్టి ప్రస్తావన వుంది

**మద్దాళి:** ఇది గ్రామ నామం. నెల్లూరు జిల్లా గూడూరు తాలూకాలో వుంది. ఇదిగాక కృష్ణా జిల్లాలో పెదమద్దాలి, కురుమద్దాలి, ఈదుల మద్దాలి అనే గ్రామాలున్నాయి మద్దాళి లేక మద్దాలి అనేది ఒక రకం మొక్క మద్దేకు అని కూడా అంటారు ఇదిగాక మద్దిచెట్టు వేరే వుంది

**మద్ది :** భీమునిపట్నం తాలూకా గ్రామం శా శ 1298 నాటి సింహాచలం శాసనంలో ఒక మద్ది అప్పయ ప్రస్తావన వుంది మద్ది సుదర్శనం గుంటూరులో ప్రముఖ పొగాకు వ్యాపారులు

**మద్దినేని :** మద్దినాయనిపల్లె మదనపల్లి తాలూకాలో వుంది

**మద్దిపట్ల :** దివితాలూకా గ్రామం. మద్దిపట్ల వాండ్ల పల్లె అనేగ్రామం వాయల్పాడు తాలూకాలో వుంది.

**మద్దిపాటి :** మద్దిపాడు అనేగ్రామం ప్రకాశంజిల్లాలో ఉంది.

**మద్దిరాల :** గుంటూరుజిల్లాలో చిలకలూరిపేట సమీపగ్రామం.

**మద్దూరు - మద్దూరి :** ఈ పేరుతో చాలగ్రామాలున్నాయి. కృష్ణాజిల్లా విజయవాడ తాలూకాలో ఒకగ్రామంవుంది. గుంటూరుజిల్లాలో పెదమద్దూరు, చినమద్దూరు అనే గ్రామాలున్నాయి. మద్దూరి అన్నపూర్ణయ్య ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు.

**మద్దెల :** వాద్యవిశేషము. శాశ 1482 నాటి మార్కాపురం శాసనంలో ఒక మద్దెల తిమ్మన ప్రస్తావన వుంది.

**మధుపాడ :** గజపతినగరం తాలూకాగ్రామం.

**మధురాంతకం :** గ్రామనామం. శా.శ 1181 నాటి పాలకొల్లు శాసనంలో ఒక మధురాంతకు బయ్యపరెడ్డి ప్రస్తావన వుంది. మధురాంతకం రాజారాం ప్రసిద్ధ కథకులు.

**మధువన పండితులు :** శా.శ. 1076 అనాటి బాపట్లశాసనంలో ఇతని ప్రస్తావన వుంది. మధువనం సప్తవనాల్లో ఒకటి. మిగిలినవి కామ్యక, అదితి, వ్యాస, ఫల్కి, సూర్య సీతవనాలు.

**మధునాపంతుల :** బహుశా మధువన పండితులు దీనికి ఆకారం కావచ్చు. లేక వ్యక్తినామం గావచ్చును. ఆంధ్రపురాణ కర్త మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు.

**మనమూల :** గూడూరు తాలూకాలో వుంది.

**మంతెన :** గన్నవరం తాలూకాగ్రామం. మంథని అనేగ్రామం తెలంగాణంలో వుంది.

**మంత్రి :** పదవీసూచి. అయితే ఈ పేరుతో గ్రామం కూడా వుంది.

**మంత్రిప్రగడ :** వ్యక్తినామం. శా.శ. 1348 నాటి కాకినాడ తాలూకా భీమవరం శాసనంలో మంత్రి ప్రగడ సూరన ప్రస్తావన వుంది. మంత్రి గ్రామానికి చెందిన ప్రగడ కూడా కావచ్చును.

**మంత్రవాది:** మంత్ర శబ్దానికి భావ వాహిక (భాష), పవిత్ర గ్రంథం, ప్రార్థన, స్తుతి అనే అర్థాలున్నాయి. మంత్రమంటే లోకంలో తెలిసిందే. వాది అంటే వాదించేవారు. వాది, ప్రతివాది శబ్దాలు చట్ట సంబంధంగా తెలిసినవే. అయితే ఇక్కడ వాటికి ప్రసక్తి లేదు. పవిత్ర గ్రంథాన్ని వల్లించేవాడు లేదా గానం చేసేవాడని అర్థం. ముఖ్యంగా సామవేదం గానం చేయబడుతుంది.

**మంత్రాల :** చిన్న, పెద్ద వివక్షతో రెండుగ్రామాలు మార్కాపురం తాలూకాలో వున్నాయి. ఇది ఒక గడ్డిపేరు. మంత్రాక్షరాలకు సంబంధించినది కాదు.

**మందడపు, మందలపు, మందడి - మందడం - మందారపు :** వీటి అన్నింటికి ఆకరమైనది మందడ గ్రామం. ఇది గుంటూరుజిల్లా మంగళగిరి తాలూకాలో వుంది. చరిత్ర ప్రసిద్ధిగల గ్రామం. కాకతి గణపతి పాలనా కాలంలో విశ్వేశ్వర శివాచార్యులు ఇక్కడ గోళకీమఠాన్ని, శివాలయాన్ని, నిర్మించడం జరిగింది.

**మన్నవ :** బాపట్లతాలూకాగ్రామం.

**మన్నె:** రాజసేవక పదవి. ఇది మాన్యం శబ్దభావం, సేవకుప్రతిఫలంగా ఇచ్చే భూమి మాన్యం. శా.శ. 1466 నాటి మార్కాపురం శాసనాల్లో ఒక మంనె పెదనరసయ్య ప్రస్తావన వుంది. ఏజెన్సీ ప్రాంతాన్ని మన్యం అంటారు.

**మన్నేరు - మన్నేటి:** మన్నేరు అనేపేరుతో ఒక ఏరు ప్రకాశం జిల్లాలో వుంది. మన్నేటి కోట అనే గ్రామం కూడ వుంది. మన్నేరు పేరుతో ఇంకా ప్రవాహాలుండవచ్చును. కాశ్యపగోత్రుడైన మన్నేరు సంక్యరాజు ప్రస్తావన శాశ 1129నాటి కాకినాద తాలూకా భీమవరం శాసనంలో వుంది.

**మరుపూరు (రి) :** నెల్లూరుజిల్లా రాపూరు తాలూకా గ్రామం. మరుపూరు కోదండ రామిరెడ్డి ప్రముఖులు.

**మర్రి :** చాలగ్రామనామాల్లో ద్వితీయ ప్రథమావయవాలుగా కన్పిస్తుంది. మర్రిచెన్నారెడ్డి ముఖ్యమంత్రిగా పనిచేశారు.

**మర్రిగుంట :** చంద్రగిరి తాలూకాగ్రామం. మర్రిగుంట వారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది.

**మర్రివాడ :** ఈ పేరుతో కృష్ణాజిల్లా, విశాఖజిల్లాల్లో గ్రామాలున్నాయి.

**మల్యాల :** మల్లెల గ్రామం దీనికి ఆకారం. శా.శ. 1167 నాటి వర్ధమానుశాసనంలో, దీనిని పాలించిన మల్యాల గుండన ప్రసక్తిగలదు.

**మలహరి :** ప్రాంతవిశేషం. శా.శ. 1737 నాటి మక్తల శాసనంలో మలహరి మర్తాండబాలాజీ రావు ప్రసక్తి వుంది. మలహరి ఒకరాగం, మలహరి అంటే శివుడు. ప్రాంతం వల్లనే ఆ పేరు వచ్చింది.

**మలినేని :** వ్యక్తినామం. మల్లయ్యనాయకుడు. మలినేని పట్నం శిద్దవటం తాలూకాగ్రామం.

**మల్లపరాజు :** మల్లఅప్పల కూడిక మల్లప్ప వ్యవహారంలో మల్లప రాజు నియోగిబ్రాహ్మణుల వ్యక్తినామాల్లో కన్పిస్తుంది. శా.శ. 1168నాటి త్రిపురాంతక శాసనాల్లో చాగి దోరపరాజుల ప్రధానిగా ఒక కరణము మల్లపరాజు ప్రస్తావన వుంది.

**మల్లమరాజు :** మల్లికార్జున శబ్దభవం మల్ల. దానిపై అమ్మ చేరి మల్లను. దాని పై రాజు చేరి వ్యక్తినామంగా సిద్ధించింది. శా.శ. 1565 నాటి కోయిలకుంట్ల శాసనంలో మల్లమరాజు వెంగయ ప్రస్తావనవుంది. ఇతడు గ్రామకరణం.

**మల్లవరం :** గ్రామనామం. మల్లవరం సుబ్బరాయుడు ఖంద్రిక పుత్తూరు తాలూకాలో వుంది.

**మల్లాది :** ఈ గ్రామం గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలో వుంది. మల్లాది రామకృష్ణశాస్త్రి ప్రసిద్ధరచయిత.

**మల్లాప్రగడ :** మల్లయ ప్రగడకు రూపాంతరం. శా.శ. 1188నాటి త్రిపురాంతకశాసనాల్లో, కాకతిగణపతి దేవ మహాప్రధానిగా ఒక పెదమల్లయ్య ప్రగడ ప్రస్తావన వుంది. శా.శ. 1376 నాటి ద్రాక్షారామ శాసనాల్లో ఒక మల్లాప్రెగడ ప్రస్తావన వుంది. అప్పటి వీరి గృహనామం కుడుక. శా.శ. 1305 నాటి సింహాచలం శాసనంలో భారద్వాజ గోత్రులైన ఒకమల్లాప్రగడ సింహాద్రి అప్పడు ప్రసక్తి వుంది. ఇతడు ఒడ్డాది ప్రధానిగా చెప్పబడ్డాడు.

**మల్లినేని - మల్నేని :** మల్లనాయకుడు అనే పేరు, ఈ రెండు విధాలుగా పరిణమించింది మల్లశబ్దానికి మల్లయుద్ధయోధుడు అనే అర్థం వుంది. అయితే వ్యక్తినామాల్లోని మల్ల శబ్దం మల్లికార్జున దైవపరంగా వచ్చినది. శా.శ. 1204 నాటి విజయవాడశాసనాల్లో ఎరబోలు మాంకిరెడ్డి తండ్రిగా ఒక మల్నేని పేర్కొనబడ్డాడు.

**మల్లిరెడ్డి :** వ్యక్తినామం. శా.శ. 1354 నాటి కాకినాడ శాసనంలో ఒక మల్లిరెడ్డి పోలసాని ప్రస్తావనవుంది.

**మల్లు :** బిరుదుసూచి : త్రిపురమల్లు. రాచమల్లు. మల్లువారిపల్లె బద్వేలు తాలూకాలో వుంది.

**మల్లెమాల :** మల్లెలు పుష్పజాతిగా తెలిసినవే. వాటితో కూర్చిన దండ మల్లమాల. ఈ అర్థసామ్యంతో ఈ ఇంటిపేరుగల వారు మాలాకారులని లేక వాటిని ధరించే వారని చెప్తే యుక్తి సహంగానే వుంటుంది. పుష్పమాలాకారులను కేరళలో వారియర్లు అనే పేరుతో సంబోధించడమూ వుంది. అయితే తెలుగులో ఇది చెల్లిరాదు. ఇక 'మాల' ఒక జాతిగా కూడా వుంది. కనుక ఆ జాతిలో ఈ మల్లెమాల ఒక భేదంగా కూడా చెప్పే అవకాశముంది. ఇది కూడా వాస్తవంగాదు. ఇదొక ఊరిపేరు. నెల్లూరి జిల్లా వెంకటగిరి తాలూకాలో ఈ పేరుతో గ్రామముంది. ఆ గ్రామం నుండి వలస వచ్చిన వారికి ఆ పేరు ఇంటిపేరుగా స్థిరపడింది.

మల్లె కేవలం మనకు తెలిసిన పుష్పజాతికే కాక ఇంకా కొన్ని మొక్కలకు కూడా వర్తిస్తుంది. పొగాకు చేలో వచ్చే ఒక రకం కలుపుమొక్కను మల్లె లేక బోదు అనడం తెలిసిందే. ఇక 'మాల' అంటే కొండల దిగువగల ఉన్న చిన్న అడవి. మాల అనేది ఒక రకం మొక్క, నింబ జాతికి చెందినది. దీనికంటే మల్లెజాతి మొక్కలు ప్రచురంగాగల ప్రాంతమని చెప్పడం ఇక్కడ ఉచితం ఇంక ఈ 'మాల' పేరుతో ఇంకా కొన్ని గ్రామాలు వున్నాయి. అర్ధమాల, చిన్నసింగమాల, పెద్దసింగమాల, దర్శిమాల, గపుడుమాల,మాదమాల, మాధవమాల, పల్లమాల,వికృతమాల, వరమాల అనే గ్రామాలు

చిత్తూరు జిల్లాలోను, ముదుమాల అనే గ్రామం కడప జిల్లాలోను, మనమాల, మన్నెమాల, రెట్టమాల, తొణుకుమాల, విన్నమాల అనే గ్రామాలు నెల్లూరు జిల్లాలోను, కురుమాల అనే గ్రామం అనంతపురం జిల్లాలోను వున్నాయి. ఈ గ్రామాలన్నీ కొండలనంటి వున్న అటవీ ప్రాంతంలో వుండడం విశేషం. మల్లెమాల సుందరరామిరెడ్డి సినీ నిర్మాత

**మల్లెల :** పుష్పజాతి భేదంగా మల్లెలు తెలుసు ఇందులో కూడ చాల రకాలున్నాయి మల్లెల పేరుతో గ్రామాలు కూడ వున్నాయి కాళహస్తి తాలూకాలో ఒకటి కృష్ణాజిల్లా తిరువూరు తాలూకాలో ఒకటి గ్రామాలున్నాయి ఇతర చోట్లకూడ వుండవచ్చును మల్లి అనేది కలుపు మొక్కలకు ప్రత్యామ్నయంగా ఉపయోగించడముంది శా శ 1560 నాటి హిందూపురం తాలూకా బయలగుంటపల్లి శాసనంలో భరద్వాజ గోత్రం అశ్వశాయన సూత్రం ఋక్శాఖాధ్యాయియైన ఒక మల్లెల భాస్కరుని ప్రస్తావన వుంది.

**మహంకాళి :** దేవతానామపూర్వక వ్యక్తినామం మహంకాళివారి ఖండ్రిక కందుకూరు తాలూకాగ్రామం

**మహాజనం :** ఉత్తరాది బ్రాహ్మణుల్లో మహా జనులు ఒక తెగ, ఏనుగుల వీరాస్వామి తనుకాశీయాత్ర చరిత్రలో వీరిని గూర్చి ప్రస్తావించారు మహాజనంవారిపేట పాలకొండ తాలూకాలోవుంది

**మహాపాత్ర:** బిరుదునామం శా శ 1331 నాటి సింహాచలం శాసనంలో ఒక కళింగపరీక్ష మహపాత్ర మంగలరాజు ప్రస్తావన వుంది చూడు మహాపాత్రుని

**మహాపాత్రుని :** పాత్రుడు అంటే అర్హుడు విజయనగర గజపతులకు విశ్వాసపాత్రులైన వారుగా చరిత్రలో చెప్పబడ్డారు అట్టి పాత్రులలో అధికులు మహాపాత్రులు. ఇది బిరుదు నామంగా వచ్చినది. శా శ 1407నాటి గుంటూరు శాసనంలో ఒక తిరుమలదాసుడు మహాపాత్రునిగా చెప్పబడ్డాడు ఇది ఒక పట్టపుపేరు గనుక, ఈ గృహనామంగలవారందరు ఏక కుటుంబకులని చెప్పడం ఎల్లవేళలా సాధ్యంకాదు

**మహావాది:** వాదమునందు నైపుణ్యము గలవారు లేక గొప్పగా వాదించేవారు అని అర్థాలు చెపితే తప్పవుతుంది. వేద తత్త్వోపాధ్యాయునికి మహావాది అని పేరు ఈ ఇంటి పేరు గల వారిలో పూర్వులెవరైనా తమ విద్యాస్థాయిని బట్టి ఈ అర్హతను పొందడం వల్ల, వారికి ఇది ఇంటి పేరుగా స్థిరపడింది శా శ 1057నాటి గుంటూరుజిల్లా ఇర్లపాడు శాసనంలో ఒక వెన్నయ భట్ట సోమయాజి మహావాదిగా చెప్పబడ్డాడు.

**మహేంద్రగిరి :** శ్రీకాకుళంజిల్లా మందసాతాలూకాగ్రామం. సముద్ర తీరానికి పది పన్నెండు మైళ్లదూరంలో వుంది బ్రహ్మాండ పురాణం అంధ్రదేశానికి గల మూడు ద్వారాలలో దీనిని ఒకటిగా పేర్కొన్నది భీమకాళేశం, శ్రీశైలం అనేవి మిగిలిన రెండు ద్వారాలు శా శ. 1321 నాటి సింహాచల శాసనంలో ఒక మహేంద్రగిరి నారణజీయన పేర్కొనబడ్డాడు.

**మాకారం :** మాకవరానికి వికృతరూపం. ఎల్లవరంతాలూకాగ్రామం.

**మాకినేని :** వ్యక్తినామం. మహాకాళ శబ్దభావం. తమిళంలో మాకాళన్. మాకినేని బసవ పున్నయ్య ప్రముఖులు.

**మాగంటి :** మాగల్లుకు ఔప విభక్తిక రూపం. కృష్ణాజిల్లా నందిగామతాలూకా గ్రామం. మాగంటి అంకివీడు ప్రముఖులు.

**మాగాపు :** మాగాము అనేగ్రామం, తూర్పుగోదావరిజిల్లా అమలాపురం తాలూకాలో వుంది.

**మాఘం - మాగం :** మాసాల్లో మాఘమాసం ఒకటి. కాని గృహనామపరంగా దీనిని సంభావింపలేము. చిత్తూరుజిల్లాలో పై మాగం, దిగువమాగం అనే రెండు గ్రామాలున్నాయి. మాగులూరు (సంత, ఉప్పు) తో పోల్చి చూసినపుడు మాగు అనేది ఒక మొక్క కావచ్చుననిపిస్తుంది. అయితే చెమ్మతో కూడిన నేలనుకూడ మాగు శబ్దంతో వ్యవహరింప వచ్చును. కాని నిరంతరం చెమ్మగా ఉండే నేల నివాసయోగ్యంకాదు. అందువలన ఇది ఏదైనా చిరుధాన్యానికి చెందిన జాతి మొక్కగావచ్చు.

**మాచినేని :** వ్యక్తినామం.మాట్చి అనే తమిళ శబ్దానికి, గొప్ప, గొప్పతనము అనే అర్థాలున్నాయి. మహాసేన (కుమారస్వామి) తమిళంలో మాచనాన్‌గా పరిణమించింది. మహాలక్ష్మి శబ్దం కూడా కావచ్చును. అందమైన అనే అర్థం కూడా వుంది. మాచయ నాయకుడు అనేది వ్యక్తినామం. మాచశబ్దం. శా.శ. 1225నాటి కారంపూడి శాసనాలో ఒక మాంచయ నాయని ప్రస్తావనవుంది. ఇతడు కాకతి ప్రతాపరుద్ర దేవమహారాజులు అధికారశ్రేణిలోని వ్యక్తి. గజసాహిణి. కాకతి రాజ్యస్థాపనాచార్యులుగా చెప్పబడ్డాడు. మాచర్ల పాలకులు.

**మాజేటి :** మాజేరుకు ఔప విభక్తికరూపం. కృష్ణాజిల్లా దివి తాలూకా గ్రామం.

**మాడా :** మాడ అనే గ్రామం వుంది. మాడావారి ఖండ్రిక కాళహస్తి తాలూకాలో వుంది.

**మాడభూషి :** మాడ గ్రామనామ ద్వితీయావయవం. ఇది వైష్ణవుల్లో ప్రముఖంగా కన్పించేగృహనామం. మాడలు భూషణములుగా గలవారు అని భావించాలి. మాడ బరువును తూచే ప్రమాణంగా, ప్రాచీన కాలంలోని నాణెంగా, (ఇదే మాష బంగారు నాణెంకూడా) అర్థాలున్నాయి. మాడ శబ్దానికి దేవాలయం అని, మాడి శబ్దానికి గ్రామదేవత అని, మాడాధిపత్యం (ఇక్కడ బహుశా మఠం అనే అర్థంకావచ్చు) దేవాలయ పర్యవేషకాధికారి అనే అర్థాలు తమిళంలోవున్నాయి. బంగారు మాడలు ధరించిన వారు గనుక మాడభూషి అని చెప్పవచ్చు నేమో. లేక మాడప్పల్లె, మాడర్ చూడామణి, అనేగ్రాములు, కేవలం మాడ అనేగ్రామాలు కూడా వున్నాయి. ఆసందర్భంలో మాడ గ్రామశ్రేష్ఠులు అని చెప్పవలసి వుండుంది. మాడ భూషి అనంతశయనం అయ్యంగార్ కేంద్రంలో స్పీకరుగా పనిచేశారు.

**మాడరాజు :** చూడు. మాడ, మాడభూషి. శా.శ. 1476 నాటి మార్కాపురం శాసనంలో సూర్యవంశం, కాశ్యపగోత్రులైన మహామండలేశ్వర మాడ్రాజు శింగరయ్య దేవమహారాజు ప్రస్తావన వుంది.

**మాడహాెె :** గ్రామనామం. శా.శ. 1386 నాటి శాయింపేట శాసనంలో భరద్వాజ గోత్ర మాడ హాెె ధర్మయ్య ప్రస్తావన వుంది.

**మాడుగుల :** ఈ పేరుతో విశాఖ, గుంటూరుజిల్లాల్లో గ్రామాలున్నాయి. ఇది ఒక చెట్టుపేరు.

**మాతల :** పర్లాకిమిడి తాలూకాగ్రామం.

**మాదయగారి :** తెలుగుకవుల్లో ఒక మాదయగారి మల్లన్న ఒకరు. మాదయ ఒక వ్యక్తినామం. అలాగే మాదన్న, మాదిరెడ్డి అనేపేర్లు కూడా కన్పిస్తాయి. మాద అంటే అనందము, సంతోషము వంటి అర్థాలున్నాయి. కాని ఇది మాధవ శబ్దం నుండి వ్యుత్పన్నమైనది. మాధవయ్యకు రూపాంతరం మాదయ. శా.శ 1150 నాటి విజయవాడ శాసనంలో ఒక శివయోగియైన మాదయ ప్రస్తావన వుంది.

**మాదల :** ఈ పేరుతో శ్రీకాకుళం, గుంటూరుజిల్లాల్లో గ్రామాలున్నాయి.

**మాదాసు:** మహా, దాసు శబ్దాల కలయికలో 'హ' కారంలోపించి మాదాసు ఏర్పడింది. మహా లేక మహత్ శబ్దానికి గొప్ప, పెద్ద అనే అర్థాలున్నాయి. శంకరుని మహేశ్వరుడనడం, శంకర భక్తులను మాహేశ్వరులనడం తెలిసిందే. బహుశా మహేశ్వరదాసు (సేవకుడు) శబ్దంలోని ఈశ్వర లోపించి పైవిధంగా మాదాసు ఏర్పడి యుండవచ్చు.

**మాదినేని :** వ్యక్తినామం. మాధవ శబ్దభావం. శా.శ. 1515 నాటి గుత్తిశాసనాలలో ఒక ఆదవాని మాదినేని బసప్పప్రస్తావన వుంది. ఇక్కడ ఆదవాని అనేది, అతడు ఆగ్రామానికి చెందినవాడని చెపుతుంది. అజ్జాడ ఆదిభట్లనారాయదాసువలె. మాదినేనిపాలెం వాయల్పాడు తాలూకాలో వుంది.

**మాదిరాజు:** మాదిరాజు పెరుమాళ్రాజు ఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది.

**మాదిరెడ్డి :** వ్యక్తినామం. కాకతి ప్రతాపరుద్ర పాలనాకాలంలో (శా.శ. 1220) మాదయరెడ్డి మక్తలను పాలించాడు. అతడు ఆ సంవత్సరం మార్గశిర బహుళ సప్తమినాడు కాలప్రాప్తిపొందినట్టు చెప్పబడింది.

**మాదిశెట్టి :** వ్యక్తినామం. శా.శ. 1541 నాటి చిన్న అహోబిలం శాసనాలలో ఒక వైశ్యకులజుడు మాదిశెట్టి లింగయ ప్రస్తావన వుంది.

**మాధవభట్ల :** వ్యక్తినామం. పెద్దాపురం తాలూకా తిరుపతి శాసనంలో మాధవభట్ల వారి ప్రస్తావన గలదు.

**మానవల్లి :** గ్రామనామం. మానవల్లి రామకృష్ణకవి ప్రముఖులు.

**మానికొండ :** కృష్ణాజిల్లా గన్నవరం తాలూకాగ్రామం. అయితే ఈ గ్రామంలో కొండలు లేవు. మానికొండ అనేది మొత్తంగా ఒక చెట్టుపేరు. మానికొండ సూర్యావతి కమ్యూనిష్టు నాయకురాలు

**మానుకొండ :** మానికొండ గన్నవరం తాలూకాగ్రామం. మానుకొండవారిపాలెం నరసరావుపేట తాలూకాలో వుంది.

**మానూరు - మానూరి:** పశ్చిమగోదావరిజిల్లా ఏలూరుతాలూకా గ్రామం. ఇతరచోట్ల కూడ వుండవచ్చును.

**మానేపల్లి :** ఈ పేరుతో తూర్పుగోదావరిజిల్లా రాజోలు తాలూకాలో ఒక గ్రామంవుంది.

**మానేపల్లి :** గ్రామనామం. శా.శ 1181 నాటి పాలకొల్లు శాసనంలో ఒక మానెపల్లిసోమినేని ప్రస్తావన వుంది.

**మానేపల్లి :** రాజోలు తాలూకాగ్రామం.

**మామిడి :** గ్రామనాపూర్వపదం. మామిళ్ల అనే గ్రామంకూడా వుంది. శృంగార నైషధ కృతి భర్త మామిడి సింగన

**మామిడి పూడి :** నెల్లూరు తాలూకాగ్రామం మామిడిపూడి వెంకటరంగయ్య విద్యావేత్త.

**మారసాని :** మారుడు అంటే యముడు భయకరుడు శా శ 1233నాటి వప్పిచెర్ల శాసనంలో ఒక మారమసాహిణి ప్రసావనవుంది శా శ. 1085 నాటి చేజెర్లశాసనంలో మారాసాని కేతిరెడ్డి ప్రస్తావన వుంది

**మారెని :** మారనాయక శబ్దపు సంక్షిప్త రూపం. శా శ. 1073 నాటి బాపట్ల శాసనంలో ఒక మారెని కామరాజు ప్రస్తావన వుంది

**మారెళ్ల :** ప్రకాశంజిల్లా దరిశి తాలూకాగ్రామం నూజెళ్ల, వేజెళ్ల, తురిమెళ్ల, చీదెళ్ల ఇవన్నీగ్రామాలపేర్లు, ఇవన్నీ ఆయా జాతుల చెట్లపేర్లు.

**మారేపల్లి :** వీరపల్లి తాలూకాగ్రామం

**మారేమండ :** గ్రామనామం

**మారౌతు :** మహారౌతుకు సంక్షిప్తీకరణ రౌతుఅంటే అశ్వికుడు అయితే యోధుడు అనే అర్థంలో కూడా వ్యవహారంలో

**మాలె :** గ్రామనామ ప్రథమావయము. మాలె కాంద్రాయుని పాలెం కందుకూరు తాలూకాగ్రామం.

**మాలెంపాటి :** మాలెంపాడుకు ఔపవిభక్తిక కరూపం బంగోలు తాలూకాగ్రామనామం

**మాల్యవంతం :** ఇది వైఖానసుల్లో ఇంటిపేరుగా కన్పిస్తుంది ఇతరుల్లో కూడా వుండేమో తెలియదు. మాల్యవత్ అనేది మేరుపర్వతానికి తూర్పునగల పర్వతశ్రేణిగా చెప్పబడింది. అయితే ఇంటిపేరుకు దీనికి ప్రత్యక్షసంబంధం లేదు అనంతపురంజిల్లా ధర్మవరం తాలూకాలో మాల్యవంతం అనే గ్రామముంది. గృహనామంగా రావడానికి ఇది కారణమై ఉంటుంది.

**మల్యాల :** గ్రామనామం. శా శ 1167నాటి వర్ధమానపురం శాసనంలో కాకతి గణపతిదేవ దండనామాత్యుడైన మల్యాల గుండన ప్రసక్తివుంది

**మాకువ :** పర్లాకిమిడి తాలూకాగ్రామం

**మాపూరు :** కమ్మవారి కుటుంబాల్లో ఇది కన్పిస్తోంది ఇతరుల్లో కూడ ఉండవచ్చును సాధారణంగా, స్వగ్రామాన్ని మాపూరు అని వ్యవహరిస్తారు కాని, ఈ పేరుతో తిరుత్తని, దిండి తాలూకాలలో గ్రామాలున్నాయి.

**మాసర :** రామచంద్రాపురం తాలూకా గ్రామం శా శ 1382 నాటి శ్రీకూర్మశాసనంలో ఒక మాసణ అక్కయ ప్రస్తావన వుంది మరోశాసనంలో మాసర పెద్దనశెట్టి ప్రస్తావనవుంది

**మిక్కిలినేని:** ఇది కమ్మవారిలో కనిపిస్తుంది నేని నాయక శబ్దభవం మిక్కిలి అనే పదం, అధికము, శ్రేష్ఠము, గొప్ప అనే అర్థాల్లో కన్పిస్తుంది తమ బిడ్డ అలా వుండాలనే అకాంక్షతో పెట్టుకున్న వ్యక్తినామం. ఆ వ్యక్తి పేరుతో వ్యవహారంలోకొచ్చిన గృహ నామమిది తమిళంలో మిక్కవార్ అంటే బ్రాహ్మణులు. ఇక్కడ కూడా అధికులు, శ్రేష్టులు అనే అర్థంలోనే ప్రవర్తించింది. మిక్కార్ అంటే గొప్పవారు. మిక్కార్ అంటే తెలివిగలవారు అని ఆ భాషలో అర్థాలు. మికల్ శబ్దానికి విజయమనే అర్థం కూడా వుంది ఏమైనా శ్రేష్ఠమనే భావనలోనే వ్యక్తినామంలో ప్రవర్తించినదనుట స్పష్టం. ప్రముఖ సినీ, రంగస్థల నటులు రాధాకృష్ణమూర్తిగారి గృహనామం ఇదే. మిక్కనేనిపల్లె బనగానపల్లి తాలూకాలోవుంది

**మినగల్లు (గంటి) :** నెల్లూరుజిల్లా కోవూరు తాలూకాగ్రామం.

**మిరియాల:** మిరియాలు తెలిసినవే మిరియపు గుణం కలిగిన కాయలు కనుక మిరపకాయలైనాయి. దీనిని మరింత కుదించి మిర్చి, పచ్చిమిర్చి, ఎండుమిర్చి అనడం తెలిసిందే అయితే ఇంటిపేరులోని మిరియాల పై రెంటికి సంబంధించినదికాదు ఇదొక ఊరిపేరు. గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలో ఈ గ్రామముంది గ్రామ నామంలోని మిరియాల ఒక రకం గడ్డిజాతికి చెందిన మొక్క మిరియాల రామకృష్ణ రచయిత.

**మీనపోలు :** గ్రామనామం.

**మీసాల :** మూతిమీది మీసాలు తెలసిందే మీసాలపేట అనేగ్రామం విజయనగరం తాలూకాలోవుంది. మీసరపల్లితో పోల్చి చూపినవాడు, ఇది ఒక మొక్కగా బోధపడుతుంది.

**ముక్కండ్ల :** గ్రామనామం. వుండవచ్చును ముక్కండ్లవారి కొత్తపల్లె కదిరి తాలూకాలో వుంది.

**ముక్కామల :** ఈ పేరుతో గుంటూరు, తూర్పుగోదావరిజిల్లాల్లో గ్రామాలున్నాయి ప్రసిద్ధ సినిమా, రంగస్థలనటులు కృష్ణమూర్తిగారి గృహనామం ముక్కామల. శాసనాల్లో ముక్రామలగా ప్రస్తావితము. శా.శ 1219నాటి పాలకొల్లు శాసనంలో ఒక ముక్రామల పేరినేని ప్రస్తావన వుంది.

**ముక్కొల్లు :** కృష్ణాజిల్లా బందరు తాలూకాగ్రామం

**ముక్తేవి - ముత్తేవి - ముత్తీవి :** పెద్ద, చిన్న అనే వివక్షతో ముత్తేవి పేరుతో రెండుగ్రామాలు కృష్ణాజిల్లా దివితాలూకాలో వున్నాయి

**ముగ్గుళ్ల :** గ్రామనామం రాజమండ్రి శాసనంలో ఒక ముగ్గుళ్ల పోతమశెట్టి ప్రస్తావన వుంది

**ముంగొండ :** రోజులు తాలూకా గ్రామం

**ముచ్చెర్ల :** కృష్ణాజిల్లా బందరు, భీమునిపట్నం గజపతినగరం తాలూకాలలో ఈ పేరుతో గ్రామాలున్నాయి. ముచ్చెర్ల అరుణ సినీనటి

**ముంజులూరి :** ఈ పేరుతో కృష్ణా, ప్రకాశంజిల్లాల్లో గ్రామాలున్నాయి.

**ముటుకూరు(రి) :** మార్కాపురం తాలూకా గ్రామం

**ముట్లూరి :** ముట్లూరు అనే గ్రామం గుంటూరుజిల్లాలో వుంది. ముట్టుకొనుట స్పృశించుట అని తెలుసు కాని, ఇక్కడ ఆ అర్థం చెల్లిరాదు ఇందలి ముట్టు, కొరముట్టు పనిముట్టుల లోనిది అనగా సాధనం అని అర్థం రాజకార్య నిర్వాహకులను ముట్లు అని శాసనాల్లో వ్యవహరించారు ముట్లూరు అంటే నేటి ఆఫీసర్స్ కాలనీ వంటిదన్నమాట ఇది చేబ్రోలుకు సమీపగ్రామం. అది, చందోలు గ్రామాలు ఒకప్పుడు ఆ ప్రాంతానికి రాజధానులుగా వున్నాయి ఇందేదో అశ్లీలత వుందనే భావంతో కృష్ణారావుగారు ముట్నూరు అని మార్చుకున్నారట కాని ముట్నూరుఅనే గ్రామం వుంది

**ముడియం :** కడపతాలూకా గ్రామనామం ముడియం వారిపల్లె వాయల్పాడు తాలూకాలో వుంది

**ముడుంబి :** ఇది ఎక్కువగా వైష్ణవుల్లో కన్పిస్తోంది శాసనాల్లో ముదుంబగా పేర్కొనబడింది. ఈ వంశానికి చెందిన వెంకటక్రిష్ణ అనే వ్యక్తి దివితాలూకా గణపేశ్వర శాసనంలో ప్రస్తావింపడ్డాడు.

**ముండ్ల :** ముల్లుపై బహువచనరూపం అయితే గృహనామంగా రావడానికి కారణం గ్రామనామ ప్రధమావయవం ముండ్లమూరు, ముండ్ల (ముళ్ల) పల్లె, అనేగ్రామాలున్నాయి. ముండ్లవారిపల్లె అనేగ్రామం కదిరి తాలూకాలో వుంది

**ముండ్లపూడి - ముళ్లపూడి :** ముండ్లపూడి వ్యవహారంలో ముళ్లపూడి అయింది అయితే ఈ రెండు విధాలుగాను గ్రామాలున్నాయి. ముండ్లపూడి అనే గ్రామం చిత్తూరుజిల్లాలో వుంది. ముళ్లపూడి అనేపేరుతో కృష్ణాజిల్లాలో వుంది ఇంకా కూడా వుండవచ్చును. తణుకు జమిందారులు ముళ్లపూడి తిమ్మరాజుగారు.

**ముతకన :** ఇది ముతకాణి అనే గ్రామానికి వికృతరూపం. ముతకనవారిపల్లె మదనపల్లి తాలూకాలో వుంది

**ముత్తినేని :** వ్యక్తినామం. ముత్తన నాయకుడు అసలుపేరు ముత్య శబ్దభవం ముత్త దానిపై అన్నచేరింది. లేక ముద్దుకు పర్యాయం కూడా కావచ్చు. శా.శ. 1076 నాటి అవనిగడ్డ శాసనంలో ఒక ముత్తినాయకుడు ప్రస్తావింపబడ్డాడు ఇతడు కొల్లూరి విభుడైన చింతమనాయకుని కుమారుడు. తల్లిగుండమ. భార్య మేడమ ఇతని కుమార్తె కొమ్మమ అవనిగడ్డ చోడనారాయణ దేవరకు బిరుదుగద్యలు సమర్పించింది ఈ ముత్తన జగద్విఖ్యాతునిగా, కలియుగ శూద్రకునిగా, వీరగుణ ప్రసిద్ధునిగా చెప్పబడ్డాడు పడిహారికూడా.

**ముత్తసాని - ముతసాని :** వ్యక్తినామం ముత్తయ్య, ముత్తెమ్మ అనేవి వ్యక్తినామాల్లో కన్పిస్తాయి. ఇది ముక్తి శబ్దభవం లేదా ముత్యశబ్దభావం గాని కావడానికి అవకాశముంది శా శ 1163 నాటి నరసరావుపేట తాలూకా గోవిందపురం శాసనంలో ఒక ముత్తసానిగారి కాటమరెడ్డి పేర్కొనబడ్డాడు.

**ముత్తి :** శా శ. 1731 నాటి శ్రీకూర్మశాసనంలో జనార్ధన గోత్రుడైన ఒక ముత్తి సీతారామయ్య ప్రస్తావన వుంది ఇది ముక్త లేక ముత్య శబ్దభవం

**ముదిగంటి :** ముదిగల్లుకు ఔప విభక్తిక రూపం కల్లు శిలాసూచకం. ముది, వృద్ధత్వ సూచికాదు ముదిలేడు ముదినేపల్లి, కొండముది మొదలైన వాటితో పోల్చిచూసినపుడు, అది ఒకరకం మొక్కగా కనిపిస్తుంది. ముదిగల్లు అనేగ్రామం అనంతపురం జిల్లా కల్యాణదుర్గం తాలూకాలోవుంది.

**ముదిరెడ్డి :** ముది శబ్దం పాత, పూర్వపు, పెద్ద, మూలము అనే అర్థాలనిస్తుంది శా శ. 1468 నాటి మదనపల్లి తాలూక ములకలపల్లి శాసనంలో ఒక ముదిరెడ్డి మారపరెడ్డి ప్రస్తావన వుంది. ముదిరెడిపల్లె ప్రొద్దటూరు తాలూకాలో వుంది.

**ముద్ద :** ఇది ముత్తుశబ్దభవం కావచ్చు. ముద్దు తెలిసిందే కొన్ని సందర్భాల్లో ముద్రకూడా రాజోద్యోగాల్లో ముద్రాధికారులున్నారు. ముద్దబోయిన, ముద్దినేని గృహనామాలు కూడా వున్నాయి. ముద్ద బసప్పన్న అయ్యప్పన్నహళ్లి అనే గ్రామం, కూడ్లిగి తాలూకాలో వుంది శా శ. 1209నాటి సింహాచల శాసనంలో ఒక ముద్దదామన బోయని ప్రస్తావన వుంది .

**ముద్దన :** వ్యక్తినామం చూడు ముద్దినాయని.

**ముద్దబోయిన :** ఇందలి ముద్ద, కబళశబ్దసంబంధి కాదు. ముద్దు సంబంధమైనది ప్రియమైన, ఇష్టమైన అని అర్థము. శా.శ. 1072 నాటి శాసనంలో ఒక ముద్ద బోయడు పేర్కొనబడినాడు. చూడు. ముద్ద

**ముద్దాడ :** చీపురుపల్లి తాలూకాగ్రామం.

**ముద్దినాయని - ముద్దినేని :** వ్యక్తినామం. చూడు ముద్ద ముద్దినాయని పల్లె కల్యాణదుర్గం తాలూకాలో వుంది

**మునగాల:** కృష్ణా, కర్నూలు జిల్లాల్లో ఈ పేరుతో గ్రామాలున్నాయి.

**ముని మాణిక్యం:** నల్గొండ జిల్లా గ్రామం ముని మాణిక్యం నరసింహారావు ప్రసిద్ధహాస్య రచయిత

**ముందుమల:** గ్రామనామం ముందుమల నరసింగరావు మంత్రిగా పనిచేశారు

**ముప్పవరపు:** ముప్పవరంపై ఔపవిభక్తిక రూపం ఈ గ్రామం ప్రకాశం జిల్లాలో వుంది

**ముప్పల:** వ్యక్తినామం ముప్పలనేని ముప్పలదేవి ముప్ప శబ్దానికి ఆధిక్యము, గౌరవము అనే అర్థాలున్నాయి ముప్పలవారి ఖండ్రిక కాళహస్తి తాలూకాలో వుంది

**ముప్పాళ్ల:** గుంటూరు, ప్రకాశంజిల్లాలో ఈపేరుతో గ్రామాలున్నాయ

**ముప్పి(ప్ప)నేని:** ఇది ముప్పినాయకుడనే వ్యక్తినామం నుండి వ్యుత్పన్నమైనది చూడు ముప్పల. శా శ 1088 నాటి ద్రాక్షారామ శాసనంలో కులోత్తుంగ రాజేంద్రచోడయ రాజుల పడవాలుగా ఒకముప్పి నాయకుడు ప్రస్తావింపబడ్డాడు

**ముప్పిరెడ్డి:** వ్యక్తినామం ముప్పిరెడ్డి వారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది వీరికి ఇనామతి వుంది

**ముమ్మడి సింగు:** దివితాలూకా గణపేశ్వరం శాసనాల్లో ఒక లింగాబత్తుడు ఈ ఇంటి పేరుతో పేర్కొనబడ్డాడు వీరు కాశాచారిగా అనగా పంచాణంవారుగా చెప్పబడ్డారు. ఒకే పేరు గల వారు ఇద్దరు ఒకేకుటుంబంలో వుంటే, లేదా ఆ కుటుంబసంతతిలో వుంటే రెండవ వారిని ఇమ్మడి అని, మూడవ వారిని ముమ్మడి అనడంకద్దు, సింగు సింహాశబ్దభవం అయితే వ్యష్టిగా కూడ ముమ్మశబ్దం వ్యక్తినామాల్లో లేకపోలేదు. ముమ్మడమ్మ, ముమ్మనాయకుడు అనే విధంగా వున్నాయి.

**ముమ్మనేని - ముమ్మలనేని:** ముమ్మడయ్య, ముమ్మడమ్మ అనే పేర్లు చరిత్ర కాలంలో వ్యక్తినామాలుగా వర్తిల్లాయి కాకతి వంశంలో కూడ ఒక ముమ్మడమ్మవుంది ఇమ్మడి అంటే రెండవ, ముమ్మడి అంటే మూడవ అని అర్థం ఆ భావనలో ఇది తాత అనే అర్థం ఇస్తుంది తాతయ్య అనేది పితామహఅనే అర్థంలో వర్తించడమేగాక వ్యక్తినామంగా కూడా వ్యవహరింపబడుతోంది అభావనలో ఈ శబ్దం నంయోజింప బడివుండవచ్చు. ముమ్మడివరం అనేగ్రామం కుడావుంది మూడుశబ్దంతో సంభావింపబడే దైవంశంకరుడు. అల్లా కూడవచ్చి వుండవచ్చు. చరిత్రలో ఒక ముమ్మడి నాయకుడు ప్రసిద్ధుడు. ఇతరు పానార, కోన, కురువాడ, చాంగర సీమలకు (గోదావరిజిల్లా) అధిపతి. ఈ వివరాలు శా.శ 1275 నాటి కోరుకొండ శాసనంలో వున్నాయి. ముమ్మలమ్మ అనే వ్యక్తి నామ పదాన్ని ఒక శాసనంలో పార్వతి అనే అర్థంలో వ్యవహరించారు. ముమ్మనేని మల్లారావు ప్రముఖులు.

**మురమళ్ల:** అమలాపురం తాలూకాగ్రామం.

**మురారి :** మురి అనే రాక్షసుని చంపడం వలన శ్రీకృష్ణునికి మురారి అని పేరు. అయితే ఈ పేరుతో పెద్దాపురం తాలూకాలో ఒక గ్రామం ఉంది. కాకినాద తాలూకా భీమవరం శాసనంలో మురారి మహారెడ్డి ప్రస్తావన గలదు.

**మురికిపూడి :** నరసరావుపేట తాలూకాగ్రామం. శాసనాల్లో మొరికపూడి. వ్యవహారంలో మురికిపూడి అయింది.

**ములుకుదిటి :** ములకుదురు కు ఔపవిభక్తికరూపం. ఈ గ్రామం గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాలో వుంది.

**ముష్టి :** ముష్టూరు అనేగ్రామంవుంది. ముష్టి అగ్రహారం శ్రీకాకుళం తాలూకాలో వుంది.

**ముసునూరి :** ముసునూరు గ్రామనామపు ఔప విభక్తి కరూపం. ముసునూరు అనే గ్రామాలు నూజివీడుతాలూకా, నెల్లూరు, విశాఖజిల్లాల్లోవున్నాయి. ఆంధ్రరాజ్యస్థాపనాచార్యులైన ప్రోలయ, కాపయనాయకుల గృహనామం ఇదే. వీరు నూజీవీడు తాలూకాలోని ముసునూరికి చెందినవారు.

**మూగచింతల :** ప్రకాశం జిల్లాపొదిలి తాలూకాగ్రామం. వేమన ఇంటిపేరు ఇదే.

**మూర్కొండ - మార్కొండ - మురకోండ :** ఇది ఒక మొక్క మార్కొండ . సాలూరు తాలూకాగ్రామం మూర్కొండ వారిపాలెం అనేగ్రామం కూడవుంది. మంగళగిరి కొండపై నగల లక్ష్మీదేవిని, కనుపర్తి అబ్బయామాత్యుడు మూర్కొండ లక్ష్మిగా పేర్కొన్నారు.

**మూర్తి :** మూర్తివారి పల్లెలు చంద్రగిరి తాలూకాలో వున్నాయి.

**మూర్తి నేని :** వ్యక్తినామం మూర్తి నాయుడుకు ఔపవిభక్తిక రూపం. మూర్తినాయుడి పాలెం వెంకటగిరి తాలూకాలోవుంది.

**మూర్తిరాజు :** మూర్తి, రాజు రెండు వ్యక్తినామాంత్య పదాలుగా కన్పిస్తాయి. ఇక్కడ రెండూ కలసి వ్యక్తినామంగా భాసిస్తోంది. శా.శ. 1470 గుత్తితాలూకా అప్పాజిపేట శాసనంలో జగదాపి గుత్తికి చెందిన పెనమాంగిణి పెన్నక చెర్ల సీమపాలకునిగా ఒక మూర్తిరాజ రామయ్య దేవ మహారాజుల ప్రస్తావన వుంది.

**మూలఘటిక :** శా.శ 1099 నాటి ముఖలింగం శాసనాలలో మూలఘటికాన్వయ కొండ్యాలగోత్రుడైన ఒక మార్తాండ నాయకుని ప్రస్తావన వుంది. సాహిత్యలోకానికి మూలఘటిక కేతన పరిచితుడే.

**మూలుకుట్ల :** గ్రామనామం. మూలుకుట్ల సదాశివశాస్త్రి ప్రముఖ హరికథకులు.

**మూల్పూరి :** మూల్పూరు అనేగ్రామం తెనాలి తాలూకాలో వుంది. ఔపవిభక్తికరూపం.

**మెట్టు :** గూడూరు తాలూకాలో వుంది.

**మెడబలిమి :** బలశౌర్యాలకు ప్రసిద్ధులు అనే వ్యవహారంలో ఏర్పడింది.

**మెడనూలు :** మెడనూలు వెంగనపల్లె కనిగిరి తాలూకాలోవుంది.

**మెండు:** ఆధిక్యమని సాధారణార్థం అయితే గ్రామనామం కూడా

**మెయిగాపు:** శా శ 1348 నాటి సింహాచలం శాసనంలో సంకీర్తనలు గానముచేయు మెయిగాపు అచ్చన్న ప్రస్తావన వుంది ఇది మేగాపుదనముగా మరొక శాసనంలో చెప్పబడింది దేవాలయ నిబంధన కార్యక్రమాల్లో ఒకటి విగ్రహ లేక దేవాలయ పరిరక్షకుడు గావచ్చును

**మెరుగుల - మెరుంగుల:** శాశ 1198 నాటి శ్రీకూర్మం శాసనంలో ఒక మెఋంగుల దొమ్మన పండితుల ప్రస్తావన వుంది ఇది గ్రామనామ పూర్వపదంగా మెరుగుమాల గ్రామంలో కన్పిస్తుంది

**మేచినేని:** చూడు మాచినేని మేచినేని మేచక వర్ణసూచి కాగా పార్వతీయుడని కూడా అర్థం. మేచినేని కిషన్‌రావు రాజకీయనాయకులు.

**మొల్లేటి:** మొల్లేరు అనే గ్రామం తూర్పుగోదావరిజిల్లా ఎల్లవరం డివిజన్ వుంది.

**మేక - మేకా:** ఇది జంతు సూచిగా కన్పిస్తుంది అయితే ఒక రకం గడ్డి కూడా మేకపాడు, మేకదొన వంటి గ్రామాలున్నాయి. నూజివీడు జమీందారులు మేకావారు

**మేకల:** ఇదివృత్తిపరంగా వచ్చినది శా శ 1181 నాటి పాలకొల్లు శాసనంలో ఒక మేంకల పోతనబోయని ప్రస్తావన వుంది అయితే గ్రామనామం కూడాకావచ్చును. మేకపూర్వపదంగా గ్రామలున్నాయి.

**మేగోటి:** మేగోడు గ్రామ నామం పై ఔపవిభక్తికరూపం పెనుకొండ తాలూకా బుక్కపట్నం శాసనంలో ఒక మేగోటి తిమ్మనాయని ప్రస్తావన వుంది ఇతడు శ్రీరంగరాయ దేవమహారాయల కార్యకర్త ఇదే శాసనంలో ఒక దళవాయి వెంకటప్పనాయని ప్రస్తావన వుంది

**మేడసాని:** వ్యక్తినామం మేదయసాహిణి సంక్షిప్త రూపం కాగా ఒక శాసనంలో స్త్రీనాకు పరంగా కూడా వ్యవహరింపబడింది పాలకొల్లు శాసనంలో ఒక మేడసాని నామయ ప్రస్తావన వుంది సుప్రసిద్ధ సహస్రావధాని మేడసాని మోహన్

**మేడికొండ:** మేడికొండూరులోని ప్రథమభాగం ఇది గుంటూరుజిల్లా గ్రామం. మేడికొండవారి పల్లె చంద్రగిరి తాలూకాలో వుంది

**మేడిచెర్ల:** మేడచర్ల అనేగ్రామం విశాఖజిల్లాలో ఉంది.

**మేడూరు - మేడూరి:** కృష్ణాజల్లా గుడివాడ తాలూకాగ్రామం, తిరువూరు తాలూకాలో మరో గ్రామముంది

**మేడేపల్లి:** పశ్చిమగోదావరిజిల్లా ఏలూరు తాలూకాగ్రామం మేడేపల్లి వెంకటరమణాచార్యులు పండితులు

**మేరుగు:** చూడు మెరుగుల.

**మేలుపాక:** సర్వసిద్ధి తాలూకాగ్రామం.

**మైనంపాటి :** మైనంపాడు అనే గ్రామం ప్రకాశం జిల్లాలో వుంది.

**మైల :** దీనిని మైలా అని వ్యవహరించడం గలదు శ్రౌత క్రియలో భాగంగా మైల పాటించడం తెలిసిందే అయితే గృహనామం దీనికి సంబంధించింది గాదు మైల అనేది ఒక ఊరిపేరు చిన్నమైల, పెద్దమైల అనే రెండు గ్రామాలు చిత్తూరుజిల్లా కాళహస్తి తాలూకాలో వున్నాయి మైలాంగం అనే గ్రామం నెల్లూరుజిల్లా సూళ్లూరుపేట తాలూకాలో వుంది

**మైలవరపు :** మైలవరం అనే పేరుతో కృష్ణా, ప్రకాశం జిల్లాల్లో గ్రామాలున్నాయి ఇది దీని ఔపవిభక్తిక రూపం

**మొగలితుర్రు - మొగల్తూరు :** నరసాపురం తాలూకాగ్రామం.

**మొగిలి - మొగళ్లపు - మొగలిచర్ల :** పుష్పజాతికి చెందిన మొగిలి తెలిసిందే. మొగలి పేరుతో ఒక గ్రామం చిత్తూరుజిల్లాలో వుంది. మొగిళ్లపు దానిపై ఔపవిభక్తిక రూపం. మొగిలిచర్ల అనేగ్రామం ప్రకాశం జిల్లా కందుకూరు తాలూకాలోవుంది

**మొటపర్తి :** పశ్చిమ గోదావరిజిల్లా గ్రామం ఒక శాసనంలో మొటపర్తి కాంపులు చేర్కొనబడ్డారు.

**మొండి :** తలలేని శరీరాన్ని మొండెం అనడం తెలిసిందే తన పంతమే తనది తప్ప ఇతరుల మాట విన్పించుకోని వానిని మొండి వాడనడం కద్దు త్రోవ ఆగిపోయినచోటును మొండి అంటారు. ఉదా: ఎదురుమొండి (దివి తాలూకాగ్రామం) మొండెపు లంక (రాజోలు తాలూకా) కాగా మొండి ఒక జాతి జనులు మొండి వెంగనపల్లె అనే గ్రామం పుత్తూరు తాలూకాలో వుంది.

**మొదలి :** ద్రాక్షారామ శాసనంలో ఒక మొదలి భీమనాయకుని ప్రస్తావన వుంది ఇతడు మహామండలేశ్వర కులోత్తుంగ రాజేంద్రచోడయ రాజుల ముదిసెలిగాను, గుద్దవాది మొదలిగాను చెప్పబడ్డాడు. గుద్దవాదినాడు అనగా ఒకటి కృష్ణాజిల్లా గుడివాడ సీమ రెండవది తూర్పుగోదావరి జిల్లా రామచంద్రాపురం తాలూకా ప్రాంతము గుద్దవాది మొదలి అనగా ఆసీమకు చెందిన ప్రముఖుడు. ఇది ఒక అధికారపదవి కూడ కావచ్చు. తమిళనాట మొదలియార్లు ఒక వర్గంగావున్నారు. ఇది అధికార పదవికావడం వలన, బ్రాహ్మణ, బ్రాహ్మణేతరుల్లో ఈ ఇంటిపేరుండవచ్చు.

**మొవ్వ - మువ్వా - మువ్వా :** మొవ్వగ్రామం కృష్ణాజిల్లా దివితాలూకాలో వుంది. పదకర్త క్షేత్రయ స్వగ్రామంమొవ్వ.

**మోక్షగుండం :** ప్రకాశం జిల్లా కంభం తాలూకా గ్రామం అయితే మోక్షగుండల విశ్వేశ్వరయ్య గారి గృహనామానికి ఇది ఆకరం కాదు. అది కర్నాటక లోనిది

**మోచెర్ల :** కందుకూరు తాలూకాగ్రామం మోచర్ల రామచంద్రరావు పంతులు ప్రసిద్ధులు

**మోటూరు:** గుడివాడ తాలూకా గ్రామం మోటూరు హనుమంతరావు రాజ్యసభ సభ్యులుగా పని చేశారు కమ్యూనిష్టు నాయకులు

**మోట్ట - మొట్ట :** చిత్తూరు జిల్లా ముదివేడు శాసనంలో (క్రీ శ 1397) ఒక మోట్ట దొరపనాయని ప్రస్తావన వుంది మొట్టవాడినాడు మార్కాపురం ప్రాంతపు పేరు

**మోతుకూరు (లి) :** నందికొట్కూరు తాలూకాగ్రామం

**మోతే :** తెలంగాణంలో గ్రామం. ఏలూరులో మోతేవారు వైశ్యకుటుంబాల వారు ప్రముఖులు

**మోదుకూరి :** మోదుకూరు అనేగ్రామం తెనాలి తాలూకాలో వుంది శాసనాలలో మ్రొంతకుఱ్రుగా ప్రస్తావింపబడింది

**మోపర్రు - మోపర్తి :** మోపఱ్రు పేరుతో కృష్ణా గుంటూరుజిల్లాల్లో గ్రామాలున్నాయి మోపర్తి దాని ఔపవిభక్తిక రూపం

**మోపిదేవి :** కృష్ణాజిల్లా దివితాలూకా గ్రామం

**మోపూరు(లి) :** ప్రకాశం జిల్లాపొదిలి తాలూకాగ్రామం

**మ్రుగ్గు :** శా శ 1297 నాటి సింహాచల శాసనంలో ఒక మ్రుగ్గు అల్లురెడ్డి ప్రస్తావన వుంది ముగ్గుళ్ల అనేగ్రామంవుంది

**రంగారావు :** వ్యక్తి నామం బొబ్బిలి సంస్థాన మూలపురుషుడు అనంతరం అదే గృహనామం అయింది

**యాబలూరు :** గ్రామనామం లోకనాధశర్మ ప్రముఖ న్యాయవాది

**రంగిశెట్టి :** వ్యక్తినామం రంగ, శ్రీరంగ శబ్దసంబంధి దానిపై శెట్టి

**రఘుపతి :** వ్యక్తినామం . ఈగృహనామంతో ప్రసిద్ధులైనవారు రఘుపతి వెంకటరత్నంనాయుడు

**రంపాల:** పెద్ద దుంగలను మొదలైన వాటిని కోసే సాధనంగా రంపం తెలుసు. నిజానికి రంప ఇంటి పేరుగా గలవారు కూడ వున్నారు ఈ రెండు ఇంటి పేర్లలోను గల 'రంప'కు, కోతకుపయోగించే సాధనమైన రంపానికి ఏమీ సంబంధం లేదు రంప అనేది తూర్పు గోదావరి జిల్లాలో ఒక గ్రామం ఆ గ్రామ నామంలోని రంప ఒక రకం మొక్కను సూచిస్తుంది 'అల' అనే పదం, ప్రాకే స్వభావంగల గడ్డిని సూచిస్తుంది మునగాల, కనగాల, పెండ్యాల కూడా ఇలాంటివే రంపచోడవరానికి ఆ పేరు రావడానికి గల కారణం అది రంప గ్రామానికి సమీపంలో వుండడం అంటే మరో చోడవరం సమీపంలో వున్నందున దీనిని ఇలా సంభావింపవలసి వచ్చింది.

'రంప' అనే ఇంటి పేరుకు కారణమైనది రంప గ్రామమే. కాగా రంపాల రంపాలు తయారు చేసేవారికి, వాటితో పనిచేసే వారికి ఉండే అవకాశం లేకపోలేదు. అప్పుడు అది వృత్తి పరంగా వచ్చిన గృహ నామమవుతుంది.

**రవ్వారపు :** రావివరము అనేగ్రామానికి సంక్షిప్తము, ఔపవిభక్తము అయినరూపం

**రాకుదిరి :** రాకుదురు అనే గ్రామపు ఔపవిభక్తిక రూపం ద్రాక్షారామ శాసనాల్లో ఒక రాకుదిరి కత్తిరాజు పేర్కొనబడ్డాడు ఇది శా శ 995 నాటి శాసనం

**రాచనేని :** ఇది వ్యక్తినామం రాజశబ్దభవం రాచ చరిత్రలో శా శ 1134నాటి ద్రాక్షారామ శాసనంలో కాకతీయ రాజ్య సమర్థుడైన రేచర్ల రుద్రిరెడ్డి సామంతునిగా ఒక రాజనాయకుడు పేర్కొనబడ్డాడు.

**రాచనేని :** వ్యక్తినామం రాజశబ్దభవంరాచ దానిపైనేని నాయుడు శబ్దపు ఔపవిభక్తిక రూపం.

**రాచపల్లె :** గ్రామనామం. రాచపల్లె ఎర్రమరెడ్డి గారి పల్లె చంద్రగిరితాలూకాలో వుంది

**రాచమడుగు - రామడుగు :** గ్రామనామం శా శ 1541 నాటి చిన్న అహోబిలం శాసనంలో రాచమడుగు లింగము ప్రస్తావనవుంది

**రాచమరెడ్డి :** అర్థము స్పష్టము శా శ 1334 నాటి ఇంకొల్లు శాసనంలో ఇంకొల్లు నాయంకరుడైన ఒక రాచెమ్మరెడ్డి అనవోతనాయరెడ్డి ప్రస్తావింపబడ్డాడు

**రాచమల్లు :** వ్యక్తినామం. రాచ శబ్దంపై మల్లు

**రాచవీటి :** రాచవీడు గ్రామ నామపు ఔప విభక్తిక రూపం రాచవీటి వారిపల్లె మదనపల్లి తాలూకాలో వుంది

**రాజనాల :** గ్రామనామం ఈ గృహనామంతో ఒక నటులున్నారు

**రాజవోలు (లి) :** నెల్లూరుజిల్లా ఆత్మకూరు తాలూకాగ్రామం

**రాట్నాల :** నూలు వడికే సాధనంగా రాట్నం తెలుసు నీళ్ళు తోడే సాధనాన్ని కూడా రాట్నం అంటారు వినోద సాధనంగా రంగులరాట్నం తెలిసిందే గృహ నామంలోని రాట్నం దీనికి సంబంధించింది కాదు ఇది ఒక రకం మొక్క రాట్నాలగుంట అనే గ్రామం పశ్చిమగోదావరి జిల్లాలో వుంది

**రాణ:** శ్రీకాకుళం తాలూకాగ్రామం.

**రాణి :** బహుశా రాణ శబ్దం దీనికి మూలం కావచ్చు

**రాపర్తి :** రాపర్రు గ్రామపు ఔపవిభక్తికరూపం ద్రాక్షారామ శాసనాల్లో ఒక భూపతిరి ఉపేంద్ర దేవర పేర్కొనబడ్డాడు ఈ గ్రామం పిఠాపురం తాలూకాలో వుంది

**రామజోస్యుల :** వ్యక్తినామం రామజోస్యుల ఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది

**రామరాజు :** వ్యక్తినామం రామశబ్దంపై రాజు చేరింది హంపికి చెందిన శా శ1478 నాటి శాసనంలో మహామండలేశ్వరుడైన ఒక రామరాజు కోనేటయ్య దేవ మహారాజుల ప్రస్తావన వుంది ఇతడు ఆత్రేయగోత్రజుడు చంద్ర వంశస్థునిగా పేర్కొనడం జరిగింది ప్రొద్దటూరు తాలూకా బొల్లవరం శాసనంలో (సదాశివరాయల పాలనాకాలం) సోమవంశానికి చెందిన ఆత్రేయగోత్రజుడైన రామరాజు తిమ్మరాజు ప్రస్తావన వుంది ఇతడు అరవీటి బుక్కరాజు కుమారుడు.

**రామసాని :** వ్యక్తినామం రామసాహిణికి సంక్షిప్తరూపం. స్త్రీసంబంధం మైతే రామస్వామిని శబ్దభవం.

**రామాపల్లి :** గ్రామనామం. శా శ. 1386 నాటి శాయింపేట శాసనంలో ఆత్రేయగోత్రుడైన రామాపల్లి ఔభళభట్లు ప్రస్తావన గలదు.

**రామాయణం:** రామ కథా సంబంధి రామాయణం. రామయణాన్ని గానం చేసేవారిని రామాయణకులుగా సంభావింపబడతారని గుణరత్న మహోదధి పేర్కొంటున్నది.

**రామిరెడ్డి :** వ్యక్తినామం రామశబ్దంపై రెడ్డి శా శ 1272 నాటి సింహాచల శాసనంలో ఒక శ్రీరామరెడ్డి నరసింహమ ప్రస్తావన వుంది

**రామిశెట్టి :** వ్యక్తినామం రామిశెట్టి వారిపల్లె చంద్రగిరితాలూకాలో వుంది.

**రాయ :** రాచశబ్దభవం రాయవారి పల్లె చంద్రగిరితాలూకాలో వుంది

**రాయంకి - రాయంకుల :** గ్రామనామం బహువచనం రాయంకుల.

**రాయనపెగ్గడ :** ఇది వ్యక్తినామం. శా శ 1138 నాటి విజయవాడ మల్లేశ్వరస్వామి ఆలయశాసనాల్లో ఒక రాయనపెగ్గడ పేర్కొనబడ్డాడు. ఇతడు గొంటూరి ఒడయరాజుల సమస్త సేనాధిపతిగా చెప్పబడ్డాడు బహుశా, ఆ సమీపంలోని రాయనపాడు గ్రామం ఇతని పేరుమీదుగా వచ్చియుండవచ్చు.

**రాయపాడు - రాయపాటి :** శిరివెళ్ల తాలూకాగ్రామం

**రాయల :** రాయశబ్దంపై బహువచనం. కాగా రాయలం భీమవరంతాలూకా గ్రామం. రాయల పంతులపల్లె అనేగ్రామం కడపతాలూకాలో వుంది

**రాయవరపు :** రాయవరంకు ఔపవిభక్తిక రూపం. గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాగ్రామం. ఇంకా వుండవచ్చును

**రాయసం :** వ్రాయస శబ్దం వ్యవహారంలో రాయసమయింది. వ్రాతవ్రాసే వాడు వ్రాయసకాడు. అయితే వ్రాసేవారందరికి సామాన్యంగా వర్తించే వ్యవహారం కాదిది. ఇది ఒక ఉద్యోగం. అయితే, రాజస్వం అనే పదం కూడ రాయసం అయ్యే అవకాశముంది. రాజస్వం అంటే రాజ్యానికి చెందవలసిన పన్ను. అందుకనే రైతులు చెల్లింపవలసిన భూమిశిస్తును భూరాజస్వం అంటారు దానికి సంబంధించిన లెక్కలను వ్రాసేవారు వ్రాయసం వారు అంటే గ్రామధికారులు కారు గ్రామాధికారులు వసూలు చేసి పంపే పన్నుల వివరాలను, గ్రామాల వారీగా, మండలాల వారీగా లెక్కలు వ్రాసేవారు, ప్రభు అస్థానంలో ఉండేవారు వారిని వ్రాయసం వారు అనేవారు వ్రాయస శబ్దం వ్యవహారంలో రాయసం అయింది అలాగే పురాణాలకు, కావ్యాలకు ప్రతులు వ్రాసే వారు కూడా కావచ్చును

చరిత్రలో ఈ ఇంటిపేరుతో రాయసం కొండ మరునయ్య అనే వ్యక్తి ప్రస్తావింపబడడం జరిగింది ఈయనను శ్రీకృష్ణదేవరాయలు, ఉదయగిరిలో తన ప్రతినిధిగా నిలిపినట్లు శాసనాల వలన తెలుస్తోంది. రాయసం అనేది ఒక ఉద్యోగం కనుక,

ఆ పనిని నిర్వహించిన వారు అనేకులుండి వుంటారు గనుక, నేటి 'రాయసం' ఇంటిపేరుగల వారంతా, ఒకే కుటుంబానికి చెందిన వారని అంటే బంధువులని చెప్పడం కుదరదు

**రాయిల :** పర్లాకిమిడి తాలూకాగ్రామం రాయలం అనేగ్రామం భీమవరం తాలూకాలో వుంది

**రాళ్లపల్లి :** ఈ పేరుతో చాలగ్రామాలు అనంతపురం, కడప, ప్రకాశం జిల్లాల్లో వున్నాయి ఈ గృహనామంతో సినీనటుడు ఒకరున్నారు

**రావాడ :** విశాఖజిల్లా అనకాపల్లి భీమునిపట్నం తాలూకాలలో ఈ పేరుతో గ్రామాలున్నాయి.

**రావి నూతల :** ప్రకాశం జిల్లా గ్రామం.

**రావికాటి :** రావికాడు గ్రామనామపు ఔపవిభక్తికరూపం శా శ. 1386 నాటి శాయింపేట శాసనంలో భరద్వాజగోత్ర రావికాటి సింగమయ్య ప్రస్తావన వుంది

**రావిపాటి :** రావిపాడుపై ఔపవిభక్తిక రూపం. రావిపాడు పేరుతో చాల గ్రామాలున్నాయి ఉదాహరణకు బాపట్ల, నరసరావుపేట తాలూకాలోనివి గ్రహింపవచ్చును. ప్రేమాభిరామకర్త త్రిపురాంతకుని గృహనామం రావిపాటి

**రావు - రావుల :** రావు శబ్దంపై బహువచనం చేరడం వలన ఏర్పడింది రావు రాజ అనే సంస్కృత శబ్దం నుండి వచ్చింది వ్యక్తుల పేర్లలో రావు ప్రసిద్ధంగా తెలిసిందే వ్యక్తుల పేర్లలోనికి రావడం, మహారాష్ట్రం ప్రభావంగా వచ్చింది. కేవలం రావు ఇంటి పేరుగా కూడా కనిపిస్తుంది. ముఖ్యంగా వెలమవారిలో కాగా రావుల అనేది ఒక కులంగా, తెగగా ఎడ్గార్ థరస్టన్ 'దక్షిణ భారతదేశపు కులాలు తెగలు' అనే గ్రంధంలో వ్రాశాడు. ఇది పొరపాటై యుండవచ్చు. వెలమలలోనే రావు ఇంటిపేరుగా గల వారి నందరిని ఒక తెగగా సంభావించియుండవచ్చు శా శ. 1432నాటి సింహాచల శాసనాల్లో రావు నృసింహ ప్రభువు ప్రసక్తివుంది. పిఠాపురం ప్రభువుల గృహనామం ఇదే శా శ 1386 నాటి శాయింపేట శాసనంలో రావు ధర్మానాయని ప్రస్తావన వుంది ఇతడు రేచెర్ల పెద అనపోతనాయని ప్రపౌత్రుడు పిఠాపురం సంస్థానం వారి గృహనామం ఇదే

**రావెళ్ల - రావెల :** రావెల అనేగ్రామం మంగళగిరి తాలూకాలోవుంది. రావెలపై బహువచనం రావెళ్ల రావిళ్ల వారి ఖండ్రిక కాళహస్తి తాలూకాలో వుంది శా శ 1554 నాటి మార్కాపురం తాలూకా వెంకటాద్రిపాలెం శాసనంలో వెల్లుట్ల గోత్రజుడైన ఒక రావెల మల్ల మహీపతి ప్రస్తావన గలదు.

**రాసినేని :** శా శ 1334 నాటి సర్వవరంశాసనంలో ఒక రాసినేని తిప్పన ప్రస్తావన గలదు రాజ - రాజి - రాచి - రాసి గా మార్పు పొందింది.

**రూపెనగుంట్ల :** గుంటూరుజిల్లా గ్రామనామం శా శ 1478నాటి వంగీపురం శాసనంలో కౌశికగోత్ర, కాత్యాయనసూత్ర శుక్లయజుశ్శాఖాధ్యాయి రూపెనగుంట్ల కృష్ణయ్య ప్రస్తావింపబడ్డాడు ఇదే గోత్రప్రవరలకు చెందిన వారిగా మందడపు వారిని కూడా పేర్కొనడం జరిగింది

**రెంటచింతల :** ఇది పల్నాడు తాలూకా గ్రామం రెంట చింతల లోని రెంట శబ్దాన్ని రెండు అనే సంఖ్యావాచక సంబంధమని భావించి, ఒకరు తమ గృహనామాన్ని ద్వితింత్రిడి (రెండు చింతచెట్లు) గా మార్చుకున్నారు అయితే రెంటచింతల మొత్తం ఒకమొక్క పేరు

**రెంటాల :** ఇది ఒకరకం గడ్డిపేరు ఈ పేరుగల గ్రామం గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలో వుంది

**రెడ్డి :** జాతిసూచి, పదవీసూచి, రెడ్డివారిపల్లె వాయల్పాడు తాలూకాలో వుంది

**రెడ్డిపల్లె :** గ్రామనామం రెడ్డిపల్లె సుబ్బారావు ఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది

**రెబ్బ :** పార్వతీపురం తాలూకాగ్రామం

**రెబ్బాప్రగడ :** రెబ్బాగ్రామానికి చెందిన ప్రగడ

**రెల్లి :** శృంగవరపుకోట తాలూకాగ్రామం రెల్లి గౌరమ్మపేట కూడ అదే తాలూకాలో వుంది కాగా రెల్లి ఒకజాతి జనులు బహుశా ఆగ్రామం వారు అనే అర్థంలో వచ్చియుండవచ్చు

**రేకపల్లె :** భద్రాచలం తాలూకాగ్రామం

**రేగ :** గజపతినగరం తాలూకాగ్రామం

**రేచెర్ల :** ఇది పశ్చిమగోదావరిజిల్లా కామనరపుకోట తాలూకాగ్రామం ప్రధానంగా ఈ ఇంటిపేరుగలవారు చరిత్రలో పద్మనాయకులుగా కన్పిస్తారు కాకతీయ రాజ్యస్థాపనాచార్యులుగా చెప్పబడ్డారు ప్రస్తుతం కమ్మ,వెలమ,, రెడ్డికులాల్లో ఈ గృహనామం కన్పిస్తుంది ఇతరుల్లో కూడ వుండే అవకాశముంది. బ్రహ్మనాయని గృహనామం ఇదే. శా శ 1134 నాటి ద్రాక్షారామ శాసనంలో కాకతి రాజ్య సమర్థుడైన ఒక రేచర్ల రుద్రిరెడ్డి పేర్కొనబడ్డాడు

**రేటూరి :** రేటూరు అనేగ్రామం బాపట్ల తాలూకాలో వుంది

**రేనిపల్లె :** శా శ 1316 నాటి సర్పవరం శాసనాల్లో ఒక రేనిబల్లె తెలుంగన ప్రస్తావన కలదు

**రేడిమల్లు :** శా శ 1364 నాటి సింహాచలం శాసనంలో కలింగ దండపాట పరీక్షయైన ఒక రేడిమల్లు కుమారగురుమహాపాత్రుని ప్రశంస గలదు. రేడి అనే గ్రామం పొట్టంగి ఏజెన్సీలోవుంది రేడి గ్రామానికి చెందిన మల్లు అనే భావనలో వచ్చింది

**రేపాల :** కృష్ణాజిల్లా నందిగామ తాలూకా గ్రామం

**రేబాల :** కోవూరు తాలూకాగ్రామం లక్ష్మీ నరసారెడ్డి ఈ గృహనామంతో ప్రముఖులు

**రేమల్లె :** కృష్ణాజిల్లా నూజివీడు తాలూకాగ్రామం

**రేలంగి :** ఈ గ్రామం పశ్చిమగోదావరి జిల్లా తణుకుతాలూకాలో వుంది ప్రసిద్ధహాస్యనదులు రేలంగి వెంకట్రామయ్యగారు

**రేవనూరు (ది) :** కోయిలకుంట్ల తాలూకాగ్రామం

**రేవూరు (ది) :** ఆత్మకూరు తాలూకాగ్రామం రేవూరి అనంతపద్మనాభరావు ఆకాశవాణి డైరక్టరు

**రైవాడ :** వీరపల్లి తాలూకాగ్రామం

**రొక్కం :** గ్రామనామం. రొక్కం లక్ష్మీనరసింహం దొర ప్రసిద్ధులు

**రోణంకి :** శ్రీకాకుళం జిల్లా గ్రామం రోణంకి అప్పలస్వామి ప్రసిద్ధులు.

**రోళ్ల :** గ్రామనామం. రోళ్లవారిపల్లె చంద్రగిరితాలూకాలో వుంది

**లకంసాని :** వ్యక్తినామం. లక్ష్మి లకుమగా మార్పుచెందింది ఆపైన సాని లకంసాని చక్రధరరావు భాషావేత్త

**లక్కరాజు :** వ్యక్తినామం. లక్ష్మీశబ్దభవం లక్క శా శ 1318నాటి ఐద్వేలు తాలూకా పలుగురాళ్లపల్లి గ్రామశాసనంలో ఒక లక్కరాజు అల్లాద రాజు ప్రస్తావింపబడ్డాడు

**లక్కిసెట్టి :** లక్ష్మీశబ్దభవం లక్కి శా శ 1221 నాటి ఆలంపురం శాసనంలో లక్కిసెట్టి లక్కయ్య ప్రస్తావన వుంది

**లగడపాటి :** సత్తెనపల్లి తాలూకా గ్రామం లగడపాడుకు ఔపవిభక్తిక రూపం

**లంక :** నదీ మధ్యభాగంలోని ఎత్తైన భూమి శ్రీలంక తెలిసిందే లంక సుందరం ఆర్థికశాస్త్రవేత్త

**లంకపల్లి :** కృష్ణాజిల్లా దివి, గన్నవరం తాలూకాలో ఈ పేరుతో రెండు గ్రామాలున్నాయి శా శ 1318 నాటి పొన్నూరు శాసనంలో ఒక లంకపల్లి భావన ప్రస్తావింపబడ్డాడు

**లండ - లండా :** శా శ 1324 నాటి సింహాచల శాసనంలో ఒక లండా పెమ్మసాని ప్రస్తావన వుంది లండ అనేగ్రామం బలిగూడ ఏజెన్సీలోవుంది

**లాము - లాం :** ఇది గుంటూరుజిల్లా గ్రామం లాము అంటే కొండ అంచు ప్రదేశం

**లావు :** లావేరు అనేగ్రామం చీపురుపల్లె తాలూకాలో వుంది బహుశా ఈ గృహనామానికి ఇది ఆకరం కావచ్చును విజ్ఞాన్ సంస్థల అధినేత రత్తయ్యగారి గృహనామం ఇదే.

**లింగం :** చూడు లింగనమఖి.

**లింగనమఖి :** ఇది వ్యక్తి నామం లింగ, అన్నల కలయిక లింగన. శివునికి ప్రతీకగా లింగమును భావించడం తెలిసిందే దానిపై పూజ్యార్థంలో లేక అప్యాయపరంగా అన్న చేరి లింగన్న అయి వ్యవహారంలో లింగన అవుతుంది. మఖి శబ్దం మఖ అనే సంస్కృత శబ్ద వ్యుత్పన్నం దీనికి క్రతువు, యజ్ఞము అని అర్థాలు అవిచేసిన వాడు మఖి సోమయజ్ఞం చేసిన వారు సోమయాజివలె. ఈ లింగనమఖి ప్రసిద్ధుడు కావడం వలన అనంతరం ఆయన పేరే ఆ కుటుంబీకులకు గృహనామమయింది

**లింగమనేని :** లింగమ నాయకుడు లింగమనేనిగా పరిణామం చెందింది. ఇది వ్యక్తినామం 13వ శతాబ్దం నాటికే ఇది గృహనామంగా కన్పిస్తుంది. గుంటూరుజిల్లా కాజ శాసనాల్లో ఒక లింగమనేని మాచానేందు పేర్కొనబడ్డాడు లింగంనేనిపల్లె వాయల్పాడు తాలూకాలో వుంది

**లింగంగుంట :** ఈ పేరుతో గుంటూరు, ప్రకాశం జిల్లాల్లో గ్రామాలున్నాయి.

**లింగరాజు :** వ్యక్తినామం. శివుని లింగరూపంలో పూజించడం తెలిసిందే. శా శ1477 నాటి ఒంటిమిట్ట శాసనంలో శ్రీవత్సగోత్రం, ఆపస్తంబ సూత్రం యజుశ్శాఖాధ్యాయియైన ఒక లింగరాజు తిమ్మయ ప్రస్తావింపబడ్డాడు

**లెక్కల :** ఇది గణితసంబంధమైనది కాదనిపిస్తోంది. లెక్కూరు అనే గ్రామం దక్షిణ ఆర్కాటుజిల్లా వృద్ధాచలం తాలూకాలో వుంది శా శ 996 నాటి గుంటూరుజిల్లా విప్పర్ల శాసనంలో ఒక లెక్కల్ల కొమ్మిశెట్టి ప్రస్తావన వుంది

**లేమల్లె :** లేమల్లె అనేగ్రామం గుంటూరు జిల్లాలో వుంది.

**లొల్లా :** తెలియవచ్చినంత వరకు ఈ గృహనామం బ్రాహ్మణ కుటుంబాల్లో కన్పిస్తుంది. దీనికి దున్నిన నేలను మిట్ట పల్లాలు లేకుండా సర్దే బల్ల అని నిఘంటువుల్లో అర్థమున్నది. ఆ అర్థాన్నే గృహనామంగా గుర్తించడం పొసగదు. ఇంతకూ ఇదొక ఊరి పేరు. తూర్పుగోదావరి జిల్లాలో ఉంది ఈ లొల్ల ఒక రకం దుంపమొక్క గృహ నామం గ్రామ నామపరంగా వచ్చింది లొల్ల మహదేవ పండితుడు, కొండవీటి పాలనాకాలంలోని గొప్ప పండితుడు శా శ 1468 నాటి కొండవీటి శాసనంలో లొల్లావారి ప్రస్తావనవుంది.

**లోకబోయిన :** శా శ 1228 నాటి పాలకొల్లు శాసనంలో ఒక లోకబోయిన అన్నెబోయని ప్రస్తావన వుంది. లోకగ్రామనామ ప్రథమావయవం లోకమూడి.

**లోవ :** పర్లాకిమిడి తాలూకాగ్రామం

**వక్కలగడ్డ :** దివితాలూకా గ్రామం శా శ. 1718 నాటి పెదకళ్లేపల్లి శాసనంలో వక్కలగడ్డ నాగినేందు ప్రస్తావనవుంది

**వక్కలంక :** అమలాపురం తాలూకా గ్రామం

**వకుళాభరణం :** బిరుదునామం శ్రీమహావిష్ణువు ధరించేమాల వకుళమాల శా శ 1506 నాటి చిన్న అహోబిలం శాసనంలో ఒక వకుళాభరణం జియ్య ప్రస్తావన వుంది ఇతడు శఠగోపజీయగారి శ్రీకార్యకర్త

**వగళ్ల :** వాయల్పాడు తాలూకా గ్రామనామం వగళ్లవారిపల్లె చంద్రగిరి తాలూకాలో వుంది

**వంకాయలపాటి :** వంకాయలపాడు గుంటూరు నరసరావుపేట తాలూకాల్లో వుంది వంకాయలపాటి వారిపల్లె చంద్రగిరి తాలూకాలో వుంది

**వంగర :** రాజాంతాలూకాగ్రామం, ఇంకా వేరు చోట్ల కూడా వున్నాయి ఈ గృహనామంతో ఒక సినీనటులున్నారు

**వంగల :** గ్రామనామం శా శ 1466 నాటి మార్కాపురం శాసనాల్లో వంగల చెన్నయ్య ప్రస్తావింపబడ్డారు.

**వంగూరి :** వంగూరు ఏలూరు తాలూకాలో వుంది వంగూరి సుబ్బారావు సాహితీ లోకానికి పరిచితులు

**వచ్చ - వత్స :** గ్రామానామ పుర్వపదం వత్సవలస (శ్రీకాకుళంతాలూకా) వత్సవాయి అనే గ్రామాలున్నాయి

**వచ్చెనేని : వత్సనేని :** ఇందలి వత్స గ్రామనామ పూర్వపదం శా శ 1221 నాటి అలంపురం శాసనంలో ఒక వచ్చెనాయనినాగిసెట్టి ప్రస్తావన వుంది

**వజ్జె - వజ్ఝ :** ఉపాధ్యాయ శబ్దం వఝగారూపొందింది అయితే కన్నడంలో వజ్జయవ్యక్తి నామంగా వుంది అక్కడ దానికి బరువు అని అర్థం అఉక వజ్జయ వ్యక్తినామంగా అనే వ్యక్తనామంవుంది.

**వట్టెం - వర్యం :** శా శ 1221 నాటి అలంపురం శాసనంలో వట్టెంపోచెనసెట్టి ప్రస్తావన వుంది తిరువట్య అనేగ్రామం పుత్తూరు తాలూకాలోవుంది

**వదులి - వడాలి :** వదలి అనే గ్రామం పశ్చిమగోదావరిజిల్లా తణుకు తాలూకాలో వుంది వదలి వ్యవహారంలో వడాలి అయింది వదలి మందేశ్వరరావు సాహితీ లోకానికి పరిచితులు

**వడ్ల - వడ్లా :** ఇది ధాన్యసంబంధికాదు పంచాణం వారిలోని ఒకవర్గం అందులో వడ్రంగం పని చేసేవారికి ఇది వర్తిస్తుంది శా శ 1440 నాటి పెదకాకాని శాసనంలో ఒక వడ్ల బసువాభక్తుని పేర్కొనడం జరిగింది

**వడ్లమన్నాటి :** వడ్లమన్నాడుకు ఔపవిభక్తిక రూపం కృష్ణాజిల్లా బందరు తాలూకా గ్రామం

**వడ్లమాని - వడ్డమాని :** వడ్డమాను పేరు గుంటూరు, నందికొట్కూరు తాలూకాలలో గ్రామాలున్నాయి నూజివీడు తాలూకాలో వడ్లమాను అనే గ్రామం వుంది

**వత్సవాయ :** కృష్ణాజిల్లా నందిగామ తాలూకా గ్రామం పెద్దాపురం తాలూకా తిరుపతి శాసనంలో ఒక వత్సవాయ అయ్యపదేవరాజుల ప్రస్తావన గలదు

**వద్దినేని :** వ్యక్తినామం వద్దినాయుడుకు ఔపవిభక్తిక రూపం వర్ధనశబ్దం వద్దికావడానికి అవకాశముంది అయితే వద్దిమడుగు (పొదిలిమాలూకా) వద్దిపర్రు వద్దిరాల అనే గ్రామలువున్నాయి గ్రామనాయకుడు అనికూడ చెప్పవచ్చును. కాగా వర్ధినేని పాలెం అనేగ్రామం కందుకూరు తాలూకాలోవుంది

**వద్దిపర్తి :** వద్దిపర్రు రాజోలు తాలూకాగ్రామం

**వనమా :** ఇది వన శబ్దం కావచ్చును లేక పాలకొండ తాలూకా గ్రామమైన వడమా మార్పుచెంది వుండవచ్చును

**వంతాడ :** పెద్దాపురం తాలూకాగ్రామం

**వంతరాం :** ఇది వంత, రాము కాదు వంతరాం ఏక పదమే నిజరూపం వంతరము. వ్యవహారంలో వంతరాంగా స్థిరపడింది ఇదొక ఊరిపేరు విజయనగరం జిల్లా, బొబ్బిలి తాలూకాలో ఈ పేరుతో గ్రామముంది

**వన్న - వన్నె :** పర్లాకిమిడి తాలూకాగ్రామం

**వయళ్ల :** గ్రామనామం వయళ్ల వారిపల్లె చంద్రగిరి తాలూకాలో వుంది.

**వరద :** శా శ 1297 నాటి సింహాచలం శాసనంలో ఒక వరద బోడిగ వల్లభుని ప్రస్తావన వుంది

**వరదనాయక - వరదానేని :** వ్యక్తినామం. వరద శబ్దంపై నాయక, నేని శబ్దాలు.

**వరదార్థం :** శా శ 1386 నాటి శాయింపేట శాసనంలో హరిత్రగోత్ర వరదార్థం నారాయణయ్య ప్రస్తావన వుంది.

**వలవల :** గ్రామనామం. వలవ అనే గ్రామం పార్వతీపురం ఏజెన్సీలో వుంది

**వలినేని :** ఇందలి వలి, వల్లయ శబ్దసంబంధి. ఇది శివునికి సంకేతం శా శ 1192 నాటి తెనాలి తాలూకా మూల్పూరు శాసనాల్లో ఒక వల్లయ నాయకుడు, కాకతి రుద్రదేవమహారాజుల శ్రీవాకిలి అంగరక్షకునిగా చెప్పబడ్డాడు

**వల్లంకి :** విశాఖజిల్లా వీరవల్లి తాలూకాగ్రామం

**వల్లభనేని - వల్లభుని - వల్పినేని :** వల్లభుడు అంటే ప్రభువు, భర్త అని అర్థాలు శా శ 1181 నాటి దుర్గ శాసనంలో ఒక వల్పినాయని ప్రస్తావన వుంది

**వల్లభిసెట్టి :** ఇది వ్యక్తినామం వల్లభశబ్దం, ముఖ్యుడు, ప్రధముడు, ప్రభువు, నాధుడు అనే అర్థాల్లో కన్పిస్తుంది వైశ్య వర్గానికి చెందిన ఒక వల్లభశెట్టి, శా శ 1480 నాటి మంగళగిరి శాసనంలో పేర్కొనబడ్డాడు

**వల్లం :** ఈ గ్రామం తమిళనాడులోని వాలాజపేట తాలూకాలో వుంది ఇంకా చాలా గ్రామాలున్నాయి గంజాం జిల్లాలో కూడా వుంది సినీనటులు నరసింహారావు ఇంటిపేరు ఇదే

**వల్లంపాటి :** వల్లంపాడు గ్రామనామపు ఔపవిభక్తికరూపం

**వల్లూరు:** ఈ పేరుతో ఆదోని, ప్రకాశం జిల్లాలో ఇంకా చాల జిల్లాల్లో గ్రామాలున్నాయి తోట్లవల్లూరు అనే గ్రామం కృష్ణాజిల్లాలో వుంది. గుడ్లవల్లేరు అసలు పేరు గుడ్ల వల్లూరు మధురాంతక వల్లూరు అనే గ్రామం కూడ వుండేది

**వలివేటి :** వలివేరు అనే గ్రామం తెనాలి తాలూకాలో వుంది వలివేటి అనేది ఈ పదం పై ఔపవిభక్తిక రూపం వలివె అనేది ఒక రకం గడ్డి

**వసంత:** దీనిని వసంతంగా భావించి అర్థం చెపుతారు అంటే ఋతు సంబంధిగా, లేక వసంతకాలంలో చల్లుకునే రంగునీళ్ళుగా భావిస్తారు కాని వసంత అనేది శృంగవరపుకోట తాలూకాలో ఒక గ్రామం వసంత శబ్దానికి బాటసారులు మార్గమధ్యంలో విడిది చేసే చోటు అని అర్థం. శాసనాల్లో వసంతీశ్వరము అనేది పేర్కొనబడింది ఈ శబ్దం జైన సంబంధమైన బసతి నుండి ఏర్పడింది తిరిగి ఈ బసతియే బస్తీ అయినది పశ్చిమగోదావరి జిల్లాలో వసంతవాడ అనే గ్రామంవుంది వసంత నాగేశ్వరరావు మంత్రిగా పనిచేశారు

**వసాది :** విజయనగరం తాలూకాగ్రామం.

**వాకలపూడి :** గ్రామనామం. శా శ 1685 నాటి శ్రీకూర్మం శాసనంలో ఒక వాకలపూడి శంకరుని ప్రస్తావన వుంది. కామవరపుకోట తాలూకా గ్రామం

**వాకాటి :** వాకాడు అనే గ్రామం నెల్లూరుజిల్లాలో వుంది దాని ఔపవిభక్తిక రూపం వాకాటి. వాకాటి పాండురంగారావు ప్రసిద్ధరచయిత

**వాకిటి :** వాకిలికి ఔపవిభక్తక రూపం శా శ 1455 ధర్మవరం తాలూకా కనగానిపల్లె శాసనంలో ఒక వాకిటి తిమ్మప్పనాయని ప్రస్తావన వుంది

**వాక్యం :** దీనికి మూలం వాక్యాం అనే నెల్లూరుజిల్లా వెంకటగిరి తాలూకాగ్రామం

**వాజపేయాజుల :** ఇది కేవలం బ్రాహ్మణ కుటుంబాలలో మాత్రమే కన్పించే గృహ నామం వాజపేయ, యాజి(లు) శబ్దాల కలయిక వాజపేయాజుల యజ్ఞం చేసినవాడు యాజి సోమయజ్ఞం చేసినవాడు సోమయాజి. చేసే వ్యక్తికి గాక, చేస్తున్న క్రతువుకు కూడా యాజి శబ్దం వర్తిస్తుంది ఇక వాజపేయం చేసిన వ్యక్తి వాజపేయాజి 'లు' గౌరవార్థంలో చేరిన బహువచనం. రాజులు, బ్రాహ్మణులు ఉచ్ఛస్థితిని కోరి చేసే క్రతువు సోమ యజ్ఞం ఏడు విధాలు. అందులో వాజపేయం ఒక రూపం అయితే ఇది రాజసూయానికి బృహస్పతి సేవకు పూర్వం చేయాలి యజ్ఞఫలమైన పానీయానికి (సోమరసం) కూడా ఇది పేరు కణ్వ శాఖీయమైన శతపథ బ్రాహ్మణం లోని ఆరవ గ్రంధానికి కూడా ఇది పేరు కనుక, వాజపేయం చేసినవారికి లేదా శతపథ బ్రాహ్మణంలోని

పై గ్రంథంపై అధికారం, గలవారికి ఈ గృహనామం చెల్లివచ్చే అవకాశముంది శా శ 1145 నాటి గుంటూరు జిల్లా చెరుకూరు శాసనంలో ఒక నారాయణభట్ట వాజపేయాజుల ప్రస్తావన వుంది

**వానపాములు :** కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాగ్రామం

**వానపోతుల:** శాసనాల్లో ఇది గృహనామంగా కన్పిస్తోంది కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకా రామేశ్వర శాసనంలో ఒక వానపోతుల ముచ్చియప్రస్తావింపబడ్డాడు. ఇది పుణ్యకుమార పృధ్వీ వల్లభచోళ మహారాజుల 5వ విజయ రాజ్యసంవత్సరంలో వేయంపబడింది. బహుశా ఇది వ్యక్తినామంకావచ్చు. వానపాముల, వానాల గ్రామనామాల్లోని పూర్వపదంపై పోతు చేరి వుండవచ్చు.

**వానమామలై :** గ్రామనామం వానమామలై, వరదాచార్యులు ప్రసిద్ధులు.

**వానాల :** నందొకొట్కూరు తాలూకాగ్రామం

**వాబ :** పర్లాకిమిడి తాలూకాగ్రామం.

**వాయిలాడ :** గ్రామనామం. శా శ 1123 నాటి సర్పవరం శాసనంలో ఒక వాయిలాడ బ్రహ్మండిసెట్టి ప్రస్తావన వుంది

**వారణాసి:** పర్లాకిమిడి తాలూకా గ్రామం భారతీయులకు అతి పవిత్రమైనది కాశీ దీనికి గల మరొక పేరు వారణాసి ఇది వారుణ, అసి అనే రెండు నదులు కలిసే చోట ఏర్పడినది కనుక దీనికా పేరు వచ్చింది దీనిని వారణాసి అని కూడా వ్రాసారు. దీనినే మనం ప్రస్తుతం బెనారస్ అంటున్నాం వారణాసిలోని 'వ' కారాన్ని 'బ' కారంగా కూడా ఉచ్చరిస్తారు అందువలన అది బనారసి ఆంగ్ల వ్యవహారంలో బెనారస్ అయింది అక్కడ నుండి వచ్చిన వారికి ఇది ఇంటిపేరుగా స్థిరపడిందని చెప్పవచ్చు అలాగే ప్రయాగ అనే ఇంటి పేరు కూడా అయితే వారణాసి పేరుతో పర్లాకిమిడి తాలూకాలో ఒక గ్రామముంది. తెలుగు బ్రాహ్మణ కుటుంబాలలోని ఇంటి పేరుకిది సమీప మాతృక. ఆ గ్రామం ఏర్పడడానికి కారణం ఉత్తర భారతంలోని వారణాసియే బృందావనం కూడా ఇలాంటిదే సింహాచలానికి వారణాసీకటకమనే పేరున్నట్లు శాసనాల్లో చెప్పబడింది శా శ 1344 నాటి పాలకొల్లు శాసనంలో ఒక వారణాసి మారన ప్రస్తావన వుంది పర్లాకిమిడి తాలూకా గ్రామం

**వాలిచెర్ల :** ప్రకాశంజిల్లా కనిగిరి తాలూకాగ్రామం

**వావింటపర్తి :** గ్రామనామం రాపూరు తాలూకాగ్రామం

**వావిలాల :** కృష్ణాజిల్లా తిరువూరు తాలూకా గ్రామం తెలంగాణంలో కూడా వుంది

**వావిళ్ల :** నెల్లూరుజిల్లా కోవూరు తాలూకాగ్రామం పుస్తక ప్రచురణ సంస్థ నిర్వాహకులు రామస్వామిశాస్త్రిగారి గృహనామం

**వాశిరెడ్డి:** వ్యక్తినామం. శా శ 1352 నాటి పిఠాపురం శాసనాల్లో వాశిరెడ్డి పోతినేండు ప్రస్తావన ఉంది అమరావతి (చింతలపూడి జమీ) నేలిన వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు ప్రసిద్ధుడు.

**వాశిలి:** నెల్లూరుజిల్లా ఆత్మకూరు తాలూకాగ్రామం.

**విక్రాల:** గ్రామనామం విక్రాల వారి ఖండ్రిక వెంకటగిరి తాలూకాలో వుంది.

**వింజం:** చిత్తూరు తాలూకాగ్రామం. శా శ 1498 నాటి తెనాలి తాలూకా శాసనంలో వింజం పోతయ్య ప్రస్తావన వుంది.

**వింజమూరి:** నెల్లూరు జిల్లా గ్రామం.

**వింజరం - ఇంజరం:** వింజరం అనే గ్రామం కృష్ణాజిల్లా కైకలూరు తాలూకాగ్రామం

**వినపాల:** గ్రామనామం సింహాచలం శాసనంలో పాలవర్తిగోత్రజుడు వినపాల లింగానాయని ప్రస్తావన వుంది

**వింతల:** శా శ. 1448 నాటి ఉండవల్లి శాసనంలో వింతల బాలిరెడ్డి ప్రస్తావనవుంది

**వింధ్యవాసి:** గజపతినగరం తాలూకాగ్రామం.

**విన్నకోట:** కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాగ్రామం.

**విప్పర్ల:** ఇది గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా గ్రామం

**విప్రవినోది:** ఇది వృత్తిపరంగా వచ్చినది. వినోదాన్ని కల్పించే విప్రులు. వీరినే కొన్ని సందర్భాలో పగటివేషగాండ్రు అని, పగటి భాగవతులని చెప్పడం కద్దు శా.శ 1472నాటి కడపజిల్లా కలమళ్ల శాసనంలో ఒక విప్రవినోది వల్లభయ్య ప్రస్తావన వుంది అయితే ఇది ప్రస్తుతం గృహనామంగా వుందో లేదో తెలియరాదు

**విరియాల:** గ్రామనామం కటుకూరుశాసనాల్లో విరియాల సూరన ప్రస్తావింపబడ్డాడు

**విరూరు (రి):** నెల్లూరుజిల్లా ఆత్మకూరు తాలూకాగ్రామం. చరిత్రలో ఒక విరూరి

**విశ్వనాథ:** వ్యక్తినామం. వేదాద్రి మంత్రి వున్నాడు విశ్వనాథ సత్యనారాయణగారు తాము మొదట జిల్లా దివితాలూకా విశ్వనాథపల్లి వాసులు కావడం వలన తమకా గృహనామం చెల్లివచ్చిందని చెప్పికున్నారు. శా శ 1332 నాటి అహోబలం శాసనాల్లో ఒక ఈ శింగాయ పండితులవారి విశ్వనాథ పెమ్మయి ప్రస్తావనవుంది

**విశ్వనాథుని:** వ్యక్తినామం శా శ. 1535 నాటి తిరునల్వేలి జిల్లా, అంబసముద్రం తాలూకా వెళ్లంగుళి శాసనంలో ఒక విశ్వనాథుని వీరప్ప ప్రస్తావన వుంది అతడు ఆసీమకు పాలకుడు

**విష్ణుసోమయాజుల:** వ్యక్తినామం విష్ణుశబ్దంపై సోమయాజులు అతడు యజ్ఞంచేసి, సోమయాజి కావడం, అతడు ప్రసిద్ధుడు కావడం వలన అనంతరం ఆ కుటుంబాల వారికి అది గృహనామమైంది

**విష్ణుచక్రం :** టెక్కలి తాలూకాగ్రామం

**విస్తర :** పర్లాకిమిడి తాలూకాగ్రామం

**విస్సా :** విశ్వశబ్దం విస్స అవుతుంది. విస్సాపురం విస్సంపల్లె విస్సన్నపేట అనే గ్రామాలున్నాయి విస్సా అప్పారావు ఈగృహనామంతో ప్రముఖులు అయితే విస్సాకోడేరులోని విస్సా, విశ్వశబ్దభవంకాదు హిస్సాశబ్దభవం హిస్సా పొలంకవుళ్ళలోని భాగస్వామ్యాన్ని తెలియజేస్తుంది

**వీణ :** సంగీత సాధనంగా వీణ తెలిసిందే దాని వాదనలో ఘటికులైన కొన్ని కుటుంబాల వారికిది పట్టపు నామంగా వర్తించింది మరికొన్ని సందర్భాలలో, గ్రామ నామం గావడం వలన కూడా ఇంటిపేరైంది వీణవంక అనే గ్రామం కూడా వుంది అయినపుడు వీణ ఒకరకం గడ్డి కావచ్చును శా శ 1468నాటి కొండవీటి శాసనం ఒకదానిలో ఒక వీణ తిమ్మయ పేర్కొనబడ్డాడు

**వీరకూటం - వీరకూటమి :** గ్రామనామం వీరఘట్టం శాసనాలలో అలా వ్రాయబడింది శా శ 1276 సింహాచలశాసనంలో భరద్వాజ గోత్రజుడైన ఒక వీరకూటపు నరసింహరాజు ప్రస్తావన వుంది

**వీరంకి :** కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాగ్రామం

**వీరగంధం :** చూడు. గంధం వీరగంధం వెంకట సుబ్బారావు హరికధకులు.

**వీరపనేని :** వీరప్పనాయకుడు అనేది అసలు వ్యక్తినామం శా శ1174 నాటి ద్రాక్షారామ శాసనాల్లో ఒకప్రేకేటి వీరపనాయకుని ప్రస్తావనవుంది. అయితే అతడే సంస్కృతశాసన భాగంలో వీరపరెడ్డిగా చెప్పబడడం గమనార్హం ఇతడు చతుర్ధ కులజునిగా పెద్దమున్నాటిగా చెప్పబడ్డాడు మహామండలేశ్వరుడైన ఒడ్డాది జయంతి రాజుకొడుకు అర్జునదేవుడు ఇతని అల్లునిగా, కుమార్తె సూరమదేవిగా చెప్పబడ్డారు ఇక్కడరెడ్డి శబ్దం గౌరవార్థం గావచ్చు. వీరపనేని గూడెం గన్నవరం తాలూకాలో వుంది

**వీరభద్ర :** పర్లాకిమిడి తాలూకాగ్రామం.

**వెలగపూడి - ఎలగపూడి :** గుంటూరుజిల్లా మంగళగిరి తాలూకాలో వుంది. వెలగపండు తెలిసిందే అయితే ఈ వెలగ గడ్డిమొక్క వెలగలోని 'వ' కారం లోపించి ఎలగ అయింది. వెలగపూడి రామకృష్ణ ప్రముఖులు

**వెలది :** స్త్రీ పర్యాయపదంగా ఇది తెలిసినదే కాని ఈ ఇంటి పేరు రావడానికిది కారణం కాదు ఇదొక ఊరి పేరు కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలో ఈ గ్రామముంది. వెల్దిపాడులోని వెల్దికూడా ఇదే బహుశా ఇది చెట్టు పేరు గావచ్చును. పై ఇంటి పేరు రావడానికి కారణం పై గ్రామమే

**వెలవల :** నరసాపురం తాలూకా గ్రామనామం.

**వెలిగందల :** గ్రామనామం. వెలిగందల నారయ సాహితీలోకానికి పరిచితుడు.

**వెలిచేరు :వెల్చేరు :** - రాజోలు తాలూకాగ్రామం వెల్చేరు నారాయణరావు సాహితీ విమర్శకులు

**వెలుగోటి :** వెలుగోడు అనేగ్రామం నామపు ఔపవిభక్తిక రూపం ఇది కర్నూలు జిల్లా. నందికొట్కూరు తాలూకాలో వుంది వెంకటగిరి, పాలకుల గృహనామం.

**వెల్దుర్తి :** ఈ గ్రామం గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలోవుంది

**వెల్లంకి - ఎల్లంకి :** కృష్ణాజిల్లా నందిగామ తాలూకా గ్రామం, విశాఖజిల్లా భీమునిపట్నం తాలూకాలో మరో గ్రామముంది

**వెల్లటూరి :** ఈ పేరుతోగ్రామాలు గుంటూరుజిల్లా రేపల్లె వినుకొండ తాలూకాలలో వున్నాయి వెల్లటూరి పూర్ణానంద శర్మ చిత్రకారులు

**వెల్లాల :** నందికొట్కూరు తాలూకాగ్రామం వెల్లాలవారి ఖండ్రిక రాజంపేట తాలూకాగ్రామం

**వేదం - వేదాంతం - వేదాల - వేదుల :** నాల్గు వేదాలు తెలిసినవే. వాటియందు మిక్కిలి ప్రవేశం కలిగిన కుటుంబాలకు ఇది గృహనామంగా చెల్లివచ్చిందని చెప్పడం సులభమే అయితే వేదం అనే గ్రామం చిత్తూరు జిల్లాలో వుంది తమిళనాడులో వేదవత్తం, వేదప్పది అనే గ్రామాలు తిరునల్వేలి తాలూకాలో వున్నాయి ఇలాంటిదే వేదాంతం తత్వవేదిగా వేదాంతి శబ్దముంది ఉపనిషద్విజ్ఞానం కలిగిన వారుగా వేదాంతులను భావింపవచ్చు. అట్టివారికి వేదాంతం గృహనామం కావచ్చును. వేదవత్తం అనే గ్రామం కూడా వేదాంతం కావడానికి అవకాశముంది వేదాంతం వ్యక్తి నామంగా కూడా వుంది గ్రామనామపరంగా వేద శబ్దం పైకి ప్రాకే ఒక రకం మొక్క నరసింహస్వామి నెలకొన్న క్షేత్రానికి కూడా వేదశబ్దం చెల్లివస్తుంది. అలాగే వేదుల కూడ వేద (ఋగ్వేదాది) శబ్ద సంబంధి కాకపోయే అవకాశముంది. పసివేదల అనేగ్రామం పశ్చిమగోదావరిజిల్లాలో వుంది గ్రామనామ పదంగా, ఇది మొక్క మాత్రమే వేదం వారి ఖండ్రిక పుత్తూరు తాలూకాలో వుంది. వేదం వెంకట్రాయశాస్త్రి ప్రముఖులు.

**వేదాల :** తమిళనాడులోని ఉత్తర ఆర్కాడు జిల్లా అరక్కోణం తాలూకా గ్రామం.

**వేనాడు (టి) :** గూడూరు తాలూకా గ్రామం

**వేమండ - యామండ :** రెండు విధాలా వ్యవహారముంది కృష్ణాజిల్లా గన్నవరం తాలూకాగ్రామం శా శ 1292 నాటి సింహాచల శాసనంలో ఒక వేమాండి కూనపనాయకుని ప్రస్తావన వుంది

**వేమినేని :** వ్యక్తినామం వేమనాయక నామంనుండి ఉత్పన్నము శా శ 1078 నాటి నాదిండ్ల శాసనంలో, బ్రాహ్మణుడైన ఒక వేమినాయకుని ప్రసక్తిగలదు

**వేముల :** గ్రామనామం శా శ. 1498 గుంటూరు తాలూకా కొండెపాడు శాసనంలో వేముల రాఘవయ్య ప్రస్తావనవుంది

**వేమూరు :** చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకాలోవుంది ఇంకా వుండవచ్చును ఈ ఇంటిపేరుగల వారు కృష్ణాజిల్లా దివి తాలూకాలో బ్రాహ్మణుల్లో, కమ్మవారిలో, ఉన్నారు గ్రామనామం గనుక ఇతరుల్లో కూడ ఉండవచ్చును వేము ఊరుల కలయిక వేమూరు వేము అంటే సాధారణంగా వేప చెట్టును సూచిస్తుంది అయితే వేము పేరుతో చిన్నచిన్న మొక్కలు అనేకం ఉన్నాయి నేలవేము అలాంటివాటిల్లో ఒకటి.

**వేలూరు - వేలూరి :** వేలూరు అనేగ్రామం నరసరావుపేట తాలూకాలో వుంది రాయవేలూరు తెలిసిందే వేలూరు కృష్ణమనాయడు ఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది వేలూరి శివరామశాస్త్రి సాహిత్యలోకానికి పరిచితులు.

**వేళంగి :** కాకినాద తాలూకాగ్రామం మరొక వేళంగి పెద్దాపురం తాలూకాలో వుంది

**వేసంగి :** ఎండాకాలాన్ని వేసంగి అనడం తెలిసిందే అయితే గృహనామాన్ని దీనితో సంయోజింపలేము బహుశా ఇది ఏసంగి, యాసంగి అనే గ్రామనామంకావచ్చును పోల్చిచూడు అన్నంగి, రేలంగి యాసం వారు కూడ వున్నారు

**వైద్య :** వృత్తిసూచి శా శ 1073 నాటి బాపట్ల శాసనంలో వైద్యసూర్య దేవపండితుని ప్రస్తావన గలదు

**శంకరసెట్టి :** వ్యక్తినామం పెద్దకడుమూరు శాసనాల్లో ప్రస్తావింపబడ్డాడు

**శంకరంబాడి :** తమిళనాడులోని ఉత్తర అర్కాడు జిల్లా అరక్కోణం తాలూకా గ్రామం 'మాతెలుగు తల్లికి మల్లెపూదండ' గేయరచయిత సుందరాచారి గృహనామం ఇదే.

**శంకుదార - సంకుదార :** చూడు సంకు. దేవాలయ ఉద్యోగపదవి. గుంటూరు శాసనాల్లో శంకుదారకన్నె అనే వ్యక్తి పేర్కొనబడ్డారు

**శతకోడు (టి) :** మార్కాపురం తాలూకాగ్రామం

**శతపథి :** శుక్ల యజుర్వేదానికి శతపథ బ్రాహ్మణమనేది ఒక్కటే బ్రాహ్మణం. ఇందులో నూరు అధ్యాయాలు ఉన్నాయి కనుక, దానికి ఆపేరు వచ్చింది శతపథశ్చ శతధ్యాయైః. అనంతదేవుడు కాత్యాయుని భాషిక సూత్రానికి భాష్యం వ్రాసాడు. ఈ శతపథ బ్రాహ్మణాన్ని అనుసరించి వైదిక కర్మలను నిర్వహించే శుక్ల యజుర్వేదులకు, వారి పేరు చివర శతపథి అని చేర్చడం జరుగుతోంది ఈ శతపథ బ్రాహ్మణం మాధ్యందిన, కాణ్వమని రెండు విధాలు దీనిని యాజ్ఞవల్క్య మహర్షి రచించి ఉంటాడని భావించడం జరుగుతోంది ఈ ఇంటిపేరుతో ప్రసిద్ధులైన వారు ప్రకాశచంద్ర శతపథి

**శనగల - శనగన :** అపరధాన్య విశేషం. శనగ చణకశబ్దభవం శనగల గూడూరు అనే గ్రామం తాడిపత్రి తాలూకాలు వుంది శనగన కూడా గృహనామం. శనగన నరసింహస్వామి విజయవాడకు చెందిన కవి.

**శంబర :** సాలూరు తాలూకాగ్రామం.

**శరణు - శరణం :** శరణు అనగా రక్ష ఆశ్రయం అని సామాన్యార్థాలు కాగా శైవ సంబంధమైన దీక్షా శ్రేణిలో ఒకటి అనగా భక్తులలోని శ్రేణి ఈ ఇంటిపేరుతో ప్రసిద్ధులు శరణురామస్వామి

**శర్మ :** శరమ అనేగ్రామం గుణుపురం ఏజెన్సీలో వుంది బాడి శర్మ అనేగ్రామం రాయఘడ ఏజెన్సీలోవుంది నామాంత్యపదంగా బ్రాహ్మణుల్లో కన్పించే శర్మకు దీనికి సంబంధంలేదు

**శలపాక :** కాకినాడ తాలూకాగ్రామం

**శాఖమూరి - శాకమూరి:** శాఖమూరు అనే గ్రామం గుంటూరుజిల్లాలో వుంది దాని ఔపవిభక్తికరూపం శాఖమూరి

**శాసనం :** పర్లాకిమిడి తాలూకాగ్రామం

**శికాకొల్లి:** కొల్లి ఇంటిపేరు తెలిసిందే, అయితే దానికి, ఈ శికాకొల్లికి ఏమీ సంబంధం లేదు దీనినే శిఖాకొల్లి అని కూడా వ్రాస్తారు ఇది శ్రీకాకుళం అనే దానికి మారురూపం అంటే కాలక్రమంలో అలా పరిణమించింది ఈ శ్రీకాకుళం కృష్ణాజిల్లా దివితాలూకాలో వుంది దీనికే సిరికాకొలను, కాకొలను అనేవి కూడా మారురూపాలు

**శిరందాసు:** శ్రీరామదాసు శబ్దం వ్యవహారంలో శిరందాసు అయింది ఇలాంటిదే మాదాసు. ఇది మహాదాస శబ్దం నుండి వుత్పన్నమైనది ఇలాంటిదే దేవదాసు. దైవ సేవకులు అనే అర్థంలో వ్యవహృతము

**శిరువెళ్ల - శిరివెళ్ల :** కర్నూలుజిల్లాలో తాలూకా కేంద్ర గ్రామం

**శివదేవుని :** వ్యక్తినామం శివదేవుని చిక్కాల నరసాపురం తాలూకాగ్రామం

**శివలెంక :** శివ, లెంక అనే రెండు పదాల కలయికతో ఇది ఏర్పడింది ఇందులో శివ శబ్దం పరమేశ్వరుని, లెంక అనేది సేవకుడు అనే అర్థాన్ని బోధిస్తుంది వివిధములైన రాజోద్యోగాలను లెంక శబ్దంతో సంభావించేవారు అందులో నాయంకరం చేసేవారు అవసరం వారు, అడపం వారు సమయమంతులవారు - అందరూ లెంకలే తుమ్మల సీతారామమూర్తిగారు, తాను, తెనుగులెంకనని చెప్పికున్నారు.

శివ శబ్దంతో కేవలం పరమేశ్వరునే గాక, పార్వతి దేవిని కూడ సంభావిస్తారు శివలెంక అంటే శివ సేవకులు, శివ భక్తులు అని సామాన్యార్థం కాగా , ఇది ఆరాధ్య బ్రాహ్మణులను విశేషంగా సంకేతిస్తుంది ముఖ్యంగా వీరశైవ పండితత్రయంలో శివలెంక మంచన ఒకరు. ఇది అతని బిరుదనామం అనంతరకాలంలో అది ఇంటిపేరుగా పరణమించింది ఆంధ్రపత్రికకు సంపాదకులుగా పనిచేసిన శంభుప్రసాద్‌గారి ఇంటిపేరు శివలెంక

**శిష్టు - శిష్ట్లా:** ఇది వృత్తిపరంగా శాసనాల్లో కన్పిస్తోంది. శా శ 1236 నాటి సింహాచలం శాసనంలో ఒక శివదాసునాయకుడు, సాలస్యగోత్రుడైన శ్రీ ఎరుమ మహాసేనాపతుల శిష్టుగా చెప్పబడ్డాడు దీనిని బట్టి శిష్టు శబ్దం కులబ్రాహ్మణుని సంకేతిస్తోంది అంతేగాక శిష్టు కరణాలు వున్నారు కరణాలు మూడు విధాలు మిగిలినవి గోష్ఠి, సంప్రతి కరణాలు

**శీధి :** పర్లాకిమిడి తాలూకాగ్రామం.

**శూరనేని - సూరనేని - సూర్యనేని :** వ్యక్తినామం. శా.శ.1329 నాటి సింహాచల శాసనంలో రేచర్లగోత్రుడైన ఒక సూరాయి నాయని ప్రస్తావన వుంది.

**శెకునాల - శకునాల :** కర్నూలు తాలూకా గ్రామం.

**శెట్టి:** వైశ్యుల, బలిజల పట్టపుపేరు. శా.శ 1562నాటి పాలకొల్లు శాసనంలో కాకులపాటికి చెందిన శెట్టి కృష్ణమ ప్రస్తావన వుంది. శెట్టివారిపల్లె వాయల్పాడు తాలూకాలో వుంది.

**శ్రీకాకొల్ని:** శ్రీకాకుళపు ఔపవిభక్తికరూపం. శా.శ. 1718 నాటి పెదకళ్లేపల్లి శాసనంలో శ్రీకాకొల్ని నాగిశెట్టి ప్రస్తావనవుంది.

**శ్రీకార్యం :** శా.శ. 1301 నాటి సింహాచలం శాసనంలో ఒక శ్రీకార్యం చూడామణి ప్రస్తావన వుంది. శ్రీకార్యమనగా దైవపూజ. ఇక్కడ ఇతడు ఆలవట్టము పట్టడానికి నియోగింపబడ్డాడు.

**శ్రీకొలను (ని)** నెల్లూరుజిల్లా ఆత్మకూరు తాలూకాగ్రామం.

**శ్రీగిరిపాటి - సిరిగిరిపాటి :** ఈ రెండు విధాల వ్యవహారముంది. శ్రీగిరిపాడు అనే గ్రామం గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలో వుంది. శ్రీగిరి శ్రీశైలము, నాగార్జున కొండ.

**శ్రీపతి :** వ్యక్తినామం. శా.శ 1311 నాటి సింహాచలం శాసనంలో ఒక శ్రీపతి అల్లుసేనాపతి ప్రస్తావన వుంది.

**శ్రీపాద:** బ్రాహ్మణుల్లో కన్పించే ఇంటిపేరు. శ్రీ శబ్దానికి లక్ష్మి, సంపద, పవిత్రము మొదలైన అర్థాలున్నాయి. శ్రీపాద అంటే లక్ష్మీదేవి పాదములు లేక లక్ష్మిని అర్థించే వారు అని చెప్పే వీలుంది. కాని ఉత్తర భారతదేశంలోని వివిధ జనులకు ఇది పేరుగా వర్తిస్తోంది. శ్రీ శబ్దానికిపై అర్థాలతోపాటు. సరస్వతీదేవి అనే అర్థం కూడా వుంది. మాఘ శుక్ల పంచమిని శ్రీ పంచమిగా పాటిస్తారు. బౌద్ధానికి సంబంధించి పదిహేడవ అద్వైత్ తల్లి శ్రీ. బహుశా పైన చెప్పిన వివిధ జనులు ఈ 'శ్రీ' మాతను ఆరాధించే వారు కావచ్చు. వారికి శ్రీపాద శబ్దం రూఢమై వుండే అవకాశముంది. క్రీస్తుపూర్వం మూడవ శతాబ్ది నుండి క్రీస్తు శకం మూడవ శతాబ్దం వరకు, ఉత్తర భారతం నుండి దక్షిణానికి బౌద్ధులు తరలివచ్చిన విషయం చారిత్రకమే. ఈ ఇంటిపేరుతో గూడిన గ్రామం శ్రీపాద, నెల్లూరు చిత్తూరు జిల్లాల్లో ఉంది. శ్రీపాద పండితారాధ్యుల కూడా గృహనామం.

**శ్రీరంగం :** దక్షిణాదిలో తంజావూరికి సమీపానగల శ్రీరంగపట్నం అందరికి తెలిసిందే. దానిని శ్రీరంగం అనికూడ అంటారు. అయితే ఆంధ్రదేశంలోని శ్రీరంగం ఇంటిపేరుగా గలవారు, తమిళనాడు వారని భావింప పనిలేదు. శ్రీకాకుళంజిల్లా టెక్కలి తాలూకాలో శ్రీరంగం అనేగ్రామముంది. శ్రీశ్రీ స్థూలంగా ఆ ప్రాంతపు వారే. శ్రీరంగం గోపాలరత్నం ప్రసిద్ధగాయని.

**శ్రీరామకవచం:** ఈ ఇంటి పేరు బ్రాహ్మణులలో కన్పిస్తుంది కవచమంటే, రక్షణకొరకు శరీరంపై ధరించే తొడుగు అని సామాన్యార్థం ఇక్కడ కవచమంటే తాయెత్తు బీజాక్షరాలు అంటే మంత్రం లోని ప్రథమాక్షరం లేదా, ప్రధానాక్షరాలు, ఏదైనా చెట్టు బెరడు లేక, కొండరావి ఆకుపై గాని వ్రాసి తాయెత్తుగా తయారు చేసిన దండచేతికి కట్టుకునే దానిని కవచమంటారు. ఆయా మంత్రోపాసకులు కట్టి ఇచ్చే తాయెతులు, ఆయా మంత్రాలకు అధి దేవతలైన వారి పేరుతో ఆయా కవచాలు సంభావింపబడ్డాయి అలాంటి వాటిల్లో శ్రీరామ కవచమొకటి అవి ఇచ్చేవారు శ్రీరామకవచంవారు అలా ఈ గృహనామ మేర్పడింది

**శ్రీరామనేని:** వ్యక్తినామం శా శ 1297 నాటి సింహాచలం శాసనంలో ఒక భండారి శ్రీరామనాయుని అల్లుడు శ్రీరామనాయని ప్రస్తావన వుంది

**శ్రీరామప్పగారి:** వ్యక్తినామ పూర్వక ఔపవిభక్తిక రూపం. అచార్య ఎస్ గంగప్పగారి గృహనామం

**శ్రీరముదెడ్డి:** వ్యక్తినామం శ్రీరామ, శ్రీరముగా మారింది శాశ 1305 నాటి సింహాచలం శాసనంలో శ్రీరమురెడ్డి శె(చె)ల్లాసాని ప్రస్తావన వుంది.

**శ్యామల -చామల:** చామలవారిపల్లె రాయచోటి తాలూకాగ్రామం

**సకలా:** సకల కొత్తపల్లె అనేగ్రామం పశ్చిమగోదావరిజిల్లా ఏలూరు తాలూకాలో వుంది. కడప జిల్లాలోని ఒక ప్రాంతానికి సకలసీమ అనిపేరు చరిత్రలో ఒక సకలారెడ్డి కన్పిస్తాడు సకలము అంటే సర్వము మోపిదేవిలో సకలేశ్వరాలయముంది

**సక్కుర్తి:** సగ్గు(రు)కు ఔపవిభక్తిక రూపం. గన్నవరం తాలూకా గ్రామం

**సనకా - సంకా:** శా శ 1484 నాటి వినుకొండ శాసనంలో ఒక సంకా వీరయ్యసెట్టి ప్రస్తావన వుంది అర్థం తెలియరాలేదు

**సంకిలి:** పర్లాకిమిడి తాలూకాగ్రామం

**సంకీర్తనం:** దేవుని భక్తిగీతాలను ఆలపించేవారు శా శ 1469 నాటి కదిరి తాలూకా పట్నం శాసనంలో సంకీర్తన కేశవయ్య ప్రస్తావన వుంది

**సంకు:** ఇది శంఖు శబ్దభవం దేవాలయ అర్చన కార్యక్రమాల్లో శంఖుధార పట్టడం ఒక కార్యక్రమం. అది చేసేవారికి ఈ గృహనామం స్థిరమైనది శా శ 1482 నాటి మార్కాపురం శాసనంలో ఒక సంకుబసవయ్య ప్రస్తావన వుంది ఈ సంకు ప్రస్తావన ఇతర శాసనాల్లో కూడ వుంది

**సజ్జా:** ఇది సెజ్జ సంబంధిగా కన్పిస్తోంది ప్రభువు దగ్గర ఒక అధికార స్థానంగా శాసనాలలో కన్పిస్తోంది శా శ 1085నాటి ద్రాక్షారామ శాసనంలో ఒక పాలనాయకుడు, మహామండలేశ్వర కులోత్తుంగ రాజేంద్రచోడరాజుల సెజ్జగా పేర్కొనబడ్డాడు అనంతామాత్యుని భోజరాజీయంలో కూడ ప్రభుత్వాధికారులుగా సజ్జవారు చెప్పబడ్డారు

సందర్భాన్నిబట్టి అంతః పుర పరిరక్షకులు లేక రాజప్రధాన నివాస మందిర పరిరక్షకులుగా భావింపనగును సజ్జ గృహమనగా పడకగది (శ్రీశైలం) మల్లికార్జున దేవ పవ్వళించే సజ్జ గృహం అని శా శ. 1452నాటి శ్రీశైల శాసనాల్లో పేర్కొనబడింది

**సతివాడ :** బొబ్బిలి తాలూకాగ్రామం

**సత్తాల - సత్యాల :** సత్యముపై బహువచనం సత్యాల అవుతుంది ఇది వాస్తవము, నిజము అనే అర్థాల్లోని సత్యముకాదు ఇది సత్తల అనే గ్రామం నుండి వచ్చింది ఇది అలముకునే గడ్డిమొక్క పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు తాలూకాలో వుంది.

**సత్తిరాజు :** సత్యశబ్ద వికృతి సత్తి శా శ 1505నాటి తణుకుతాలూకా జుత్తిగ గ్రామశాసనంలో ఒక సత్తిరాజు సోమరాజు ప్రస్తావన వుంది.

**సత్యకాల :** బిరుదనామం సత్యకాలం నాటినాడు అంటే కృతయుగ ధర్మాన్ని పాటించేవాడు. సత్యకాల వరదాచార్యుల ఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది

**సత్యమంగళం :** తమిళనాడులోని నెల్లూరు తాలూకాగ్రామం.

**సత్రం :** పర్లాకిమిడి తాలూకాగ్రామం .

**సంధానము (వు) :** సంధానము అంటే ప్రతి కక్షుల మధ్య ఒడంబడిక కూర్చువాడు. ప్రభువులవద్ద సంధి విగ్రహి ఉద్యోగులుండేవారు ఒక విధంగా రాయబారివంటివాడు. సమస్యయందలి పూర్వాపరాలను జాగ్రత్తగా యోచించి, ఉభయులకు ఆమోదయోగ్యమైన, గౌరవ ప్రతిపత్తులకు భంగంలేని విధంగా పరిష్కారం కనుగొనే గురుతరమైన బాధ్యతగల పదవి యిది. ద్రాక్షారామ శాసనం ఒక దానిలో ఒక సంధానము శ్రీధర పెగ్గడ పేర్కొనబడ్డాడు.

**సంధ్యపూడి : సందెపూడి :** సందెపూడి పేరుతో రెండుగ్రామాలు ఒకటి విశాఖజిల్లాలోను, మరొకటి గుంటూరుజిల్లాలోను వున్నాయి ఇది విశాఖజిల్లాలోనిది శా శ 1192 నాటి సింహాచల శాసనంలో మండలేశ్వరులైన ఒక సంధ్యపూడి గోకరాజు ప్రస్తావన వుంది.

**సప్ప - సప్పా :** సప్పలోవ అన్నే గ్రామం చోడవరం తాలూకాలో వుంది.

**సబ్బినేని :** ఇది వ్యక్తినామ పరంగా వచ్చినది. సబ్బినాయకుడు అసలుపేరు ఇందలి సబ్బిలేక సబ్బ సర్వ శబ్ద సంబంధి బుద్ధుని విద్యాగురువు సబ్బమిత్రుడు. శా శ1185 నాటి ద్రాక్షారామశాసనంలో కులోత్తుంగ రాజేంద్రచోడయరాజుల కొట్టరిగా ఒక నిడుంబ్రోలి సబ్బినాయకుడు పేర్కొనబడ్డాడు.

**సముఖం :** ఈ ఇంటిపేరుగల వారు ఇప్పుడు ఆంధ్రదేశంలో వున్నారో లేదో తెలియరాదు. అయితే ఈ పేరుతో ఒక గొప్పకవి వున్నాడు అతడు సముఖం వెంకటకృష్ణప్ప నాయకుడు. ఇతడు జైమిని భారతము, సారంగధర చరిత్రమనే వచనకావ్యాలను, అహల్యాసంక్రందనం, రాధికా స్వాంతనం అనే పద్యకావ్యాలను రచించాడు ఇతడు మధుర నేలిన విజయరంగ చొక్కభూపాలుని వద్ద దళవాయిగా పనిచేశాడు వీరి పూర్వ గృహనామమేదో తెలియరాదు.

అయితే తండ్రి మీనాక్షి నాయకుని గూర్చి చెప్పేటప్పుడు అతనిని సముఖం మీనాక్షి నాయకునిగా చెప్పాడు. సముఖమంటే ప్రత్యక్షం అని అర్థం అంటే ప్రభు సమక్షంలో ఉండేవారని సామాన్యార్థం. అయితే, ప్రభు సమక్షంలోనికి, వెళ్లడానికి, ముందు అనుమతి పొందాలి. కాని, మీనాక్షి నాయకుడు అలాంటిదేమీ లేకుండానే, ప్రభు సమక్షానికి వెళ్లగల అర్హతగల వాడుగా, అహల్యా సంక్రందన కావ్యాన్ని బట్టి అర్థమవుతోంది.

**సముద్రము:** శా.శ 1336 నాటి సింహాచల శాసనంలో ఒక సముద్రము అనంతన ప్రస్తావన కలదు. 1297 నాటి శాసనంలో సముద్రము నరేనిప్రస్తావనవుంది.

**సముద్రాల :** సముద్రాల వారి ఖండ్రిక రావూరు తాలూకాలో వుంది.

**సంపర :** కాకినాడ తాలూకాగ్రామం.

**సరదేవ :** వ్యక్తినామం. శా.శ 1317 నాటి సింహాచలం శాసనంలో ఒక సరదేవ పెద్ది నాయని ప్రస్తావన వుంది.

**సరలపూడి :** గ్రామనామం. శా.శ 1180 నాటి పాలకొల్లు శాసనంలో ఒక సరలపూండి దామరాజు ప్రస్తావన వుంది.

**సరిపల్లి :** సరిపల్లి అనే గ్రామం విశాఖపట్నం తాలూకాగ్రామం.

**సర్వదేవ :** శాశ.1301 నాటి సింహాచలం శాసనంలో సర్వదేవపెద్దినాయని ప్రస్తావన వుంది.

**సర్వేపల్లి :** నెల్లూరు తాలూకా గ్రామం.

**సలక :** బిస్సంకటాకు ఏజెన్సీగ్రామ.

**సవరం :** శా.శ. 1480 నాటి బాపట్ల తాలూకా దగ్గుపాటి శాసనంలో సవరం గూళపనాయని ప్రస్తావన వుంది. సవరం చిననారాయణ కవి సాహితీలోకానికి పరిచయస్థుడు. బహుశా చావర గ్రామనామ రూపం కావచ్చు. సవర ఒక జాతి జనులు.

**సంవేద్యుల :** ఇది రెండువిధాలుగా వర్తిస్తుంది. సంవేది అంటే మేధావి. మరొకటి సమెద్యం. ఈ శబ్దానికర్థం సముద్రం. బ్రహ్మసమెద్య మనేగ్రామం కాకినాడ దగ్గర్లోవుంది. శ్రీనాధుడు భీమేశ్వరపురాణంలో దానిని బ్రహ్మసంవేద్యంగా సంభావించాడు. శా.శ.1332 నాటి అహోబిల శాసనంలో ఒక సంవేద్యుల కేశవదేవర ప్రస్తావనవుంది.

**సాగి:** రబ్బరు సాగటం తెలుసు. యథాస్థితి నుంచి మరికొంత నిడివి పెరగడం 'కొనసాగు' తెలుసు గదా. అయితే ఈ ఇంటి పేరును చాగిగా భావించి దానికి పూర్వరూపం 'త్యాగి' తో ముడిపెట్టడం జరిగింది. చాగి వంశం వారు 11వ శతాబ్దంలో కృష్ణా జిల్లా గుడిమెట్ల ప్రాంతాన్ని పాలించారు. చావ వారు, కర్నాటివారు వీరి కూటస్థులు. ఈ ఇంటి పేరు కమ్మవారిలోను, క్షత్రియులలోను కన్పిస్తుంది. ఇతరులలో కూడా వుండవచ్చు. కారణం ఇది ఊరి పేరు. చ్యాగి అనే గ్రామం బళ్ళారి జిల్లా శిరుగుప్ప తాలూకాలో వుంది. చాగ శబ్దానికి కన్నడంలో పచ్చదనమని అర్థం. చకారం మీది యకారం వ్యవహార బలిమి వలన

వచ్చింది దీనికి కూడా ఒక హేతువుంది రాయలసీమలో పదాది మీద 'ఎ' పదముంటే దానిని 'య'కార విశిష్టంగా పలుకుతారు చేగ, చ్యాగ బీదర హళ్లి అలాగే బ్యాదరహళ్లి అయింది భాషలో ఇది సహజం బాగలేరు అనే గ్రామం కడప జిల్లా పులివెందుల తాలూకాలో వుంది దీని సామ్యం వలన చాగ ఒక మొక్కగా బోధపడుతుంది చాగనార తెలిసిందే చాగివంశంవారు శాసనాల్లో త్యాగి వంశంవారుగా సంభావింపబడ్డారు

**సాదము :** శా శ 1070 నాటి కొటిదెనశాసనంలో ఒక సాదము బైరవ ప్రసక్తివుంది. ఇతడు మహామండలేశ్వరులు త్రిభువనమల్లదేవచోడ మహారాజుల పెద్దబంటు సాదము ఎఱియమనాయకుని కుమారునిగా చెప్పబడ్డాడు సాదం అనేగ్రామం పొట్టింగి ఏజెన్సీలోవుంది.

**సాదినేని :** వ్యక్తినామం సాధు శబ్ద భావం సాదినాయకుని పల్లె హోసూరు తాలకాలో వుంది.

**సాన :** పర్లాకిమిడి తాలూకాగ్రామం

**సానిరెడ్డి:** సాని, రెడ్డి అనే రెండు పదాల కలయిక వ్యక్తినామపరంగా వచ్చిన ఇంటిపేరు సాని శబ్దం తెలుగున రెండు విధాలుగా ప్రవేశించింది ఒకటి స్వామిని శబ్ద భవం రెండవది సాహిణి శబ్ద భవం ఇక్కడ ఆ పేరుగల వ్యక్తి ప్రసిద్ధిగాంచిన వాడగుటచే అతని అనంతరం ఆ కుటుంబం వారికది ఇంటిపేరుగా స్థిరపడింది.

ఈ సాని, రెడ్డి పదాలు ఇంకా ఇతర ఇంటి పేర్లలో కూడా కన్పిస్తాయి. పెమ్మసాని, లకంసాని, మేడసాని కొమ్మారెడ్డి, తమ్మారెడ్డి, సూరెడ్డి అనేవి కొన్ని ఉదాహరణలు.

**సామంతపూడి :** ప్రకాశంజిల్లా దరిశి తాలూకా గ్రామం

**సామినేని :** వ్యక్తినామం స్వామి శబ్దం సామిగా మార్పుచెందింది

**సామిరెడ్డి :** వ్యక్తినామం స్వామిశబ్ద భవం సామి. శా శ 1323 నాటి సింహాచలశాసనంలో ఒక సామిరెడ్డి లకుమిసాసుమల్లుని ప్రస్తావన వుంది

**సాయపనేని :** వ్యక్తినామం సాయి అప్పలకలయిక సాయప్ప సాయి శబ్దానికి మూలం శాయి విష్ణువుకు సంకేతము శేషతల్పశాయి అగుటకారణము నేని నాయకశబ్దంకుండి వ్యుత్పనము శా శ 1546 నాటి నందికొట్కూరు తాలూకా నాగలూటి గ్రామశాసనంలో రాజ్యపాలకులైన సాయపనేని తిమ్మనాయడు ప్రస్తావింపబడ్డాడు

**సారథి :** రాజాంతాలూకాగ్రామం

**సాలికి :** సాలూరు తాలూకాగ్రామం.

**సాలూరి - సాలూరు :** ఈ పేరుతో శ్రీకాకుళం, చెంగల్పట్టు జిల్లాల్లో గ్రామాలున్నాయి.

**సాళువ :** ఇది వంశ నామం పిదపగృహనామమైనది కృష్ణదేవరాయ మంత్రి తిమ్మరుసు, ఇంటిపేరుసాళువ శా శ1435 నాటి అనంతపురంజిల్లా తాడిపర్తి శాసనంలో సాళువగోవిందయ్య అనే వ్యక్తిపేర్కొనబడ్డాడు మరో శాసనంలో సాళువ తిమ్మయగారి ప్రస్తావన వుంది

**సొవాసి :** ఇది స్నేహితుడనే అర్థంలో ప్రవర్తిల్లినదో లేక సుఖవాసి వంటి ఇంటిపేర్ల వంటిదో తెలియరాదు. ప్రస్తుతం ఈ ఇంటిపేరు గల వారున్నారో లేదో తెలియరాలేదు. శా.శ.1169నాటి సత్తెనపల్లి తాలూకా వేల్పూరుశాసనాల్లో మహామండలేశ్వర కోట దొడ్డకేతరాజు కుమారుడు గణపయ సేవకుడైన అడపకేతన బోయుడు తన తండ్రి సావాసి మల్లినాయనిగా చెప్పికున్నాడు. సహవాసి సావాసి అవుతుంది.

**సింగం :** వ్యక్తినామం సింగము సింహశబ్దభవం.

**సింగు :** వ్యక్తినామం. సింహశబ్దభవం.

**సింగునాయక - సింగునేని :** శా.శ. 1283 నాటి సింహాచల శాసనంలో ఒక సింగునాయక గోపీనాథ నాయని ప్రస్తావన వుంది. సింహశబ్ద భవం సింగ.

**సిద్ధవటం :** కడపజిల్లా గ్రామం. శా.శ. 1452నాటి కత్తెరగండ్ల శాసనంలో ఒక సిద్ధవటం ఎల్లమరసు ప్రస్తావన వుంది.

**సిద్ధిరాజు :** వ్యక్తినామం. సిద్ధిరాజు రంగరాజు ఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది.

**సిరిగిరిరాజు - శ్రీగిరిరాజు:** వ్యక్తినామం. చూడు. శ్రీగిరిరాజు. సిరిగిరిరాజు భద్రరాజు ఖండ్రిక తిరుత్తని తాలూకాలో వుంది.

**సివరాం - సివరం** చీపురుపల్లె తాలూకాగ్రామం

**సివల - శివల :** తూర్పుగోదావరి జిల్లా రామచంద్రాపురం తాలూకా గ్రామం.

**సింహాద్రి :** గ్రామనామం సింహాచలం విశాఖపట్నం సమీపంలోని ప్రసిద్ధవైష్ణవక్షేత్రం. వ్యక్తినామంగా కూడా వ్యవహారముంది. సింహాద్రి సత్యనారాయణ మంత్రిగా పనిచేశారు.

**సుకమంచి :** ఇది కడపజిల్లా జమ్మల మడుగు తాలూకాగ్రామం. శాసనంలో సుకమంచి పల్లెగా చెప్పబడింది.

**సుఖవాసి - సుఖాసి :** గ్రామనామం పోల్చి చూడు వింధ్యవాసి, దీర్ఘాసి గ్రామాలు సుఖాసి దానికి సంక్షిప్తరూపం.

**సుంకం :** పన్ను అదివసూలు చేసే అధికార్లు సుంకర్లు. కాగా ఇక్కడ వ్యస్తంగా గృహనామంగా వర్తించింది. శా.శ. 1565 నాటి కోయిలకుంట్ల శాసనంలో సుంకం బసిరెడ్డి ప్రస్తావనవుంది.

**సుంకి - సుంకు:** సుంకిఅనే గ్రామం పార్వతీపురం తాలూకాలో వుంది.

**సుంకేసుల :** ఈ పేరుతో కర్నూలు, ప్రకాశం జిల్లాలో గ్రామాలున్నాయి.

**సుదర్శనం :** శ్రీ మహావిష్ణువు చక్రము సుదర్శనం. వైష్ణవుల్లో గృహనామం. శా.శ1469 నాటి కదిరి తాలూకా పట్నం శాసనంలో సుదర్శనం ఓబుళయ్య ప్రస్తావన వుంది.

**సుద్దపల్లి :** ఇది గుంటూరుజిల్లా గ్రామం.

**సుద్దమల్ల :** కోయిలకుంట్ల తాలూకాగ్రామం.

**సురభి:** ఈ పేరుతో కడప, శ్రీకాకుళం జిల్లాల్లో రెండు గ్రామాలున్నాయి

**సుసర్ల:** గ్రామనామం సుసరాం శ్రీకాకుళం తాలూకాగ్రామం. సుసర్ల దక్షిణామూర్తి సంగీతంలో ప్రసిద్ధులు

**సూరపనేని:** సూరప్పనాయకుడు అనేది వ్యక్తినామం ఇందలి సూరశబ్దం సూర్యశబ్ద సంబంధి. చరిత్రలో శా శ 1093 నాటి గుంటూరుజిల్లా మోదుకూరు శాసనాల్లో, ఆ గ్రామపాలకునిగా ఒక సూరపనాయకుని ప్రస్తావనవుంది ఇతడు మేదరాజు, కాపసానుల కుమారునిగా, చాలుకరాజ్య మూలస్థంభాయ మానునిగా సంభావింప బడ్డాడు రాజేంద్ర చోదుని కూటస్థునిగా చెప్పబడ్డాడు నాలుగు వందలగ్రామాలకు ఇతడు అధిపతిగా చెప్పబడ్డాడు

**సూరపరాజు:** సూర అప్పలకలయిక సూరప్ప. వ్యవహారంలో సూరపఅయింది దానిపై రాజు చేరింది సూర శబ్దం సూర్య శబ్దసంబంధి హంపికి చెందిన శా శ. 1419 నాటి శాసనంలో ఒక సూరపరాజు అన్నయ పేర్కొనబడ్డాడు. ఇతడు కాముంగొలని వాస్తవ్యునిగా, చెప్పబడ్డాడు ఇతడు బ్రాహ్మణధర్మాలైన యజన యాజన అధ్యయన, అధ్యాపన, దాన, ప్రతిగ్రహ షట్కర్మలను పాలించినవాడు యజుశ్శాఖీయుడు. అంగీరస, బార్హస్పత్య భారద్వాజ ఇతి త్ర్యార్షేయ ప్రవరగోత్రజుడు అనగా ఈ అన్నయ నాటికే సూరపరాజు మూలపురుషుడైనాడు.

**సూరం:** సూర్యశబ్దభవం సూరంవారిపల్లె చంద్రగిరితాలూకాలో వుంది.

**సూరయ్య:** వ్యక్తినామం సూరయ్యవారిపల్లె పుంగనూరు తాలూకాలో వుంది.

**సూరసాని:** వ్యక్తినామం శా శ 1199 నాటి పాలకొల్లు శాసనంలో ఒక సూరసాని అరవిందనాయని ప్రస్తావన గలదు.

**సూరి:** రాయఘడ ఏజెన్సీగ్రామం

**సూరె:** సూరె అనేగ్రామం చంగల్పట్టు జిల్లాలోవుంది. శా శ 1197నాటి పొన్నూరు శాసనంలో సూరెఅప్పన ప్రస్తావనవుంది.

**సూరెడ్డి - సూర్రెడ్డి:** సూరయరెడ్డికి సంక్షిప్తనామాలు ఇది సూర్యసంబంధి చరిత్రలో శా శ 1250 నాటి ద్రాక్షారామశాసనంలో కాకతిరుద్రదేవ మహారాజుల నిజభృత్యుడైన కారపరతి అచ్చయరెడ్డి కుమారునిగా ఒక సూరయరెడ్డి ప్రస్తావన వుంది.

**సెట్టివాడ:** గ్రామనామం శా శ 1078 నాటి ముఖలింగం శాసనాలలో ఒక సెట్టివాడ ఎఱపోతనాయకుని ప్రస్తావన వుంది

**సేకు:** గ్రామనామ పూర్వపదం సేకూరు సేకువారిపల్లె పుత్తూరు తాలూకాలో వుంది.

**సేనాని:** ముఖలింగం శాసనాలలో ఒక సేనాని చోడపోత ప్రసక్తివుంది.

**సొమ్ముల:** సొమ్ములు అంటే ఆభరణాలని సామాన్యార్థం - ఇది స్వమ్‌శబ్ద భవం. ఉత్తరాంధ్ర జిల్లాలో సొమ్ములంటే గో మహిషజాతి పశువులు. శా శ. 1064 నాటి ముఖలింగం శాసనాలలో వైశ్యుడైన ఒక సొమ్ముల దేవన ప్రస్తావన వుంది.

**సోద :** పర్లాకిమిడి తాలూకాగ్రామం.

**సోల - శోధ :** పర్లాకిమిడి తాలూకాగ్రామం.

**సోమంది :** గ్రామనామం. సోమంది యజ్ఞన్న శాస్త్రి ప్రసిద్ధ కథకులు.

**సోమయాజులు :** యజ్ఞ యాగాది క్రతువుల్లో సోమయజ్ఞం ఒకటి. అది సాంగంగా పూర్తిచేసిన వారిని సోమయాజులు అంటారు. కవిత్రయంలోని తిక్కన, అలా సోమయాజియై భారత రచనకుపక్రమించాడు. శా.శ. 1197 నాటి గుంటూరుజిల్లా పెనమదం గ్రామశాసనంలో ఒక సోమయాజుల మంచన ప్రస్తావన వుంది. శా.శ.1203 నాటి జూలకల్లు శాసనాలలో కాకతీయరుద్ర దేవమహారాజుల రాయసకలసేనాధిపతి సోమయాజుల రుద్రదేవుడు ప్రస్తావింపబడ్డాడు. శా.శ. 1218నాటి సింహాచల శాసనంలో ఒక సోమయాజుల శ్రీధరుని ప్రస్తావన వుంది.

**సోమిరెడ్డి :** వ్యక్తినామం. సోముడు: చంద్రుడు. శా.శ. 1313 నాటి సింహాచలం శాసనంలో ఒక సోమిరెడ్డి లకుమిరెడ్డి ప్రస్తావన వుంది. శా.శ. 1318నాటి సింహాచల శాసనంలో ఒక సోమిరెడ్డి తమ్మిరెడ్డి ప్రస్తావన వుంది.

**సోమూరి :** గ్రామనామం. సోమూరి వెంకట్రామయ్య స్వాతంత్ర్యసమరయోధులు. విజయవాడగాంధీగా ప్రసిద్ధులు.

**సోంపల్లి :** నెల్లూరిజిల్లా ఉదయగిరి తాలూకాగ్రామం.

**స్వయంపాకులు :** దేవాలయానికి సంబంధించిన పనిపాటల్లో నియుక్తులైన వారుగా శాసనాల్లో ప్రస్తావింపబడ్డారు. 'ఈ గ్రామాలపారుపత్యం చేసి స్వయంపాకులను తిరువారాధకులను పరిచారకులను బొక్కస భండారాలు వుగ్రాణము మొదలైన పనులకు' అనేవిధంగా క్రీ.శ 1478 నాటి శాసనంలో చెప్పబడింది.'

**స్వర్ణ :** బంగారం అనే అర్థంలో స్వర్ణ శబ్దం తెలుసు. అయితే ఇది గ్రామనామం. బాపట్ల తాలూకాలో, కారంచేడుకు దగ్గరలో వుంది.

**స్వర్ణపాలి :** వ్యక్తినామం. స్వర్ణ అప్పలకొండ స్వర్ణప్ప.

**హండే :** శా.శ. 1565నాటి కోయిలకుంట్ల శాసనంలో హండే హనుమప్పనాయని ప్రస్తావన వుంది. హండే అనేది ఒక రాజవంశం. ఈ వంశం పేరుమీదుగా అనంతపురాన్ని హండే అనంతపురం అంటారు.

**హనుమ - హన్మ :** ఆంజనేయుడు. శా.శ. 1281 నాటి సింహాచలం శాసనంలో ఒక హన్మ అంగేశ్వరుని ప్రసక్తి వుంది.

**హనుమానులు :** దైవనామం గృహనామంగా ప్రవర్తిల్లినది.



# రచయిత గురించి



పేరు: యార్లగడ్డ బాలగంగాధరరావు.

తలిదండ్రులు: యార్లగడ్డ కృష్ణమ్మ, భూషయ్యగారలు.

సాకినవారు: మండవ మాణిక్యమ్మ, నాగయ్యగారలు.

స్వస్థలం: పెదప్రోలు, దివితాలూకా, కృష్ణాజిల్లా.

విద్యాభ్యాసం : పోస్టుగ్రాడ్యుయేషన్: ఎం.ఏ (తెలుగు) ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు.

పరిశోధన : పిహెచ్.డి.నాగార్జున విశ్వవిద్యాలయం.

విషయం : అనంతపురం జిల్లా గ్రామ నామాలు.

బోధన : (పోస్టుగ్రాడ్యుయేషన్) తెలుగుశాఖ, ఆంధ్రవిశ్వవిద్యాలయం, నాగార్జున విశ్వవిద్యాలయం.

ప్రస్తుత ఉద్యోగం : రచనావ్యాసంగం.

ఇతర రచనలు : ఒక ఊరికథ, మాట-మర్మం, అక్షర యజ్ఞం

ఇతరములు : (1) రెండేండ్లు జూనియర్ రీసెర్చిఫెలోగా, తెలుగు వ్యుత్పత్తి పదకోశ నిర్మాణంలో.

(2) ఎడిటర్, ఆదివాసి ఒరియా-తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు.

(3) ఆదివాసి ఒరియా-తెలుగు వాచకాల తయారి.

పరిశోధక దర్శకత్వం: 24 పిహెచ్.డి., 12 ఎం.ఫిల్ పట్టాలు ప్రదానం చేయబడ్డాయి.

పరిశోధక సంస్థలతో గల సంబంధం:

(1) ఉపాధ్యక్షుడు: ప్లేస్‌నేమ్స్ సొసైటీ ఆఫ్ ఇండియా, మైసూరు.

(2) మేనేజింగ్ కమిటి మెంబరు: అంతర్జాతీయ నామ విజ్ఞాన సంఘం, బెల్జియం.

(3) మెంబరు అమెరికన్ నేమ్స్ సొసైటీ, న్యూయార్క్

(4) మెంబరు ద్రవిడియన్ లింగ్విస్ట్స్ అసోసియేషన్, తిరువనంతపురం.

(5) మెంబరు మిథిక్ సొసైటీ, బెంగుళూరు.

(6) మెంబరు నేమ్స్ సొసైటీ (plans) కేరళ.

విదేశీయానం : రెండు మారులు. కెనడా, ఇంగ్లాండు, ఫిన్లాండు.

పరిశోధక పత్రాలు : జాతీయ సదస్సులలో 28, అంతర్జాతీయ సదస్సులలో 2.

వివిధ పత్రికల్లో వ్యాసాలు, రేడియో, టి.వి.ల్లో ప్రసంగాలు.